# విషయానుక్రమణిక

## ఏప్రిల్ 1979







23-4-1979 చైత్ర బహుళ ద్వాదశి సోమవారము

కళాప్రపూర్ణ, దేశోద్ధారక శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగా

111వ జయంతి

# మ్రొక్కితే దేవుడు....

## శ్రీ పులికంటి కృష్ణారెడ్డి

శ్రీనివాస ! ఈశ ! శేషశైలనివాస !
చిత్తగింపు ! — మదిని చీల్చురంపు
వినగకంటగింపు విశ్వలీలల సొంపు
దేవ కలియుగేశ ! తిరుమలేశ !

దేశకాలగతులు తిరుగతోడగబట్టి
మధనపడిన మదిని మబ్బులెక్కె
కుండపోతవోలె కురియును కన్నీరు
దేవ కలియుగేశ ! తిరుమలేశ !

నెమలి కంటిలోన నీరుగారుచునుండ
కటికవాని కెట్లు కరుణగలుగు ?
అటవిని వసియించు కటికవాడవునీవు !
దేవ కలియుగేశ ! తిరుమలేశ !

కటికవాని గుండె కరగింప తలపెట్టి
కలముబట్టినాను ! — కవినినేను
కల్పనములుగావు కలిగిన మాటలే
దేవ కలియుగేశ ! తిరుమలేశ !

కలిగినట్టిమాట కంటిలోపుల్లయ్యె
చెప్పదలచువాని నొప్పిపెట్టు
నాదిద్రేలు ! — మరియు నాదియేకన్నును !
దేవ కలియుగేశ ! తిరుమలేశ !

కోడికూత మేలుకొలుపంగనే లేచి
కపిల తీర్థమునకు కాలు కదిపి
ముక్కుమూసి మూడు మునుకలువేసితి
దేవ కలియుగేశ ! తిరుమలేశ !

మునిగినాను నీట మున్మారునీమాట
తలచినాను నోట తరచిచూడ
తనువుమీది మురికి తలదాచె మదిలోన
దేవ కలియుగేశ ! తిరుమలేశ !

మనసు కడిగి మంచి మార్గమ్ము చూపును
దేవుడనుచు మనసు దిట్టపరచి
దర్శనమ్ము కొరకు దారిని పడినాను
దేవ కలియుగేశ ! తిరుమలేశ !

మలినమ్మైన హృదిని కలచు సందియములు
సందెడయ్యెనయ్య ! సమయమిదియె —
విన్నవించుకొనెద వినుము ఓపికయున్న
దేవ కలియుగేశ ! తిరుమలేశ !

మొట్టమొదటి కొండ మోర విరిచినిల్చి
చుక్కలంటుచుండ చోద్యమాయె !
ఎక్కలేననుకొని వెక్కిరించకుమయ్య
దేవ కలియుగేశ ! తిరుమలేశ !



శ్రీమతి పి. రాధామహాలక్ష్మి

# వైదికాచారములు - కాశీఖండము

ఆంధ్ర మహాకవీశ్వరులలో కవిత్రయము వారితరువాత పేర్కొనదగినవాడు సర్వతోముఖ పాండిత్య భూషితుడు, సకలశాస్త్రకళా విశారదుడు శ్రీనాథుడ. శ్రీనాథు డుభయ భాషాప్రవీణుడు; సంస్కృతమునను, ఆంధ్రమునను అసదృశ ప్రయోగ కల్పనా దురంధరుడు. అతనిది అనర్గళ ధారా సముల్లసితమైన శైలి. అనన్యము, అసదృశము, ప్రౌఢధాటీ చమత్కార గంభీరమును అయిన కోమల శబ్ద సముదాయముతో నిరుపమానమై తనరారుచుండును. ఈతడు పెక్కు కావ్యములను రచించి పెక్కు ప్రభువులకు కృతి యిచ్చెను. వీటిలో శృంగార నైషధము, భీమేశ్వర పురాణము, హర విలాసము, కాశీ ఖండము అనునవి మహా కావ్యములు. శివరాత్రి మాహాత్మ్యము తరువాత లభ్యమైన గ్రంథము. వీధినాటకము, పల్నాటివీరచరిత్రయు నితని రచనలే. అవి ఈతనివి కావనువారును లేకపోలేదు. 'యశసే అర్థకృతే' అనునట్లు కొందరు కవులు కావ్యములు రచించియు కీర్తి నాశించు ఇతర ప్రఖ్యాత కవులపేర ప్రచురించుటయు అప్పుడప్పుడు జరుగుచుండును. అట్లే బిల్హణీయముబో వండిపెద్ది కృష్ణ స్వామిచే రచింపబడినట్లు, ఆ శ్వాశాంతమున నున్న చక్రబంధమువలన ద్యోతకమగుచున్నది. శ్రీనాథుని వీధి నాటకము గూడ నిట్లేగా నోపును. ఇతఁడు 'చిన్నారిపొన్నారి చిరుత కూకటినాడు రచియించితి'ని అన్న మరుత్తరాట్చరిత 'నూనూగు మీసాల నూత్న యౌవనమున' నొడివిన శాలివాహన శప్తశతి మన కిప్పు డలభ్యములు. అది యాంధ్రుల దురదృష్టము.

శ్రీనాథుని సారస్వతమున ఆంధ్రత్వ ముట్టిపడుచుండును. ప్రదేశ వర్ణనలతోను, ఆచార ఉత్సవములను చిత్రముగా వర్ణించుటలోను తెలుగుతనము తొణికిసలాడుచుండును. ఉత్సవ వైభవము, ఆచార వ్యవహారము, కడుంగడు రమణీయముగా జిత్రించి నిజ కావ్యముల కనూన శోభను వెలయింప జేసెను. శ్రీనాథుడు శైవకవి. అతడు తన కావ్యము లన్నిటను శైవమత ప్రాచుర్యము జేగీయమానముగా కనులకు గట్టినట్లు చిత్రించెను. కొన్ని యాచారములు మూలములో లేకున్ననూ తత్తద్ప్రదేశోచితముగా ఆయా స్థలములలో తన నాటి కాలమాన పరిస్థితుల ననుసరించి నవియూ యనుపించునట్లు శ్రీనాథుని కృతులలో వర్ణింపబడెను ఇట్టివి యెక్కువగా కాశీ ఖండమునందును, క్రీడాభిరామమునందును, శివరాత్రి మాహాత్మ్యము నందును, భీమఖండమునందును గన్పించును. ఉత్సవములు పండుగలు మున్నగునవి యితర కావ్యములందును వర్ణింపబడెను.

ఆచారములు రెండు విధములు. కొన్ని ధర్మములు నిగమింపబడి ప్రజలచే విస్మృతముగా నాచరింపబడునవి. మఱికొన్ని సంఘ జీవితములో బహుమాన పురస్సరముగా నాచరింపబడి యుత్తమ ధర్మములుగా విరాజిల్లుచున్నవి. ప్రస్తుతమున శ్రీనాథుని కాశీ ఖండము మాత్రమే ప్రశంసింపబడును.

వీరభద్ర భూపాలుడు సామంత నృప వర సీమంతినీ జన శ్రేణి గొలువ పేరోలగంబుండి శ్రీనాథుం పిలువంబంపి ప్రశంసించి, కర్పూర తాంబూల సహితంబుగా జాంబూన దాభరణంబు లిచ్చి అప్పుడు చెప్పంబూనిన కాశికాఖండము తన కంకితము సేయగోరెను.

సదాచారములు—పంచమాశ్వాసమున అగస్త్యునకు కుమార స్వామి సదాచారములను గూర్చి తెలియజేసెను. మల మూత్రాదులు విసర్జించు విధానము, దంత ధావన మెట్లు చేయవలెను, స్నాన మెవ్విధి నాచరింపవలయును, ఆచమన విధానమెద్ది, సంధ్యా వందన మెట్లాచరింప వలయునో ప్రబోధించెను. స్త్రీ లక్షణముల దెలిపి గృహలక్ష్మి కాదగినవారల గూర్చి నుడివెను. పంచమాశ్వాసమున—

సీ॥ ''వెడలి యూరికి నూఱు విండ్లు దవ్వున దైత్య
దెస బహిష్కార్యంబు దీర్పవలయు
నన్నూఱు విండ్ల మానమగు దూరమ్మున
బయలి కేగుట పాడి పట్టనమున
దలము నుంగిడి తృణంబులు గప్పిన ధరిత్రి
విణ్మూత్ర జలముల విడవవలయు
జెవి బ్రహ్మ సూత్రంబు దవిలింపవలయును
... ... ... ... ... ... గలశ జన్మ''

సంధ్యావందనము—సచ్ఛ్రోత్రియులు త్రి సంధ్యా సమయంబుల, సంధ్య వార్చి గాయత్రి జపియించి, సూర్య భగవానున కర్ఘ్యప్రదాన మొసగవలెను. అది సదాచారము. కుబేర వృత్తాంత సందర్భమున బ్రాహ్మణాచారమంతయు జెప్పబడెను. అదే గుణనిధి కధ. అందు తల్లి కుమారుని దుష్కర్మలను విమర్శించుచుండినను, తండ్రి వాని దుశ్చేష్టితములెల్ల నెరుంగ కుండ యడవి కప్పిపుచ్చు చుండును. చివరకా తండ్రి —

''ఊచ ముట్టుగ నీవు నీ యొంటి కొడుకు
బాడు చేసితి గృహము నిర్భాగ్యురాల''

(ఆ. 4. ప. 109)

అని కుపుత్రత్వంబు కంటె నపుత్రత్వంబుమేలని కులపాంసనుండైన వీని నొక్కనిం త్యజియించి కులంబు రక్షించుట నీతియ కదా యని పలికి కోపావేశంబున కటకటంబడుచు నాహ్నికంబైన క్రియా కలాపంబు నిర్వర్తించి కుమారునకు తిలలు, ధర్భయు నుదకంబు దెచ్చి

ని వా పాంజలుయి ఇచ్చి కొన్ని దినములకు బిమ్మట నొక్క శ్రోత్రి యుని పుత్రిం బెండ్లియాడి గృహస్థ కార్యాదులు నిర్వర్తించు చుండెను. కొడుకుపై తీపి మమకారముకన్న బ్రహ్మణాచారమైన కులాచారమే ప్రధానమని నిరూపించెను. మహా భాగవతమున సప్తమ స్కంధమున ప్రహ్లాద కథయందు హిరణ్యకశిపుడు కులము నిర్దోష మొనర్చుటకు కులద్రోహి, నీచుడని కుమారుని జంపుటకు వెనుకాడ లేదు.

"ఆచార్యోక్తము గాక బాలురకు మోక్షాసక్తి బుట్టించి నీ
వాచాలత్వము జూపి విష్ణు సహితున్ వర్ణించి మద్దైత్యవం
శాచారంబులు నీఱు సేసితివి, మూఢాత్ముం గులద్రోహి నిన్
నీచుం జంపుటమేలు, చంపి కులమున్ నిర్దోషమున్ జేసెదన్."

కుల ధ్వంసంబు గావించుట తప్పని పాండురంగ మాహాత్మ్యమున నిగమశర్మ అక్కయు బోధించును. నిగమశర్మ ఇంటగల ధనమంతయు వెచ్చించి చెడు త్రోవలం బోవుచుండ, నాతని అక్క యాతని బాగుచేయు తలంపున భర్తతో పిల్లవానితో ఇంటి కేతెంచును. తమ్మునికి హితబోధలను గావించును. వైదికాచారమునూ, కులాచారమునూ మంట కలుప వద్దని వేడుకొనును. తృతీయాశ్వాసమున —

సీ॥ పరమేష్ఠినుండి నీ తరము దాక విశుద్ధ
తరమైన వంశంబు దలపవైతి
తఱి దక్కియున్న యీ తలిదండ్రుల జాల
పఱచతై సంతోష పఱచవైతి
నగ్ని సాక్షిగ బెండ్లియాడిన యిల్లాలి
నిల్లాలి తాకార నొల్లవైతి
ధర్మ శాస్త్రార్థ విత్తముల విత్తములచే
నలరించి విఖ్యాతి నొందవైతి

తే॥ శీల మఖిలంబు నిది పిల్లి శీలమనుచు
జదువు లివి యెల్ల జిల్కల చదువులనుచు
దోడివారలు నవ్వ నాతోడ యేల
వేఱ వైలవి యీ గుణంబేల నీకు ?

అని మందలించి ఆమె మరల —

శా॥ "వీరావేశము దాల్చి సర్వ ధనముల్ వెచ్చింతు గాకేమి ము
క్కారుం బంచు నఖండ సేతు వృతముల్ కాశ్మీర ఖండం పుగే
దారంబుల్ తెగనమ్మగా జనునె నిర్దారుండవే వెన్క నె
వ్వారున్ లేరె సహోదరాదులు, కులధ్వంసంబు నీ కర్జమే."

యని మందలించును.

## దక్షిణ యిచ్చుట -

ఏదేని వైదిక కార్యము సేయునపుడు దక్షిణ యిచ్చుటొక యాచారము. చంద్రుడు కాశి యందు "హిరణ్య గర్భాత్రి భృగువులు ఋత్విజులుగా, హరి సదస్యుండుగా, సినీ కుహూద్యు పుష్టి ప్రభావ సుకీర్తి ధృతి లక్ష్మలనం దొమ్మండ్రు ధర్మపత్నుల తోడం గూడి యుమామహేశ్వర ప్రీత్యర్థంబు రాజసూయా ధ్వరంబు నొనర్చి యసావ్యంబైన యౌదార్యంబున —

ఉ॥ "దక్షిణ యిచ్చె ముజ్జగము దానగుణ ప్రవరుండు లీల ఫా
లాక్షుని సన్నిధిన్ మఘ సమాపన కాలమునందు దార కా
ద్యక్షుడు కాశికా పురమునందు సదస్యులకున్ బ్రసాద సం
రక్షిత సర్వ విష్టపుడు రాజు ప్రతాప విరాజమానుడై"

చతుర్థాశ్వాసము—ప. 179.

## భిక్ష, అతిధి పూజ -

సన్యాసి భిక్షాటనమునకు వచ్చినపుడు భిక్ష పెట్టుట గృహస్థ ధర్మములలో నొకటి. అతిధికోసం వేచియుండుట నిత్యాచారము. కొందరు అతిధి పంక్తిని లేకున్నచో భోజనము మానుకొనుట కూడ కొందరికి వ్రత విశేషము.

తే॥ వైశ్య దేవాది విధుల నన్నింటి దీర్చి
యరసియున్నాడు నా భర్త యలిది రాక
నతిధి పంక్తికి రాకున్న నారగింప
డొంటి నొకనాడు బతియెట్టి యోఱకమునను

సప్తమాశ్వాసము— ప. 166.

## గృహప్రవేశ మహోత్సవము

నందికేశ్వరుండు నమ్మహోత్సవ కాలంబా సన్నంబగుట జూచి యిట్లనియె.

సీ॥ ఊర్జమాసంబున నుదు రాజు నభివృద్ధి
ప్రవల పద్దినంబున భాస్కరుండు
... ... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ... ...
గాచి యున్నారు నీ రాకంగాలకంబ
వేగ విచ్చేయు గేహ ప్రవేశమునకు

సప్తమాశ్వాసము — ప. 219

వ॥ అని నందికేశ్వరుండు విన్నవించిన బరమానంద కందళిత హృదయారవిందుడై యిందు శేఖరుండు విశాలాక్షీ సహితుండై మోక్షలక్ష్మి విలాస దర్పణంబైన యంతః ప్రాసాద

మందిరంబు ప్రవేశించె ..... ... ఇట్టింగి గృహప్రవేశ మహోత్స వారంభంబు త్రిభువన దృక్కరంభంబయ్యె......అ. 7–ప. 220.

గృహ యజమాని గృహప్రవేశ మహోత్సవ సమయంబున వచ్చిన యతిథుల గౌరవించవలయును.

తే॥ "అవసరం బిచ్చి శివుడు బ్రహ్మచ్యుతాది
దేవతల గౌరవించె నతి ప్రియమున
నటు విశేషించి మధుకైటభా సురారి
నాదరించెను గరవం బతిశయిల్ల.

అ. 7-ప. 222.

సూర్యోపాసన– సూర్యోపాసన చేయు నాచారము సుప్రసిద్ధము. అంతేకాదు 'ప్రణవాదిగా, నమోంతంబుగా పేరు పేర అర్ఘ్య పాత్రంబు మౌళి పర్యంత మెత్తుచు నర్ఘ్య మీయవలయును.

అనేక కారణంబులచే వివిధ విధంబుల సర్వులూ
"ప్రతి దినంబున ప్రాతరారంభవేళ
... ... ... ... ... ...
... ... ... ... ... ...
భక్తిసం భజియింతురీ పద్మబంధు."

తీర్థయాత్ర – నేటికిని తీర్థయాత్రల సేవించ నేగినపుడు భార్యా ద్వితీయుడై వెళ్ళుట యాచారము. అగస్త్యుడట్లే లోపాముద్రతో గలసియే ప్రయాణించెను.

సీ॥ "వింధ్యా చలేంద్ర! పృథ్వీభృత్కుల శ్రేష్ఠ!
దక్షిణా పథము తీర్థంబు లాడ
బోవు చున్నార మీ పువ్వు బోఁడియు నేను...
... ... ... ... . ...
.. ... ... ... ... ..."

అ. 2–ప. 163.

సంతానము – సంతానము పతి నియోగమున పొందు ఆచారమునూ కలదు. అప్సరోలోక వృత్తాంతమును శివశర్మకు జెప్పచూ–

తే॥ "మాంత్రి కుండైన యొక సిద్ధ మౌనినొండె
నొక్క వేలుపు నొండె ప్రియుండు వనుప
పుత్ర సంతాన లబ్ధికై పొందినట్టి
లోల లోచన కప్సరోలోక మబ్బు"

అ. 3–ప. 172.

పితృభక్తి– ప్రతి తనయుఁ, తనయ ఉదయమందు లేవగనే జననీ పాదములకు ప్రణమిల్లి,తండ్రి పాద ప్రక్షాళన సలిలోపాశనము చేయవలయును. దానినా బిడ్డ కాయుష్యమగును. వైశ్వానరుని జూడబోయిన నారదుని ఉప దేశమున నీ యాచారము ప్రకటీకృతమగుచున్నది.

కం॥ రే పాడి గొడుకు జననీ
శ్రీ పాదములకు నమస్కరింపఁగదగుద
డ్రి పాద క్షాళన సలి
లాపోశన మెపుడు సుతుల కాయుష్య మగున్.

అ. 4 - ప. 19.

అని జననీ జనకుల గొల్చుట తనయునకును ముఖ్యమైన ధర్మమని పలుకును.

సేవక లక్షణము :– సేవకుడుత్తరము గైకొని వచ్చిన, తిన్నగా యజమానుని చేరి ఆతనిచేత నాయుత్తరం బిడుట మర్యాద కాదు. తానాయుత్తరమాతని బంటుచే తాను వద్ద నుండియే పంపవలెను. వైనతేయుడు విష్ణులేఖను గొనివచ్చి 'శివుండాసి, యంతంత సాష్టాంగ దండ ప్రణామంబు లాచరించుచు చేరవచ్చి నందికేశ్వరుని చేతికి సందేశ పత్రిక యిచ్చి తత్సమీపంబున బద్ధాంజలియై యుండె. తామును, గజాస్యుడు, లక్ష్మియు గలిగి జేసినట్టి కైలాటము సంఘటిల్లె సకలార్థము దేవర యాజ్ఞ పెంపునన్ అనుచు కైటభ దైత్యవైరి లిఖించి తన చట్టు (శిష్యుడు) ఖగేంద్రునకిచ్చి బంచెను.

దేవతలకు నమస్కరించునపుడు 'అంజలులు ఫాలభాగంబునందు గూర్చి' చేయవలెనని దాక్షాయణి తండ్రి యజ్ఞమునకు వెంచేసిన సందర్భములో చెప్పబడెను.

దురాచారములు :– గొడ్డు వీగి కన్న బిడ్డండు కావున, నొక్కరుండ కాననుత్పలాక్షి ధూర్తుడైనవాని దుశ్చేష్టితము లెల్ల నదిపు నెఱుగ నీయకడనుచు, భర్త యెన్నడైన పుత్రుని విషయమై 'స్నానమాడెనె? వార్చెనె సంధ్య? యగ్నిహోత్ర మొనరించెనే? యింతియుని ప్రశ్నింప నింతదడవును నాయొద్ద నిచట నుండి యరిగె జదువంగనని భర్తకు అతివ మొఱగునట. పిల్లవానిపై గల నధిక ప్రేమయే తల్లి నిట్లు చేయించినది. ఆతడు తన దుర్వర్తనముల మానవలెనని 'మూడా కర్మాంతరంబున షోడశ వర్షంబున గృహ్యోక్త ప్రకారంబున నతనికి వివాహంబు గావించిరి.

అ. 4– ప. 88.

'మీ తండ్రి కోపగాడౌనా కాడా? నీ వొనరించుచున్న దర్వర్తనము దెలిసినచో కల్లతనము పలుమాఱు కప్పిపుచ్చుట్టి నామీద చంపంగ నఱుగ కుందునా' యని బాధపడినది. నీవు చెడుగులగూడి పట్టణము వీధుల వీధుల వ్రేటి హాడవై ధౌర్త్యము లాచరించుట ఘీరధకునకు దెలిసెనేని నీతమున జీరయు గూడను లేక చెడుదువు కదా పుత్రకాయని మొత్తుకున్నది. కాని చేతులు కాలిన పిమ్మట ఆకులు పట్టుకున్నట్లాయెను.

పిల్లవాడు, యౌవనారంభమున, చెడు నడతలను నేర్చినవాడు, తన దుర్వర్తనముల మానలేదు. తండ్రికి యధార్థస్థితి దెలియనే దెలిసినది.

## గుణనిధి చెడిపోయిన విధము -

సీ॥ బ్రాహ్మణాచారంబు పరిహాసకము సేయు
నగ్ని హోత్ర విధానమన్న నలుగు
సంధ్యాభివందన శ్రద్ధయుజ్జన సేయు
గీత వాద్య వినోద కేలిదగులు
బాషండభండ దుర్భాషలా వర్తించు
ద్యూత కారులతోడి ప్రియుద్దివడయు
ధాతువాదుల మీద దాత్పర్య మొనరించు
జెలిమి వాటించు నాస్తికుల తోడ
తే॥ వటుల మన్నించు హర్షించు విటుల జూచి
పీఠమర్దుల కొనరించు బెద్దటికము
కౌలటేయుల బాటించు గారవించు
జీటకుల దీక్షితుని పట్టి సిగ్గువిడిచి.

ఆ. 4- వ. 81

వ॥ సజీవ నిర్జీవద్యూతంబుల నోడిన ధనంబులు గితవుల కుందల్లి మేనిరవణంబుల నమ్మి పెట్టుచుండు.

ఆ. 4-వ. 82

స్త్రీ లక్షణము :- పంచమాశ్వాసమున స్త్రీ సాముద్రిక లక్షణ నిరూపణము చేయును.

వ॥ "పాదతలంబులు రేఖలంగుష్ఠాంగుళీన ఖంబులు మీఁగాళ్ళు.........లలాట శిరోరుహంబులను నలువది యాఱంగంబులు లక్షణాన్వితంబులు గావలయు. అట్టి లక్షణవతియైన భార్య గృహలక్ష్మి" యని గృహలక్ష్మి లక్షణములను చెప్పను.

(ఆ. 5-వ. 226).

పతివ్రతా లక్షణములు :— బృహస్పతి వింధ్య గర్వంబ పనయింప సమర్థుండు అగస్త్యుండొక్కడేనని వానింబ్రార్థింప వచ్చి మున్ముందా మహర్షిదేవి లోపాముద్రం గొనియాడు సందర్భమున "పుష్పమునకు వాసనవలె నవినాభావ సంబంధమున పతికి సహధర్మ చారిణియై, పతివ్రతయై భార్య మెలగవలసినదిగా లోపాముద్రతో పతివ్రతా ధర్మముల నెన్నుచు

సీ॥ ప్రాణేశుఁడారగింపక భుజింపవు భర్త
నిద్రింపకయ మున్న నిద్రవోవు
నాధుండు మేలుకొనక మున్న మేల్కాంతు
కై సేయకెన్నడు గదియ వధిపు
ధవుడు రోషితుడైన తఱివాడి యుండదు
పతికి నెప్పుడు మాఱు పలుక వీవు
పురుషునీగికి నల్ప మనక సంతోషింతు
మొగమెత్తనేరవు మగని యెదుర।
తే॥ జెఱగు మాసిన మూన్నాళ్ళు సిగ్గుతోడ
బతి విలోకన మార్గంబుఁబరిహరింతు
సవితృడుదయింప నాల్నాళ్ళ జలకమాడి
చూడ నెవ్వారి బెనిమిటేఁజూతుకాని

ఆ. 2— ప. 72.

పసపుం గుంకుమ కజ్జలంబునును గూర్పాసము,తాంబూలము, కుసుమంబులు మున్నగు మంగళాలంకృతులు భర్త ఆయురభివృద్ధికై ధరింపవలెనట. భర్త చెప్పిన పనియేమి యని యురసి యూడిగము చేయవలెనట. తన యాత్మ బంధువుకైనను అతనికి తెలియకుండ నేమియు నీయరాదు. భర్త విడిచిపెట్టిన ఆహార పదార్థములను కుత్ససేయక భుజించవలెను. నేటికిని కొన్ని సదాచార సంపన్న గృహస్థుల యిండ్ల నీయాచారము గలదు· పై విషయముల బరికించి చూడ స్త్రీలకు ఆర్థికముగనే కాక ఏ విధమైన స్వాతంత్ర్యమును లేదని స్పష్టమగుచున్నది. తడవు గట్టక నీరాడ దగవు కాదు. కడప మీదను, సన్నెకంటి మీద, చక్కిమీదను గూర్చుండరాదు. భర్త యెదుట తన వాచాప్రాగల్భ్యము జూపరాదు.

## ద్వితీయాశ్వాసమున -

కం॥ నాగరికత్వము వాచా
ప్రాగల్భ్యము జూపఁజనదు పతి ముందట సం
భోగ క్రీడా విభవో
ద్యోగంబుల దక్క సతికి నుత్పలనయనా

(ఆ. 2 -ప. 76)

(అనగా భర్తను సంతోష పెట్టవలసిన సమయములలో తప్పయని భావము) కాంతుడు సంతోషించిన సంతోషించి, కాంతుడు సంతాపించిన సంతాపింపవలెను. పైన పేర్కొనినట్లు చెఱగు మాసిన మూన్నాళ్ళు సిగ్గుతోడ బతి విలోకన మార్గమును బరిహరించుట, నాల్గవనాడు సవితృడుదయింప జలక మాడుట మొదలగునవి ఈ నాటికినీ బ్రాహ్మణాచారమై యున్నది.

గర్భిణీ స్త్రీలు, పుత్రోత్సవము :— చతుర్థా శ్వాసమున వైశ్వానరుని జనన గాధలో — విశ్వానరు తపో ఫలముగా నతని భార్య శుచిష్మతీ దేవి గర్భమున ఇందుచూడుడు అవతరింతునని వరమిచ్చి వైశ్వానరుడై జనియించి దినదిన ప్రవర్ధమానుడగుటను వర్ణించును. ఇదెంతయు స్వాభావికముగను నతి

మనోహరముగను గన్పట్టును. శుచిష్మతీదేవికి 'నెలమసలెనిందు వదనకు' అని తెల్పుచు గర్భిణీ స్త్రీల లక్షణములన్నియు దెలుపును. స్త్రీలు గర్భవతులుగా నున్నప్పుడు కొన్ని కోరికలను కోరుదురు. ఇట్లే శుచిష్మతీదేవియు

సీ॥ సరసి జాననయు హర్షి రతి సంధ్యాకాల
మానంద తాండవ మాడదలచె
— — — — — — — — — — — — — —
— — — — — — — — — — — — — — —

గీ॥ ముదిత కాంక్షించె నేనికమోము కొడుకు
నంక పీఠము నందుంచి యాదరింప
సహ రహంబును గర్భంబునందు బెరుగు
కాలకంఠుని యనుభావ గౌరవమున

(ఆ. 4—ప. 5) ఇంకను

శా॥ ఆ చంద్రానన యధ్వరంబుల బురోడాశంబుతో మంత్రస
ద్ధీచీనంబుగ యాయజూకులు సమర్పింపంగ నా జ్యాహుతుల్
ప్రాచుర్యస్థితి నారగింపదలచున్ బ్రాగ్వంశ మధ్యంబునన్
శోచిష్కేశుడు గర్భగోళమున దొల్పొలున్నతింబొందగాన్

(ఆ. 40—ప. 7)

గర్భవతులైన స్త్రీలకు పుంసవన సీమంతంబులు చేయుట ఆచారంబు.

వ॥ "అనంతరంబ యాహంసగమనకు బుంసవన సీమంతంబులు గృహ్యోక్త ప్రకారంబున నిర్వర్తించిన" ఆమెకు బురుడైన పిమ్మట, పదునొకండవదినంబున నామకరణంబు గల్పించి వేల్పులుచన్న పిమ్మట గురుజనంబులు క్రమంబున —

సీ॥ గృహ నిష్క్రమంబు సాగించిరి నాల్గవ
మాసంబునందు గుమారునకును
వత్సరార్ధమునందు వాలాయముగఁజేసి
రన్న ప్రాశనంబర్భకునకు
నంతజూడా కర్మ మాచరించిరి బిడ్డ
నికి గృహ్య సంప్రోక్త నియమ పరత
దటి తోడ గర్ణ వేధంబు గల్పించిరి
శ్రవణర్షమున నాత్మసంభవునకు

గీ॥ బ్రహ్మ తేజోభివృద్ధికై పంచమాబ్ద
వేళ సల్పి రుపాకర్మవిధి సుతునకు
జదువబెట్టిరి వేదంబు పదము గ్రమము
సాంగముగ బాలకుని నుపాధ్యాయునొద్ద

(ఆ. 4—ప. 13)

ఇందు బాలుని జననమాదిగ దినదినాభివృద్ధి పొందుట, అన్నప్రాశనము, చూడాకర్మము, కర్ణవేధము, పంచమాబ్దమున నుపాకర్మవిధి,వేదంబులు జదువుటకై గురువునొద్దనునుచుట ఇత్యాది చారములనన్నిటిని అతి స్వాభావికముగ జిత్రించెను.

(1) మను. స్మృ. 2. 30

'నామధేయం దశమ్యాంతు'...... దీనిపై కుల్లూకభట్టు వ్యాఖ్యలో ద్వితీయ పక్షంగా "అథవా......దశమేఽ హన్యతీతే ఏకాదశాహ ఇతి వ్యాఖ్యేయమ్." కాశీఖండములో పదునొకండవ రోజునే జరిగినట్లిచ్చెను. ఇప్పటి యాచారమున గూడనట్లేగలదు. యాజ్ఞవల్క్యస్మృ. ఆచార. 12 'అహన్యేకాదశేనామ' అని స్మృతి ముక్త ఫలోదాహృతము.

(2) మనుస్మృ. 2. 34

'చతుర్థేమాసి కర్తవ్యమ్ శిశోర్ నిష్క్రమణం గృహత్, షష్ఠే న్నప్రాశనం మాసి...'

(3) మనుస్మృ 2. 35

'చూడాకర్మ ద్విజాతీనాం సర్వేషామేవ ధర్మతః ప్రథమేఽబ్దే తృతీయేవా కర్తవ్యం.

(4) మనుస్మృ. 2. 36

'గర్భాష్టమేఽబ్దే కుర్వీత బ్రాహ్మణ స్యోపనాయనం' ఇది సాధారణవిధి కాని,

2. 37. 'బ్రహ్మవర్చస కామస్యకార్యం విప్రస్యపంచమే' ఇది కొద్దిమంది విషయములో ప్రత్యేక విధి. యాజ్ఞ వల్క్యస్మృ. ఆచార. 12. స్మృతి ముక్త ఫలమున జెప్పినట్లుగా —

'అహన్యేకాదశేనామ చతుర్థేమాసి నిష్క్రమః
షష్ఠేఽన్నప్రాశనం చూడాకార్యం యథాకులమ్'

యథాకులమ్ అనుటచే వంశపారం పర్యానుగనని భావింప నగును.

అలంకారము :— స్త్రీలు అలంకరించుకొనునప్పుడు గోళ్ళకు ఎర్రరంగు వేసుకొనునాచారముండెడిది. ఇది మంచు ప్రదేశములలో చాల అవసరమైన ఆచారము. చలికి శరీరము గడ్డలు కట్టి పోకుండ పెదిమలకు పాదములకు ఎర్రని లేపనములుంచుట కాళిదాసు కుమార సంభవమున నతి మనోజ్ఞముగ వర్ణించెను.

"లగ్న ద్విరేఫాఞ్జన భక్తిచిత్రం ముఖే మధు
శ్రీస్తిలకం ప్రకాశ్య
రాగేణ బాలారుణకోమలేన చూతప్రవా
ళోష్ఠమలంచకార"

శ్రీనాథుఁడు కాశీఖండమున చతుర్థాశ్వాసమున —

"... ... ... ...పార్వతీ
పాటలగంధి చారుపదపద్మ నఖంబుల గ్రొత్తలత్తుకన్"

(ఆ. 4— ప. 176)

అని పార్వతీ పదపద్మనఖంబుల లత్తుకను గూర్చి దెల్పినాడు.

మాతృప్రేమ :— మాతృప్రేమకు భగవంతుని సృష్టిలో సాటి వచ్చునది, అంతటి పవిత్రమైనది వేరొక్కటిగానము. ఆ ప్రేమలో లాలిత్యము, మాధుర్యము మిళితమై వుంటుంది. కడలి కట్టలు తెంచుకొని పొంగినటులు తల్లులు పిల్లలను ప్రేమింతురు. ఈ మీదు మిక్కిలి ఒక్కొక్కప్పుడు బిడ్డ భవిష్యత్తును గూడ నాశన మొనర్చును. దానిని గూడ వారు గమనింపరు. తల్లి పిల్లవాని పొట్ట తడవును అనుటకు జతుర్థాశ్వాసంబున "తండ్రి కోపం బెఱింగిన గుణనిధి ఇంటికిం బోవక యెందేనియుం జనువాడ నని మనంబున......

చ॥ అరుణగభస్తి బింబము దయాద్రి పయింబొడతేరగిన్నెలో
బెరుగును వంటకంబు వడపిందియలుంగుడువంగ బెట్టువి
ర్భర కరుణాధురీణయగు ప్రాణము ప్రాణము తల్లియున్నదే?
హరహర ! యెవ్వరింకగడుపారఁగ బెట్టెదరిప్సితార్థముల్

(ఆ. 4. ప॥ 5 )

ప్రాతఃకాలముననే పెరుగన్నము, వడపిండెలు దినుట కొందఱిండ్లలో నాచారమని యిందు వర్ణింపబడినది. నిర్భర కరుణాధురీణయగు తల్లి ప్రాణమునకు ప్రాణము వంటిది. అట్టి తల్లి పెట్టినట్లు ఎవ్వరింక 'గడుపారసి' బెట్టుదురని గుణనిధి వాపోయినాడు.

వితంతువు :— భర్త చనిపోయిన విధవల ధర్మములను నియమములను వచియించును. వారు పుణ్యకార్యములకు బనికిరారు. ఉప్పిండి యుపవాసములచేయుచు దేవతార్చనములతో కాలక్షేపము చేయుదురట. ఆనాటి బ్రాహ్మణుల యిండ్లలోగల మూఢాచారము లిందు చక్కగా వివరింపబడినవి. ఉప్పిండి నాహారించుటనాటికినీ శ్రోత్రియుల ఇండ్ల నాచారముగా గలదు. ద్వితీయాశ్వాసమున –

సీ॥ ఓర్పుమైనుప్పిండి నుపవాసముండనీ
మగవాలి సరిబోల్ప దగదు విధవ
తిరిగి నానా పుణ్యతీర్థంబు లాడనీ
మగవాలి సరిబోల్ప దగదు విధవ
సమధికంబగు నిష్ఠ జపములు సేసిన
మగవాలి సరిబోల్ప దగదు విధవ
సద్భక్తి దేవతార్చనము సేయఁగ నీ
మగవాలి సరిబోల్ప దగదు విధవ

తే॥ నిద్ర మేల్కాంచి రేపాడి నియమపరత
వ హిమభాను వీక్షింప నియటకమున్న
తగదు నరునకు జూడంగ (వీక్షింప) దల్లివదినె
నత్తగారిని దప్పించి యన్య విధవ

(ఆ. 2–ప. 83)

పతిని బాయుట స్త్రీకి దైవనిర్ణయము. భర్తమరణమునకు స్త్రీ బాధ్యురాలా ! ఆమెకు 'పావనత్వము లేదుట. విధవయొక్క ఆశీస్సు విష సమానమట. సంఘంలో ఆనాడామె పరిస్థితి ఎంత దయనీయమైన స్థితికి దిగజారినదో కదా !

సహగమనము - సహగమునము గూడ ఆనాడాచారములో నున్నది. సుశీల సహగమనముచేసి కళావతియై జన్మించెను. పంచమీ శ్వాసమున —

తే॥ విధవనై జన్మమెల్లను వేగజాల
నొకనిచే పడియోప నింకొకని వెదుక
నితని తోడిద లోకమై యేగుదాన
నసల ముఖమున నిమిషవేదనకు నోర్చి

(ఆ. 5–ప. 162)

విధవయై దుస్సహమైన బ్రదుకును వెళ్ళబోసికొనుటకన్న సహగమనకు సుఖమనుకొన్నది.

కులట లక్షణములు—ద్వితీయాశ్వాసమునబృహస్పతి కులటల లక్షణములను గూడ వివరించి చెప్పెను.

వ॥ "కొందఱు కులటలు పతి దురవస్థ బొందినదెవులు పడిన శృంఖలా బద్ధుండైనను బరిత్యజింతురు. కొందఱు దుష్టమతులగు సతులు తామింగొతుకు వడిన భర్త నధిక కార్పణ్యంబున చరించి సర్పిల్లవాతై ల తండులాదులకై సిబ్బితివతురు — — — — — — — ఇందరు నాథునిం గులంబు వారిని నరకంబునం ద్రోచి తారును నందకూలుదురు.

(ఆ. 2–వ. 79).

ఆహారము :— వ్యాసునకు విశాలాక్షి భిక్ష వడ్డించిన వంటకముల పేర్లు చూచిన అతిథి కన్నంబు షడ్రసోపేతముగా పిండివంటలతో బెట్టుట యాచారమని చెప్పకయే చెప్పను.

వ॥ "అనంతరంబా విశాలాక్షి మహాదేవి యనుభావంబున నమ్మహామునుల ముందటం గనక రంభా పలాశ పాత్రంబులయందు విచిత్రంబుగాఁగల వంటకంబులు, నపూపంబులు, లడ్డు వంబులు, నిడ్డెనలు, గుడములు, నప్పంబులు, నిప్పట్లు జిల్లేడు కాయలు, దోసియలు, సేవియలు, నంగరపూవియలు, సారిపత్తెలు, జొత్తరలు, జక్కిలంబులు, మణుగుబూవులు, మోరుండలు, — — — — — — — — — — — — — — — — నల్లంబు మొల్లంబును, జింతగొజ్జు రజ్జును, బెలపిండిమెండును, నిప్పపూమొగ్గల యగ్గలికయు, నెన్న పెన్నాటకంబునుం గిలిగి యొక్కొక్క మఱియుదనకుఁదాన నులివేడి కట్టాయితో నావిర్భవించిన–"

(ఆ. 7–వ. 185)

తమకమున తాటిపండా స్వాదించుటొక యాచారము. ఆంధ్రదేశమున తాటిపండ్లు విరివిగా లభించును. ఆంధ్రదేశాభిమానమున శ్రీనాధుడు తాటిపండుతో పోల్చి వ్రాసినది.

తే॥ ''అడుసులోపలఁ దాటిపండదిమినట్టు
లదుముదునె కాదె పాతాళమంటికొనగ
— — — — — — — — — — — — — —
— — — — — — — — — — — — — —''

(ఆ. 1–ప. 114)

కాలభైరవ చరిత్రమున :–

తే॥ ''హస్తములు రెంట నందంద యదిమిపట్టి
తాటిపండారగించెడు తమకమునను
నవ్యయంబైన బ్రహ్మాండ మాస్వదించు
భైరవుండిచ్చుఁగాత శోభనము మనకు.''

(ఆ· 5–ప. 81)

సూక్తి సుధానిధులు, శ్రోత్రియులు, వేదవేదాంత విజ్ఞానులు, సంస్కృతాంధ్రముల నుభయ భాషా ప్రవీణులు, ఐన బ్రాహ్మణులానాడు, బ్రాహ్మణ భక్తితో విలసిల్లు రెడ్డిరాజుల యద్వితీయాదరణతో అభ్యుదయ పరంపరాభివృద్ధి నందుట యాచారము. ఆ బ్రాహ్మణ భక్తియే శ్రీనాధ కావ్య నానా సంఘటనలలో ప్రస్ఫుటముగా ద్యోతకమగుచున్నది.



# నవ్వు లో ముల్లు

## సాంధ్యశ్రీ

అంచుచేరని ఆలోచనలతో అలవాటుగా నేను చంద్రుడ్ని తాగుతూ ...
ఈ శారదరాత్రి...నా గులాబీగుండె అనుభూతిని
గగనంలోకి విసిరేశాను ... !
ఈ తెమ్మెరలో
ఎక్కడిదో —
ఒకతార చిరునవ్వు స్మృతిలో — తానై ... !
ఏకాంత కాంతారసీమలో
కళవళించిన ఎదకు
ఆశల కళుకులద్ది ...
కలికి వెన్నెల కులుకు పిలుకుమార్చెడు చాన
తలపు వాకిలి తెరచి
కనురెప్పమాటులో చీకటిని దాచేసినటు
కౌముదీ కుముదిని
రేకు వెనుకకు చేర్చె — నీ నిశను
వెలార్చి ఆశా వశను ... !
తెల్లదనాన్ని తట్టుకోలేని తార
నీలంలో
నింగికి షోకులు దిద్దుతూ;
జీవితాల కొలతను చుట్టుకుంటూ—ఆవులిస్తోంది !
చేజారిన జీవితంలో శూన్యంగా కలవరించి
కాలం బెట్టురాల్చే ఆకును
ఆవని ఆరగిస్తోంది
నిశా రహస్యపారవతాన్ని నెలవంక వెంటాడుతున్నాడు
వెన్నెల వలపన్ని...చుక్కల బియ్యాన్నిచల్లి... !
ఇంతాచేసి —
గుండ్రంగా నవ్వుతాడు తూర్పులో — మిహిరుడు ... !
క్షమ వృధా; శ్రమ వ్యధ... !



డాక్టర్ కొర్లపాటి శ్రీరామమూర్తి

# శాతవాహన రాజ్యకాలము

ఇక శాతవాహనుల కాలము. ఇదొక ప్రోత్థాపిత సమస్య.

అసలు శాతవాహనుల కాలము క్రీస్తుపూర్వము 73 వ సంవత్సరము నుండి క్రీస్తుశకము 218వ సంవత్సరము వఱకు, అనగా సుమారు మూడు వందల సంవత్సరములని ప్రథమతః అందిచ్చినవారు ఆర్.జి. భండార్కర్[1] గారు. తదుపరి, క్రీ. పూ. రెండవ శతాబ్ది నుండి క్రీ.శ. రెండవ శతాబ్ది తుదివఱకు లేక మూడవ శతాబ్ది మొదటివఱకు అనగా నాలుగు వందల సంవత్సరములని సందిచ్చినవారు డాక్టర్ జె. బర్గ్స్[2] గారు. ఆమీద క్రీ. పూ. 240 లేక 230వ సం. నుండి క్రీ. శ. 225వ సం. వఱకు అని, క్రీ. పూ. 232 లేక 231వ సం. నుండి క్రీ. శ. 236వ సం. వఱకు అనగా సుమారు నాలుగు వందల డెబ్బది సంవత్సరములని విందిచ్చిన వారు వి. ఏ. స్మిత్[3] గారు.

మఱి, ఆంధ్ర చరిత్రకారులలో శాతవాహనుల కాలము క్రీ. పూ. 220వ సం. నుండి క్రీ. శ. 249వ సం. వఱకు అనగా సుమారు నాలుగువందల డెబ్బదిసంవత్సరములని కొమర్రాజు లక్ష్మణరావు గారి నిర్దేశము.[4] క్రీ. పూ. 73వ సం. నుండి క్రీ.శ. 218వ సం. వఱకు అనగా సుమారు మూడువందల సంవత్సరములని చిలుకూరి వీరభద్రరావు గారి నిర్దేశము.[5] క్రీ. పూ. 73వ సం. నుండి క్రీ. శ. 240వ సం. వఱకు అనగా మూడువందల సంవత్సరములు పైచిలుకని వేలూరి సత్యనారాయణ గారి సంస్కరణము.[6] క్రీ. పూ. 221వ సం. నుండి క్రీ. శ. 218వ సం. వఱకు అనగా సుమారు నాలుగువందల నలుబది సంవత్సరములని డాక్టర్ మారేమండ రామారావుగారి నిర్దేశము.[7] క్రీ. పూ. 225వ సం. నుండి క్రీ శ 225వ సం. వఱకు అనగా నాలుగువందల ఏబది సంవత్సరములని ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం మరియు బాలేందు శేఖరం గార్ల పరిగణనము.[8] క్రీ పూ. 270 లేక 271వ సం నుండి క్రీ. శ. 157 వ సం. వఱకు అని, క్రీ. పూ. 248వ సం. నుండి క్రీ. శ.174 వ సం. వఱకు అనగా సుమారు నాలుగువందల పాతిక సంవత్సరములని ప్రొఫెసర్ గుర్తి వెంకటరావు గారి నిర్దేశము.[9] క్రీ. పూ.250 వ సం. నుండి క్రీ శ. 175వ సం. వఱకు అనగా నాలుగువందల పాతిక సంవత్సరములని డాక్టర్ నండూరి రామకృష్ణమాచార్యులు గారి పరిష్కరణము[10] క్రీ. పూ. 271 వ సం. నుండి క్రీ శ. 174వ సం. వఱకు అనగా సుమారు నాలుగువందల ఏబది సంవత్సరములని ప్రొఫెసర్ ఓగిగంటి రామచంద్రయ్య గారి సంస్కరణము[11]

ఇందు వీరభద్రరావు గారి నిర్దేశము, సత్యనారాయణ గారి సంస్కరణము భండార్కర్ గారి నిర్ణయమునకు అనుసరణము. లక్ష్మణరావు గారి నిర్దేశము, రామారావు గారి నిర్దేశము, లక్ష్మీరంజనం మరియు బాలేందు శేఖరంగార్ల పరిగణనము, వెంకటరావు గారి నిర్దేశము, రామకృష్ణమాచార్యులు గారి పరిష్కరణము, రామచంద్రయ్య గారి సంస్కరణము బర్గ్స్ సమన్వయమునకు అనుకరణము. భండార్కర్ నిర్ణయము చారిత్రిక పద్ధతిని జరిగినది. బర్గ్స్ సమన్వయము పౌరాణిక పద్ధతిని సాగినది. అనగా ప్రధానముగ పురాణములను ఆధారము చేసికొన్న విధానము.

పురాణములందు శాతవాహనులు విడిగా పాలించిన సంవత్సరములు, మొత్తము పాలించిన కాలములు కలవు.

వాయుపురాణమున 1. సింధుకుడు 23 సం.; 2. అతని సోదరుడు 10 సం.; 3. శ్రీ శాతకర్ణి 56 సం.; 4. అపాదబద్ధుడు 10 సం.; 5. అతని పుత్రుడు 30 సం.; 6. నేమికృష్ణుడు 25 సం.; 7. హాలుడు 1 సం.; 8. సప్తకరాజు 5 సం.; 9. పుత్రకషేణుడు 20 సం.; 10. సాతకర్ణి 1సం.; 11. శివస్వామి 28 సం.; 12. గౌతమీపుత్రరాజు 21 సం.; 13. యజ్ఞశ్రీ సాతకర్ణి 19 సం.; 14. విజయుడు 6 సం.; 15. దండ శ్రీ సాతకర్ణి 3 సం.; 16. పులోవాపి 7 సం. లు పాలింతురని పదారుమంది రాజుల పేరులతో పాటు, ముప్పదిమంది రాజులు మొత్తము నాలుగు వందల ఏబదియారు సంవత్సరములు పాలింతురని కలదు.

మత్స్య పురాణమున — 1. శిశుకుడు 23 సం.; 2. శ్రీమల్లకర్ణి 10 సం.; 3. పూర్ణోత్సంగుడు 18 సం.; 4. శాంతకర్ణి 56సం.; 5. లంబోదరుడు 18సం.; 6. ఆపీతకుడు 12 సం.; 7 మేఘస్వాతి 18 సం.; 8. స్వాతి 18 సం.; 9 స్కందస్వాతి 7 సం; 10. మృంగేంద్రస్వాతి 3 సం.; 11. కుంతలస్వాతి 8 సం.; 12. పంస్తిపాతము 13. స్వాతివర్ణుడు 1 సం.; 14. రిక్తవర్ణుడు 25 సం; 15. హాలుడు 5 సం; 16. మందలకుడు 5 సం; 17. పురీంద్రసేనుడు(?) 18. సౌమ్యుడు ?; 19 సుందర శాతకర్ణి 1 సం.; 20. చకోరస్వాతి 1/2 సం.; 21 శివస్వాతి 28 సం.; 22. గౌతమీపుత్ర రాజు 21 సం.; 23 సులోముడు 28 సం.; 24. శివశ్రీ 7 సం.; 25. శివస్కంధుడు (?) 26. యజ్ఞశ్రీ శాంతకర్ణి 29 సం; 27. విజయుడు 6 సం.; 28. చండశ్రీ శాతకర్ణి 10 సం; 29. సులోముడు 7 సం.లు పాలింతురని ఇరువది

తొమ్మిది రాజుల పేరులతో పాటు, పందొమ్మండుగురు రాజులు మొత్తము నాలుగువందల అరువది సంవత్సరములు పాలింతురని కలదు.

[పార్జిటర్ పాఠమున కృష్ణుడు 18 లేక 10 సం., మృగేంద్ర స్వాతికర్ణుడు 4 సం., పులోమావి 36 లేక 24 సం. పాలించునట్లు కలదు]

విష్ణుపురాణమున— 1. బలిపుచ్చకుడు, 2. కృష్ణుడు, 3. శాంతకర్ణి, 4. పూర్ణోత్సంగుడు, 5. శాతకర్ణి, 6. లంబోదరుడు, 7 పిలకుడు, 8. మేఘస్వాతి, 9. అరిష్టకర్ముడు, 10 హాలాహలుడు, 11 పలలకుడు, 12. పులిందసేనుడు, 13. సుందరుడు, 14. శాతకర్ణి, 15. శివస్వాతి, 16.గోమతి పుత్త్రుడు, 17. అళిముడు, 18. శాంతకర్ణి, 19. శివశ్రీ, 20. శివస్కంధుడు, 21. యజ్ఞశ్రీ, 22. ద్వియజ్ఞుడు, 23. చంద్ర శ్రీ, 24. పులోమావి, అని ఇరువది నలుగురు రాజుల పేరులతో పాటు ముప్పదిమంది రాజులు పాలింతురని మాత్రము కలదు.

బ్రహ్మాండ పురాణమున— 1. సింధుకుడు 23 సం.; 2. కృష్ణుడు 18 సం.; 3. శ్రీ శాంతకర్ణి 56 సం.; 4. అపోలపుడు 12 సం.; 5. పటుమాన్ 24 సం.; 6. అనిష్టకర్ముడు 25 సం.; 7. హాలుడు 1 సం.; 8. పత్తల్లకుడు 5 సం.; 9. పురీషభీతువు 21 సం.; 10. శాతకర్ణి 1 సం.; 11. శివస్వాతి 28 సం.; 12. గౌతమీపుత్త్ర రాజు 21 సం.; 13. యజ్ఞశ్రీ శాతకర్ణి 19 సం.; 14. విజయుడు 6 సం.; 15. దండశ్రీ శాతకర్ణి 3 సం; 16. పులోమావి 7 సం.లు పాలింతురని పదారుమంది రాజులతో పాటు, ముప్పదిమంది రాజులు నాలుగువందల ఏబదియారు సంవత్సరములు పాలింతురని కలదు.

భాగవతమున 1. బలి 2. కృష్ణుడు 3. శ్రీ శాతకర్ణి 4. పౌర్ణిముడు 5. లంబోదరుడు 6. శిబిలకుడు 7. మేఘస్వాది 8. దండమానుడు 9. అరిష్టకర్ముడు 10 హాలేయుడు 11. తిలకుడు 12. పురీషసేతువు 13. సుదర్శనుడు 14. చకోరుడు 15. శివస్వాతి 16. గౌతమీపుత్త్ర పురీమావి 17. శివస్కంధుడు 18. యజ్ఞశీలుడు 19. శ్రుతస్కంధుడు 20. విజయుడు 21. సులోముడు అని ఇరువది యొక్క మంది రాజుల పేరులతో పాటు, ముప్పది మంది రాజులు నాలుగువందల ఏబది యారు సంవత్సరములు పాలింతురని కలదు.

భవిష్యోత్తర పురాణమున— 1. శిముక శాతకర్ణి 23సం.; 2. కణ్వ లేక కృష్ణశ్రీ శాంతకర్ణి 18 సం; 3. శ్రీమల్ల శాతకర్ణి 10 సం; 4. పూర్ణోత్సంగుడు 18 సం; 5. శ్రీ శాతకర్ణి 56 సం; 6. స్కందస్తంభి 18సం.; 7 లంబోదరుడు 18 సం.; 8. ఆపీతకుడు 9. మేఘస్వాతి 18 సం; 10. శాతస్వాతి 18సం.; 11. శ్రీ స్కంద శాతకర్ణి 7 సం.; 12. మృగేంద్ర శాతకర్ణి 3 సం.; 13. కుంతల శాతకర్ణి 8 సం; 14. సౌమ్య శాతకర్ణి 12 సం.; 15. శాతశాతకర్ణి 1 సం.; 16. పులోమ శతకర్ణి 36 సం.; 17. మేఘశాతకర్ణి 38 సం.; 18. అరిష్ట శాతకర్ణి 25 సం.; 19. నేమి కృష్ణుడు (?) 20. హాలుడు 5 సం.; 21. మండలకుడు 5 సం.; 22. పురీంద్రసేనుడు 21 సం.; 23. సుందర శాతకర్ణి 1 సం.; 24. చకోర శాతకర్ణి 1/2 సం.; 25. మహేంద్ర శాతకర్ణి 1/4సం.; 26. గౌతమీ పుత్త్ర శివస్వాతి శకసేనుడు 28 సం.; 27. గౌతమీపుత్త్ర శాతకర్ణి 25 సం.; 28. వాసిష్ఠీపుత్త్ర పులోమశ్రీ శాతకర్ణి 32 సం.; 29. శివశ్రీ శాతకర్ణి 7 సం.; 30. శివస్కంధ శాతకర్ణి 3 సం.; 31. యజ్ఞశ్రీ శాతకర్ణి 19 సం.; 32. విజయశ్రీ శాతకర్ణి 6 సం.; 33. చంద్రశ్రీ శాతకర్ణి 3 సం.; 34. వాసిష్ఠీపుత్త్ర పులుమావి 7 సం. పాలింతురని ముప్పదినలుగురు రాజుల పేరులతో పాటు, ముప్పదియిద్దఱుమంది రాజులు అయిదు వందల సంవత్సరములు పాలింతురని కలదు.

ఇందు రాజనామము లందు, సంవత్సర సంఖ్య లందు, శాతవాహనులు మొత్తము పాలించు కాలము లందు భేదసాదృశ్యములు కలవు. అంతేకాదు. పురాణము లందు మఱొక విశేషము కలదు. అది రాజుల జన్యజనక సంబంధము.

వాయుపురాణమున సింధుకుని సోదరుడు కృష్ణుడు,కృష్ణుని పుత్త్రుడుశ్రీ సాతకర్ణి, శ్రీ సాతకర్ణి పుత్త్రుడు ఆపాదబద్ధుడు అని; విజయుని పుత్త్రుడు దండశ్రీ సాతకర్ణి అని మాత్రమే అలతిగ జన్యజనక సంబంధము కలదు. తతిమా వ్యవహారమెల్ల 'తతస్తతః' వ్యాపారమే.

మత్స్య పురాణమున శిశుకుని పుత్త్రుడు శ్రీ మల్లకర్ణి, శ్రీ మల్లకర్ణి పుత్త్రుడు పూర్ణోత్సంగుడు అని; శాంతకర్ణి పుత్త్రుడు లంబోదరుడు లంబోదరుని పుత్త్రుడు ఆపీతకుడు అని; చండ శ్రీ శాతకర్ణి పుత్త్రుడు సులోముడు అని మాత్రమే అలతిగ జన్యజనక సంబంధము కలదు. తతిమా వ్యవహారమెల్ల 'తతస్తతః' వ్యాపారమే.

విష్ణుపురాణమున బలిపుచ్ఛకుని సోదరుడు కృష్ణుడు, కృష్ణుని పుత్త్రుడు శాంతకర్ణి శాంతకర్ణి పుత్త్రుడు పూర్ణోత్సంగుడు, పూర్ణోత్సంగుని పుత్త్రుడు శాతకర్ణి, శాతకర్ణి పుత్త్రుడు లంబోదరుడు, లంబోదరుని పుత్త్రుడు పిలకుడు అని; గోమతి పుత్త్రుని పుత్త్రుడు అళిముడు, అళిముని పుత్త్రుడు శాంతకర్ణి అని, శివస్కంధుని పుత్త్రుడు యజ్ఞశ్రీ అని; ద్వియజ్ఞుని పుత్త్రుడు చంద్రశ్రీ, చంద్రశ్రీ పుత్త్రుడు పులోమాపి అని మాత్రమే అధికముగ జన్యజనకసంబంధము కలదు. తతిమా వ్యవహారమెల్ల 'తతస్తతః' వ్యాపారమే.

బ్రహ్మాండపురాణమున సింధుకుని సోదరుడు కృష్ణుడు, కృష్ణుని పుత్త్రుడు శాతకర్ణి అని, అపోలవుని పుత్త్రుడు పటుమాన్ అని; విజయుని పుత్త్రుడు దండశ్రీ శాతకర్ణి అని మాత్రమే

అలతిగ జన్యజనకసంబంధముకలదు. తతిమా వ్యవహారమెల్ల 'తతస్తతః' వ్యాపారమే.

భాగవతమున బలిసోదరుడు కృష్ణుడు, కృష్ణుని పుత్త్రుడు శ్రీశాతకర్ణి, శ్రీశాతకర్ణి పుత్త్రుడు పౌర్ణముడు, పౌర్ణముని పుత్త్రుడు లంబోదరుడు, లంబోదరుని పుత్త్రుడు శిబిలకుడు, శిబిలకుని పుత్త్రుడు మేఘస్వాది, మేఘస్వాది పుత్త్రుడు దండమానుడు అని; తిలకుని పుత్త్రుడు పురీషసేతువు, పురీషసేతుని పుత్త్రుడు సుదర్శనుడు అని; శివస్కంధునిపుత్త్రుడుయజ్ఞశీలుడు, యజ్ఞశీలుని పుత్త్రుడు శ్రుతస్కంధుడు అని; విజయునిపుత్త్రుడు సులోముడు అని మాత్రమే అధికముగ జన్యజనకసంబంధము కలదు. తతిమా వ్యవహారమెల్ల 'తతస్తతః' వ్యాపారమే.

భవిష్యోత్తరపురాణమున శిముకశాతకర్ణి సోదరుడు కృష్ణశ్రీశాతకర్ణి అని; అపీతకుని పుత్త్రుడు మేఘస్వాతి అని, వాసిష్ఠీపుత్త్రపులోమశ్రీ శాతకర్ణి సోదరుడు శివశ్రీశాతకర్ణి అని మాత్రమే అలతిగ జన్యజనకసంబంధము కలదు. తతిమా వ్యవహారమెల్ల 'తతస్తతః' వ్యాపారమే.

ఇందు జన్య జనక సంబంధము లందును భేద సాదృశ్యములు కలవు. అంతేకాదు. జన్యజనక సంబంధములేని రాజులును కలరు. అనగా పురాణములలోని శాతవాహనుల సమాచారము వంశాను క్రమణిక, అనగా పుత్త్ర పౌత్త్ర ప్రపౌత్త్ర వంశ పారం పర్యము కల వంశవృక్షము కాదని, రాజనామావళి మాత్రమే అని సూక్ష్మదృష్టికి సుగోచరము.

అయినను, వాయుపురాణము ప్రమాణమని ఒకరు, మత్స్యపురాణము మహా ప్రమాణమని మఱొకరు పురాణ రాజనామావళిని బట్టి శాతవాహనుల కాలమును సమన్వయించుట, సవరణలు వివరణలు పవదరించుట విస్మయజనకము. వంశానుక్రమణికలేని కాలానుక్రమణిక, ఆధారములేని ఆధేయము. అంతేకాదు. అది పురాణరాజనామావళిలోని ఆదిమ చరిత్రాంశమునకు అత్యంత విరుద్ధము. ఆంధ్రుడైన శిముక శాతవాహనుడు కాణ్వుడైన సుశర్మను చంపి శుంగుల శేషమును నాశనముచేసి ఆంధ్ర సామ్రాజ్యమును స్థాపించునని వాయు మత్స్య విష్ణు బ్రహ్మాండ భాగవత భవిష్యోత్తర పురాణములు ఆరును ఏక కంఠ్యముగ ఘోషించు విషయము ఆదిమ చరిత్రాంశము. అది క్రీస్తుపూర్వము ప్రథమశతాబ్ది తుదిభాగమున మాత్రమే సంభవము అది మొదలు వంశానుక్రమణిక లేని పురాణ రాజనామావళిని బట్టి కాలానుక్రమణికను కల్పించిన, శాతవాహనుల కాలము క్రీస్తుశకము అయిదవ శతాబ్ది వఱకు అభివ్యాప్తమగును. అది మఱల చరిత్రకు విరుద్ధము. అందువలన పురాణ రాజనామావళిని బట్టి కల్పించిన కాలానుక్రమణికను వెనుకకు నెట్టిన శాతవాహనుల కాలము క్రీస్తుపూర్వము మూడవ శతాబ్దికి పోవును. అప్పుడు పురాణ రాజనామావళిలోని ఆదిమ చరిత్రాంశమునకు గ్రహణము పట్టును. అందుకు సుశర్మను చంపిన శాతవాహనుడు శిముక శాతవాహనుడు కాడని, 'కొన్ని పురాణములలో ఆంధ్రులు పౌలోములని యున్నది' కనుక 'పులోమావి పాటలీనగరమున ఆంధ్ర రాజ్య స్థాపనమొనర్చె'[12] ననుట, 'శిముకుని తర్వాత 240 సంవత్సరములకు పరిపాలించుచుండిన మొదటి పులోమావి సుశర్మను వధించిన ఆంధ్రరాజు'[13] అనుట — పురాణమునకు దిద్దుబాటు మాత్రమే కాదు; చరిత్రకు సర్దుబాటుకూడ అగును. అది నిరాలంబనృత్యము. పురాణ రాజనామావళినిబట్టి శాతవాహనులకాలమును సమన్వయించునెడ, ఆ పురాణ రాజనామావళిలోని ఆదిమ చరిత్రాంశమునే అన్యథా కరించుట ఆ వాదమునకు న్యూనతా పాదకము. కాబట్టి బర్గెస్ ప్రభృతుల శాతవాహనకాల సమన్వయము ప్రామాణికము కాదు.

పురాణ రాజనామావళి యందు మఱొక విశేషము కలదు.

శాతవాహనులకు సంవదించు ఆంధ్రులు ముప్పది మంది అనంతరము ఏడుగురు ఆంధ్రులు పాలింతురని, మొత్తముమీద ఆంధ్రులు మూడు వందల సంవత్సరములు పాలింతురని వాయు, బ్రహ్మాండ పురాణము లందు; మూడువందల పదకొండు సంవత్సరములు పాలింతురని మత్స్య పురాణము నందు కలదు. ఆ పంక్తులివి :

'ఆన్ధ్రా భోక్ష్యన్తి వసుధాం శతే ద్వేచ శతంచవై' —
శ్లో. 355, అ. 37, ఉ. అ. వా. పు.

'ఆన్ధ్రా భోక్ష్యన్తి వసుధాం శతేద్వేచ శతఞ్చవై'—
శ్లో. 173, అ. 74, తృ. పా. బ్ర. పు.

'శతాని త్రీణి భోక్ష్యన్తే వర్షాణ్యేకాదశైవతు। ఆన్ధ్రాః'—
శ్లో 23, అ. 272, మ. పు.

శాతవాహనులు సప్తాంధ్రులతో కలిసి మూడు వందలు లేక మూడువందల పదకొండు సంవత్సరములు పాలించిన, సప్తాంధ్రులు కాకుండ శాతవాహనులు మాత్రము పాలించిన కాలము అంత కంటె తక్కువ అగును. అనగా పురాణ రాజనామావళిని బట్టియే శాతవాహన రాజ్యకాలము స్థూలముగ రెండున్నర శతాబ్దులు కావచ్చును.

అయిన 'శాతవాహనులు రమారమి అయిదు శతాబ్దులు పాలింతురని పురాణములందు పూర్వవచనము, సుమారు రెండున్నర శతాబ్దులు పాలింతురని ఉత్తర వచనము, ఇది పూర్వోత్తర విరోధము కదా!' అనిపించుట సహజము. కాని, పురాణములందు శాతవాహన రాజ్యకాలము రమారమి అయిదు శతాబ్దులని లేదు. ముప్పది మంది లేక ముప్పది ఇద్దఱుమంది నాలుగున్నరవందలు లేక అయిదు వందలు సంవత్సరములు పాలింతురని కలదు. ముప్పది మంది లేక ముప్పది ఇద్దఱు మంది విడిగా పాలించిన సంవత్సరముల మొత్తము నాలుగున్నర వందలు లేక అయిదు వందల సంవత్సరములే. అవి శాతవాహన రాజ్యకాలమున అంతర్గతము. అదెట్లు సంభవము? శాతవాహనులు దక్షిణాపథ పతులని, శాతవాహనుల రాజధాని ప్రతిష్ఠాన పురమని, బేనాకటకము, ధాన్యకటకము, శాతవాహ నిహారము శాఖానగరములని పూర్వోక్తము. పురాణ రాజనామావళిలోని రాజులు కొందఱు ప్రతిష్ఠాన పురవరాధీశ్వరులు. మఱికొందరు శాఖానగరా

ధిపతులు మాత్రమే అగుదురు. వంశానుక్రమణిక లేకపోకపోవుటయు, కాలానుక్రమణిక కలిసిరాకపోవుటయును ఇందుకు ఉపబలకము. ప్రతిష్ఠాన పురవరాధీశ్వరులు మాత్రమే ప్రధాన శాతవాహన రాజులు. ప్రధాన శాతవాహన రాజులు పాలించిన కాలమే శాతవాహన రాజ్య కాలము. అప్రధాన శాఖానగరాధిపతులు పాలించిన కాలము అందు అంతర్గతము. ప్రధాన శాతవాహనరాజులు పాలించినకాలము స్థూలముగ రెండున్నర శతాబ్దులు. శాఖానగరాధిపతులు పాలించిన కాలమును స్థూలముగ రెండున్నర శతాబ్దులు. కాబట్టి పురాణ రాజనామావళి యందు పూర్వోత్తర విరోధము లేదని స్పష్టము. అంతేకాదు. ఇది ఆరు పురాణములు ఐకకంఠ్యముగ ఘోషించు ఆదిమ చరిత్రాంశమునకు అనగా శిముక శాతవాహనుడు ఆంధ్ర సామ్రాజ్యమును స్థాపించిన చరిత్రాత్మకసంఘటనకు అనుకూలము. కాబట్టి పురాణ రాజనామావళి యందు పూర్వోత్తర విరోధము లేకపోవుటయే గాక, అప్రమాణ విషయమును లేదని అవగాహకము.

అయినను, కాలనిర్ణయమునకు పురాణములు స్వతః ప్రమాణములు కావు. శాసనములు, నాణెములు, గ్రంథములు, చిత్రములు శిల్పములు, పురావస్తువులు, లిపి స్వరూపము, భాషా స్వభావము, సమకాలిక సమాచారము, సమీపకాలిక సమాచారము, మొదలైన ప్రకృష్ట సాధనములతోడి సప్రమాణ నిరూపణము చరిత్ర. చరిత్రతోడి సంవాదమున మాత్రమే పురాణమునకు పురస్కృతి. శాసనాదిక పరికరముల అభావమున మాత్రమే పురాణములు శరణ్యములు. పురాణ స్మృతులు జనశ్రుతులు సహోదరములు: కాబట్టి జనశ్రుతులనుబట్టివలె, పురాణ స్మృతులనుబట్టిచేసిన కాల నిర్ణయము చరిత్రాభాసము కాగలదు. శాసనాదిక పరికరములనుబట్టి, పురాణాదిక సంవాదమునుబట్టి చేసిన కాలనిర్ణయము చరిత్రాత్మకము. కాబట్టి చారిత్రిక పద్ధతిని మాత్రమే శాతవాహనుల కాలము నిర్ణయించుట కర్తవ్యము. అది భండార్కర్ అవలంబించిన పద్ధతియే కాని అసమగ్రము. భ్రమప్రమాదములును కలవు. అంతేకాదు. అప్పటికి ఇప్పటికి అనేక నూతన విశేషములు వెలుగులోనికి వచ్చినవి. కాబట్టి శాతవాహనుల కాలము నిర్ణయించుట మఱల అవశ్య కర్తవ్యము.

శాతవాహనులకు సంబంధించినశాసనములుఇరువదియైదు[14] కలవు. అందు — 1. శిముక శాతవాహనుడు (రాయా సిముక సాతవాహనో); 2. కృష్ణుడు (కన్హారాజని); 3 శ్రీ శాతకర్ణి (రజో చ సిరిసాతకనినో); 4. మాఠరీపుత్ర శకసేనుడు (రజొ మాఠరిపుతస సకసేనస); 5. గౌతమీపుత్ర శాతకర్ణి (రజొ గొతమిపుతస సాతకణిస); 6. వాసిష్ఠీ పుత్ర శ్రీ పులుమావి (రజొ వాసిఠీ పుతస సామి సిరిపులు మా ఇస); 7. వాసిష్ఠీ పుత్ర చతరపణ శాతకర్ణి (రణొవసఠి పుతస చతరపన సతకనిస); 8. శ్రీ శివముఖ శాతకర్ణి (రానో సిరిసివమకసదస); 9. గౌతమీ పుత్ర

యజ్ఞశ్రీ శాతకర్ణి (రజొ గొతమి పుతస సామి సిరి యజ్ఞ సాత కణిస); 10. గౌతమీ పుత్ర శ్రీ విజయ శాతకర్ణి (రఞో గోతమి పుతస సిరివిజయ సతకన్నిస); 11. వాసిష్ఠీపుత్ర చంద్రశ్రీ శాతకర్ణి (రజొ వాసిఠీ పుతస సమిసిరి చండసా / తి / స); 12. శ్రీ పులుమావి (రజొ సాతవాహనానాం(సి)రి పుళు(మా)విస) అని పన్రెండు మంది శాతవాహన రాజులు కలరు. ఇందు మాఢరీ పుత్ర శకసేనుని పేరులోని శకసేన శబ్దము, వాసిష్ఠీపుత్ర చతర పణ శాతకర్ణి పేరులోని చతరపణ శబ్దము, శ్రీ శివమఖ శాతకర్ణి పేరులోని ముఖశబ్దము విలక్షణములైనవి. మాఢరీపుత్ర శకసేన వ్యవహారము భవిష్యోత్తర పురాణమును సంవదించునది.

'అష్టావింశతి వర్షాణి శకసేనో భవిష్యతి
యమాహుర్మాఢరీ పుత్రం శివస్వాతిం మహాజనాః'

ఇందు మాఢరీ పుత్రుడైన శివస్వాతిని మహాజనులు శక సేనుడని వ్యవహరింతురని స్పష్టము. కాంబట్టి మాఢరీపుత్ర శివ స్వాతియే మాఢరీ పుత్ర శకసేనుడని నిర్ధారకము. వాయుపురాణము లోని శివస్వామి; మత్స్య విష్ణు బ్రహ్మాండ భాగవత పురాణములలోని శివస్వాతి; భవిష్యోత్తర పురాణములోని మాఢరీపుత్ర శివస్వాతి శక సేనుడు; శాసనములోని మాఢరీపుత్ర శకసేనుడు ఒక వ్యక్తియే. ఇక వాసిష్ఠీపుత్ర చతరపణ శాతకర్ణి పేరులోని చతరపణ శబ్దము 'క్షత్రప శబ్దమునకు రూపాంతరమై యితని బిరుదము కావచ్చును' అని ఒక సమన్వయము కలదు.[15] అది బిరుదు అయినను, కాకపోయి నను క్షత్రప సంబంధమునకు సూచకము. వాసిష్ఠీపుత్రపులుమావి తరువాత విష్ణుపురాణమున ఒక శాతకర్ణి కలడు.

' ... ... తతశ్చ గోమతిపుత్ర స్తత్పుత్రోఽళిమాన్
తస్యాపి శాన్తకర్ణిః ... ... ... ... ... ... ... ...'
శ్లో.లు 47, 48, అ. 24. అం. 4

ఇందు గోమతి పుత్రుడు అనగా గౌతమీపుత్ర శాతకర్ణి. అతని పుత్రుడు అళిముడు. అనగా వాసిష్ఠీపుత్ర పులమావి. అతనియొక్కయు శాంతకర్ణి అనగా శాతకర్ణి. ఈ శాతకర్ణి మత్స్య పురాణమున పార్జిటర్ పరిష్కృత పాఠమున మాత్రము కలడు. అతడు వాసిష్ఠీపుత్ర శాతకర్ణి అగును. వాసిష్ఠీపుత్ర శాతకర్ణికి క్షత్రపుడైన రుద్రదాముడు తనయనిచ్చి వివాహము చేసి నట్లు శాసన ప్రమాణము కలదు.[16] క్షత్రప సంబంధమును బట్టి వాసిష్ఠీపుత్ర శాతకర్ణి వాసిష్ఠీపుత్ర చతరపణ శాతకర్ణిఅని వ్యవ హరింపఁబడవచ్చును. మఱి, శ్రీ శివమఖ శాతకర్ణి పేరులోని మఖ శబ్దము బహుమఖ నిర్వహణ భాగధేయము కావచ్చును. కనుక శ్రీ శివమఖ శాతకర్ణి పురాణ రాజనామావళిలోని శివశ్రీ శాతకర్ణి. పురాణ సంవాదమునుబట్టి, శాసన ప్రమాణమునుబట్టి ప్రతిష్ఠాన పురవరాధీశ్వరులైన ప్రధాన శాతవాహన రాజులు పన్రెండుగురు మాత్రమే.

ఇక శాతవాహనుల నాణెములు ఇప్పటికి శతసహస్రములు లభించినవి.[17] ఇంకను లభించుచున్నవి. అందు – 1. శిముక శాతవాహనుడు (రానోసిరిసదవాహనస); 2. శ్రీశాతకర్ణి (రఞోసిరి సాతకనిస); 3. మాఢరీపుత్ర శివస్వాతిశకసేనుడు (మాఢరీపుతస, సకసెనస, సకసదన, సకసాతకనిస); 4. గౌతమీపుత్ర శాతకర్ణి (రఞోగోతమిపుతస సిరిసాతకనిస); 5. వాసిష్ఠీపుత్ర పులుమావి (రఞోవాసిఠీపుతస); 6. శివశ్రీశాతకర్ణి (రఞోసివసిరస, సివసిరి పులుమవిస); 7. వాసిష్ఠీపుత్రశాతకర్ణి (రానోవాసిఠీపుతస సిరి సాతకనిస); 8. గౌతమీపుత్రయజ్ఞశ్రీశాతకర్ణి (రఞోగోతమీపుతస యజ సాతకనిస); 9. విజయశ్రీశాతకర్ణి (రాఞో విజయసాతకనిస); 10. చంద్రశ్రీశాతకర్ణి (రఞోచదసదస); 11. శ్రీ పులుమావి (రఞోసిరిపులుమవిస) అను రాజనామములు కల నాణెములు అనేకము కలవు. ఇవిగాక – 1. స్కందశాతకర్ణి; 2. ఆపీలకుడు; 3. మేఘస్వాతి; 4. చకోరశాతకర్ణి; 5. రుద్రశ్రీశాతకర్ణి; 6. కుంభశాతకర్ణి; 7. కర్ణశాతకర్ణి; 8. కౌశికీపుత్రశాతకర్ణి; 9. కాచీపుత్రశాతకర్ణి అను రాజనామములు కల నాణెములును కలవు. ఇందు మేఘస్వాతి నాణెములు కల్పితములు. ఒక నాణెమున కల 'ఘసదస' అను రాజనామములోని 'ఘ' అను వర్ణము 'న' అను వర్ణము కావచ్చునని 'ర' అను వర్ణమును చేర్చి 'రనొసదస' అనగా అది శాతకర్ణి నాణెమని ఒకరి అభిప్రాయము కాఁగా, ఘ' అను వర్ణమునకు 'మే' అను వర్ణమును చేర్చి 'మేఘసదస' అనగా మేఘస్వాతి అని మఱొకరి అభిప్రాయము.[18] మఱొక నాణెమున 'హ త మె క స' అను రాజనామములోని 'హ' అను ప్రాకృతవర్ణము 'శ' అను సంస్కృతవర్ణము అగునని, అనగా మేఘస్వాతి అని వేఱొకరి అభిప్రాయము.[19] ఈ రెండు నాణెములందును రాజ శబ్దమున్నట్లు కానరాదు. అంతేకాదు. అపీలకుడు, మేఘస్వాతి, చకోరశాతకర్ణి పురాణరాజనామావళులందు రాజశబ్ద విశిష్టులు కారు. రుద్రశ్రీశాతకర్ణికి, కుంభశాతకర్ణికి, కర్ణశాతకర్ణికి, కౌశికీ పుత్రశాతకర్ణికి, కాచీపుత్రశాతకర్ణికి పురాణరాజనామావళితోడి సంవాదములేదు. ఈ ఎనమండుగురును శాఖానగరాధిపతులు కావచ్చును. శాఖానగరాధిపతులు నాణెములను వెలయించుట శాత వాహనులకంటె పూర్వము శుంగుల కాలమునందే కలదు.[20] ఇక స్కంధశాతకర్ణికి పురాణరాజనామావళితోడి సంవాదము కలదు. మత్స్యపురాణములోని స్కందస్వాతి, భవిష్యోత్తర పురాణములోని శ్రీ స్కందశాతకర్ణి నాణెములలోని స్కందశాతకర్ణి ఒకవ్యక్తి. మత్స్యపురాణమున స్కందస్వాతి రాజశబ్దవిశిష్టుడు. అంతేకాదు. అజ్ఞాతకర్తృకమైన 'పెరిప్లసు ది ఎర్రిత్రియన్ సీ' అను సమకాలిక గ్రంథమునుబట్టి స్కందశాతకర్ణి ప్రతిష్ఠానపురవరాధీశ్వరుడైన ప్రధాన శాతవాహనరాజు అగును. అది వక్ష్యమాణము. కనుక శాసనములనుబట్టి, నాణెములనుబట్టి మొత్తముమీద ప్రతిష్ఠాన పురవరాధీశ్వరులైన ప్రధాన శాతవాహనరాజులు పదముగ్గురు మాత్రమే.

మఱి, శాతవాహనులకు సంబంధించిన వాఙ్మయగ్రంథములు రెండు కలవు. ఒకటి గాథాసప్తశతి. అది శాలివాహనసప్తశతి. శాలి వాహనరాజు హాలుడు విరచించిన గ్రంథమని అందే కలదు.

'సత్తసతాఇం కఇవచ్ఛలేణ కోడీఅ మజ్ఝ్ అరమ్మి
హాలేణ విరఇఅఇం సాలఙ్కారాణాం గాహాణాం'—గా· 3,1

'అవణ్ణా ఇం కులాఇం దోవ్వి అ జాణన్తి ఉణ్ణాఇం ణేఉం
గోరీఅ హి అఅదఇవో అహవా సాలాహణ ణరిన్దో'– గా.67,5

'ఇఅ సిరిహాల విరఇఏ ఫౌఉఅకవ్వమ్మి సత్తసఏ
సత్తమస అం సమత్తం గాహాణం సహావర మణిజ్జం'
— గా. 101, 7

ఇందు రెండవ గాథలో శాలిహనరాజు ప్రశంస కలదు. మొదటి గాథలోను, మూడవ గాథలోను సప్తశతి హాలవిరచితమని స్పష్టము. ఇక రెండవగ్రంథము గుణాఢ్యుడురచించిన బృహత్కథ· బృహత్కథకు సంబంధించిన శాలివాహనరాజు హాలుడు కావచ్చును. ఆ శాలివాహనరాజు ప్రతిష్ఠానపురములోని సుప్రతిష్ఠిత నగరమున రత్నసింహాసనాసీనుడని పూర్వోక్తము. అనగా ప్రతిష్ఠానపురవరా ధీశ్వరుడని అర్థము. హాలుడు కవికల్పామరద్రుమమని భవిష్యోత్తర పురాణమున కలదు. ఆ శ్లోక భాగమిది :

'తతో హాలో మహాభాగః కవికల్పామరద్రుమః'

ఇందు హాలుడు కవికల్పామరద్రుమమని స్పష్టము. వాయు మత్స్య బ్రహ్మాండ పురాణములందు హాలుడు రాజశబ్దవిశిష్టుడు. కాబట్టి హాలుడు ప్రతిష్ఠానపురవరాధీశ్వరుడైన ప్రధాన శాత వాహనరాజు రాజు అగును. సాతిసిరి అని పేరుకల నాణెములు హాలునివి అగును (సాత=హాల). అయిన శాసనములనుబట్టి, నాణెములనుబట్టి,గ్రంథములనుబట్టి ప్రతిష్ఠానపురవరాధీశ్వరులైన ప్రధాన శాతవాహనరాజులు పదునాల్గురు మాత్రమే. ఇంతకు మిక్కిలి ప్రధాన శాతవాహనరాజుల ప్రసక్తి ఇతరత్ర మృగ్యము. కాబట్టి ప్రతిష్ఠానపురవరాధీశ్వరులైన శాతవాహనరాజులు పదు నాల్గురని గ్రాహ్యము.

ప్రధాన శాతవాహనరాజులు పదునాల్గురిలోను ప్రథముడు శిముకశాతవాహనుడు ద్వితీయుడు కృష్ణుడు. తృతీయుడు శ్రీశాతకర్ణి. ఈ ముగ్గురికి సంబంధించి మూడు శాసనములు కలవు. అందు మొదటిది కృష్ణుని నాసికశాసనము. రెండవది శ్రీశాతకర్ణి నాటి నానాఘాట్ ప్రతిమాశాసనము. మూడవది నాగనిక నానాఘాట్ శాసనము. శ్రీశాతకర్ణి నాటి నానాఘాట్ ప్రతిమాశాసనమున శిముకశాతవాహనుని ప్రసక్తి కలదు. అంతే కాదు. నాగనిక శ్రీ శాతకర్ణి భార్య అని కలదు. ఆ పంక్తులివి [21]:

## ప్రాకృతము :-

'రాయా సిముక సాతవాహనో సిరిమాతో
దేవీ నాయనికాయ రఞోచ సిరిసాతకనినో'

## సంస్కృతచ్ఛాయ :-

'రాజా శిముక శాతవాహనః శ్రీమాన్
దేవీ నాగనికాయాః రాజ్ఞః చ శ్రీశాతకర్ణేః'

ఇందు శిముక శాతవాహనుడు రాజని, శ్రీ శాతకర్ణి రాజని, నాగనిక శ్రీ శాతకర్ణి భార్య అని స్పష్టము. కృష్ణుని నాసిక శాసనమున కృష్ణుడు రాజ్యము చేయుచున్నట్లు కలదు. ఆ వాక్య మిది[22] :

## ప్రాకృతము :-

'కన్హే రాజాని'

## సంస్కృతచ్ఛాయ :-

'కృష్ణే రాజాని'

ఇందు 'కృష్ణే రాజాని' అనగా 'కృష్ణస్య రాజత్వకాలే' అని అర్థము. అనగా కృష్ణుడు రాజ్యము చేయుచున్న కాలమని తాత్పర్యము. నాగనికనానాఘాట్ శాసనమున శ్రీశాతకర్ణి గురించి ఇట్లు కలదు.[23]

## ప్రాకృతము :-

'వీరస సూరస అప్రతిహతచకస దఖినపథపతినో'

## సంస్కృతచ్ఛాయ :-

'వీరస్య శూరస్య అప్రతిహతచక్రస్య దక్షిణాపథపతే'

ఇందు శ్రీశాతకర్ణి వీరుడు, శూరుడు, అప్రతిహతచక్రుడు, దక్షిణాపథపతి అని స్పష్టము. ఇట 'శిముక సాతవాహనస వంస వధనస=శిముక శాతవాహనస్య వంశవర్ధనస్య' అని శిథిల పూరణము కలదు.[24] ఒక్క మత్స్యపురాణమున వినా, వాయు విష్ణు బ్రహ్మాండ భాగవత భవిష్యోత్తర పురాణము లందు శిముక శాతవాహనుని సోద రుడు కృష్ణుడని, కృష్ణుని పుత్త్రుడు శ్రీ శాతకర్ణి అని కలదు. అనగా శిముక శాతవాహనుడు, కృష్ణుడు, శ్రీ శాతకర్ణి క్రమ పరి పాలకులని అవగాహకము. అంతేకాదు. ఆ ముగ్గురికి సంబంధించిన మూడు శాసనములు సమీపకాలికములు. అవి లిపి స్వరూపమును బట్టి క్రీస్తుపూర్వము ప్రథమ శతాబ్ది ఉత్తరార్ధమునకు చెందిన శాసనములని ఆర్.పి. చంద నిర్ణయము.[25] కాబట్టి శాతవాహనులు పాలించిన కాలమునకు ప్రారంభ దశ శాసన లిపి స్వరూపమునుబట్టి క్రీస్తుపూర్వము ప్రథమ శతాబ్ది ఉత్తరార్ధమని స్పష్టము.

శిముక శాతవాహనుని నాణెములు సహితము క్రీస్తుపూర్వము ప్రథమశతాబ్ది నాటివికాని; క్రీస్తుపూర్వము మూడవశతాబ్దినాటివి, రెండవ శతాబ్ది నాటివి కావని నాణెముల మీది రాజనామముల లిపి

స్వరూపమునుబట్టి సంత్‌లాల్‌క్రతే నిర్ణయము.[26] కాబట్టి శాతవాహనులు పాలించిన కాలమునకు ప్రారంభదశ నాణెముల లిపిస్వరూపమును బట్టి సహితము క్రీస్తుపూర్వము ప్రధమ శతాబ్ది ఉత్తరార్ధమని స్పష్టము.

కళింగాధిపతి ఖారవేలుని హాథీగుంఫ శాసనమున, అతడు తన రెండవ రాజ్య సంవత్సరమున శాతకర్ణిని లెక్కసేయకుండ తన రధ గజ తురగ పదాతి దళములను పశ్చిమదిశకు పంపినట్లు కలదు. ఆ విషయమిది[27] :

## ప్రాకృతము :-

'దితీయే చ వసే అచితయితా సాతకంనిం పచ్ఛిమదిసం
హయ గజనర రధ బహులం దండం పఠాపయతి'

## సంస్కృతచ్ఛాయ :-

'ద్వితీయేచ వర్షే అచిన్తయిత్వా శాతకర్ణిం పశ్చిమదిశం
హయ గజన రరధ బహులం దణ్డం ప్రస్థాపయతి'

ఇది ఒక శాతకర్ణి, ఖారవేలుడు సమకాలికులనుటకు సంశయ రహితమైన సాధనము. ఇక ఖారవేలుడు తన ఎనిమిదవ రాజ్యసంవత్సరమున యవనరాజు డిమితుని మధుర వఱకు తరిమి వేసినట్లు, పంన్రెండవ రాజ్య సంవత్సరమున మగధరాజు బృహస్పతి మిత్రుని పాదాక్రాంతుని చేసినట్లు హాథీగుంఫ శాసనమున కలదు. ఆ పంక్తులివి[28] :

## ప్రాకృతము :-

'అఠమేచ వసే .... మధురం అపయాతో యవన రా[జ]
[డిమిత ?]'

'బారసమేచ ... .... మాగధం చ రాజానం బహసతిమితం
పాదేవందాపయతి'

## సంస్కృతచ్ఛాయ :-

'అష్టమేచ వర్షే ... ... మధురం అపయాతః యవన
రాజః డిమితః?'

'ద్వాదశేచ వర్షే ... ... మాగధంచ రాజానం బృహస్పతి
మిత్రం పాదౌవన్దయతి'

ఇందు డిమితుడు డెమిట్రస్ అని, బృహస్పతిమిత్రుడు పుష్యమిత్రుడనికల్పించి శాతకర్ణి, ఖారవేలుడు, డెమిట్రస్, పుష్యమిత్రుడు సమకాలికులని ఒకసమన్వయము కలదు[29] పుష్యనక్షత్రమునకు అధిపతి బృహస్పతి కనుక బృహస్పతి మిత్రుడు అనగా పుష్యమిత్రుడని అర్థమట! శాసనములందు, పురాణములందు, ఇతరగ్రంథములందు పుష్యమిత్రుని ఎవ్వరును బృహస్పతి మిత్రుడని పేర్కొనలేదు. హాథీగుంఫ శాసనమున అట్లు పేర్కొనవలసిన ఆవశ్యకములేదు. పుష్యమిత్రుడు పుష్యమిత్రుడే. బృహస్పతి మిత్రుడు బృహస్పతి మిత్రుడే. ఇద్దఱును భిన్న వ్యక్తులు. ఇక డిమితుడు. అసలు డిమిత అను పాఠము మూలపాఠము కాదు. పరిష్కర్త పాఠము అందుకే కుండలీకృతము. అంతేకాదు. ప్రశ్నార్థక చిహ్నితము. ఉపరి, డిమితుడు ఎంతమాత్రము డెమిట్రస్ కాడని అద్యతన చరిత్రకారుల అభిప్రాయము.[30] అంతేకాదు. ఖారవేలుని హాథీగుంఫ శాసనకాలము లిపి స్వరూపమునుబట్టి, మఱికొన్ని అంతస్సాక్ష్యములను బట్టి క్రీస్తుపూర్వము ప్రధమ శతాబ్ది తుది భాగమని. కాబట్టి ఖారవేలుని రాజ్యకాలము క్రీస్తుపూర్వము ప్రధమ శతాబ్ది తుదిభాగమని అద్యతన చరిత్రకారుల అభిప్రాయము.[31] అందువలన శాతకర్ణి, ఖారవేలుడు, డెమిట్రస్, పుష్యమిత్రుడు సమకాలికులను పూర్వ సమన్వయము పరాస్తము. శాతకర్ణి, ఖారవేలుడు మాత్రము సమకాలికులు.

శాతవాహనులు పాలించిన కాలమునకు ప్రారంభదశ క్రీస్తుపూర్వము ప్రధమ శతాబ్ది తుదిభాగము, ఖారవేలుని రాజ్యకాలము క్రీస్తుపూర్వము ప్రధమ శతాబ్ది తుదిభాగము కనుక ఖారవేల శాతకర్ణుల సమకాలికత సాధకము. ఖారవేలునికి సమకాలికుడైన శాతకర్ణి శ్రీశాతకర్ణి అని పూర్వ సమన్వయము. అతడు వీరుడు, శూరుడు, అప్రతిహతచక్రుడు కనుక అది సంగతమే. కాని అంతకంటె బలవంతుడు శిముక శాతవాహనుడు. శిముక శాతవాహనునికిని శాతకర్ణి శబ్దము భవిష్యోత్తర పురాణమున కలదు.

'శిముకః శాతకర్ణిస్తు యమాహుర్బలినం జనాః'

ఇందు జను లందఱు శిముక శాతకర్ణిని బలవంతుడని వ్యవహరించునట్లు స్పష్టము. అంతేకాదు. శిముకుడు శాతకర్ణి అనియు స్పష్టము. శాతవాహను లందఱికిని శాతకర్ణి శబ్దము సర్వసాధారణము. శాతవాహన శాతకర్ణి శబ్దములు సమానార్థకములు కావచ్చును. అదటుంచి జనులందఱు శిముక శాతకర్ణిని బలవంతుడని వ్యవహరించు రనగా అతడు జగత్ప్రసిద్ధుడని అర్థము. అట్టి జగత్ప్రసిద్ధి లేనిచో ఖారవేలుడు శాతకర్ణిని 'లెక్కసేయక' అనుట పొసగదు. జనవాక్యము, పురాణవచనము మాత్రము కాదు శిముక శాతకర్ణి మహాబలవంతుడుకానిచో మగధరాజు కాణ్వుడైన సుశర్మను వధించి రాజ్యమును స్థాపించుట జరుగదు. కాబట్టి ఖారవేలుని సమకాలికుడైన శాతకర్ణి శిముక శాతకర్ణి అని గ్రాహ్యము.

శిముకశాతవాహనుడుకాణ్వభృత్యుడని విష్ణుభాగవతపురాణములందు, వాయుపురాణ పరిష్కృత పాఠమునందు కలదు. కాణ్వభృత్యుడైన శిముకుడు లేక సింధుకుడు లేక బలి లేక బలిపుచ్ఛకుడు కాణ్వుడైన సుశర్మను చంపి, శుంగుల శేషమును నాశనము చేసి రాజు అగునని వాయు మత్స్య విష్ణు బ్రహ్మాండ భాగవతపురాణములందు కలదు. కాణ్వుల సేనాధ్యక్షుడు శాతవాహనవంశజుడు సింహకస్వాతికర్ణాఖ్యుడు బలవంతుడు శిముకుడు లేక శిముక శాత

కర్ణి ఆంధ్రవంశ్యులైన తన సైనికులను ప్రతిష్ఠానపురమునుండి తీసికొనిపోయి, విజస్వామి అయిన కాణ్వసుశర్మను చంపి, శుంగుల శేషమును నాశనము చేసి ఆంధ్రవంశ ప్రతిష్ఠాత అగునని భవిష్యోత్తర పుర్ణాణమున బాహాటముగ కలదు. ఇది శాతవాహనపురాణ సాధమునకు పునాది. అంతేకాదు. సుశర్మకు పూర్వుడు శుంగ భృత్యుడు అమాత్యుడు, కాణ్వుడు అయిన వసుదేవుడు శుంగ రాజైన దేవభూతిని వధించి రాజు అగునని వాయు మత్స్య విష్ణు బ్రహ్మాండ భాగవత భవిష్యోత్తర పురాణములందు కలదు· అందుకు హేతువును భవిష్యోత్తరపురాణమున కలదు. దేవభూతికి పూర్వుడు, మౌర్యసేనాపతి, శుంగుడు అయిన పుష్యమిత్రుడు మౌర్యరాజైన బృహద్రధుని వధించి రాజు అగునని వాయు మత్స్య విష్ణు బ్రహ్మాండ భాగవత భవిష్యోత్తరపురాణములందు కలదు. బృహద్రధునికి పూర్వుడు, మౌర్యుడుఅయిన చంద్రగుప్తుని, కౌటిల్యుడు (చాణక్యుడు) నందనవంశ నాశనముచేసి రాజ్యాధిపతిని చేయునని వాయు,మత్స్య,విష్ణు, బ్రహ్మాండ, భాగవత, భవిష్యోత్తరపురాణము లందు కలదు. అనగా మౌర్యవంశము తదుపరి శుంగవంశము, శుంగవంశము తదుపరి కాణ్వవంశము, కాణ్వవంశము తదుపరి ఆంధ్రవంశము పరిపాలించినట్లు స్పష్టము పురాణప్రోక్తమైన మౌర్య శుంగ కాణ్వ వంశక్రమము చరిత్రకు సంవదించునది. అట్లు మౌర్య, శుంగ, కాణ్వ, ఆంధ్రవంశక్రమమును చరిత్రకు సంవదించుట విధాయకము. అపరిహార్యము.

మౌర్యవంశము నూటముప్పదియేడు సంవత్సరములు, శుంగ వంశమునూటపండ్రెండు సంవత్సరములు, కాణ్వవంశము నలుబదియైదుసంవత్సరములు పాలించునని వాయు మత్స్య విష్ణు బ్రహ్మాండ భాగవతపురాణములందు కలదు. భవిష్యోత్తరపురాణమున మౌర్య వంశము మూడువందలపదారు సంవత్సరములు, శుంగవంశము మూడువందల సంవత్సరములు, కాణ్వవంశము ఎనుబదిఎన్మిది సంవత్సరములు పాలించునని కలదు. ఇది ఆంధ్రవంశము నాలుగున్నర శతాబ్దులు లేక అయిదుశతాబ్దులు పాలించునని అన్ని పురాణము లందును ఉన్న పరిగణనమువంటిదే అగును. మౌర్య వంశము నూటముప్పదియేడు సంవత్సరములు, శుంగవంశము నూట పండ్రెండు సంవత్సరములు, కాణ్వవంశము నలుబదియైదు సంవత్సరములు పాలించుట మాత్రమే చరిత్రకు సంవదించునది.

మౌర్యవంశమునకు మూలపురుషుడు చంద్రగుప్తుడు. మౌర్యచంద్రగుప్తుడు మగధ సింహాసనమును అధిష్ఠించినకాలము క్రీస్తుపూర్వము, 322వ సంవత్సరమని, 324వ సంవత్సరమని అభిప్రాయభేదములు కలవు.[32] మౌర్యచంద్రగుప్తుడు సందర్శించిన గ్రీకురాజు అలెగ్జాండర్ భారతదేశమును క్రీ. పూ. 325వ సంవత్సరమున వదలి వెళ్లుట సునిశ్చయము.[33] అనంతరముఅలెగ్జాండర్ సేనాపతి, అప్పటి సిరియారాజు అయిన సెల్యూకస్ నికటర్ సింధు నదిని దాటి తూర్పు భారతదేశము మీద దండయాత్ర సాగించి, చంద్రగుప్తునితో సంధిచేసికొనుట జరిగినది.[34] అనగా చంద్రగుప్తుడు అప్పటికి సింహాసనమును అధిష్ఠించినట్లు అర్థము. కాబట్టి మౌర్యచంద్రగుప్తుడు మగధ సింహాసనమునుఅధిష్ఠించిన కాలము క్రీ. పూ. 325వ సంవత్సరమే అగును. ఇది బౌద్ధమత గ్రంధములకు సంవదించునది. గౌతమబుద్ధుని మహాపరి నిర్వాణము నకు 218 సంవత్సరముల అనంతరము ప్రియదర్శి సింహాసనమును అధిష్ఠించినట్లు మహావంశమునందు, దీపవంశమునందు కలదు.[35] గౌతమబుద్ధుని మహాపరినిర్వాణకాలము క్రీ. పూ. 543వ సంవత్సరము.[36] అనగా ప్రియదర్శి సింహాసనమును అధిష్ఠించిన కాలము క్రీ. పూ. 543 – 218 = 325వ సంవత్సరము. ప్రియదర్శి అనగా సాధారణముగ అశోకుడు. అశోకుడు మౌర్య చంద్రగుప్తుని మనుమడు. అలెగ్జాండర్, సెల్యూకస్‌లకు సంబంధించిన వ్యక్తి కాదు. మౌర్యచంద్రగుప్తుడే వారికి సమకాలికుడు. కనుక మౌర్యచంద్రగుప్తుని రాజ్యారంభకాలము అశోకుని రాజ్యారంభకాలముగ అర్వాచీన బౌద్ధగ్రంధములందు ప్రమాదపతితము కావచ్చును. కాబట్టి మౌర్యచంద్రగుప్తుడు మగధ సింహాసనమును అధిష్ఠించినకాలము క్రీ. పూ. 325వ సంవత్సరమని గ్రాహ్యము. కాబట్టి మౌర్యవంశరాజ్యకాలము క్రీ. పూ. 325 సం॥ నుండి క్రీ. పూ 188వ సం॥ వఱకు (325 – 137=188);శుంగవంశ రాజ్యకాలము క్రీ. పూ. 188వ సం॥ నుండి క్రీ. పూ. 76వ సం॥ వఱకు (188–112=76); కాణ్వవంశ రాజ్యకాలము క్రీ. పూ. 76వ సం॥ నుండి క్రీ. పూ· 31వ సం॥వఱకు (76–45=31) అగును. అయిన కాణ్వ సుశర్మను చంపి, శుంగుల శేషమును నాశనముచేసి, శిముకశాతవాహనుడు ఆంధ్ర సింహాసనమును అధిష్ఠించినకాలము క్రీ. పూ. 31వ సంవత్సరము. ఇది ఆంధ్రవంశరాజ్యకాలమునకు అనగా శాతవాహన రాజ్యకాలమునకు ప్రాగవధి.

ఇక పరమావధి. ఇది నిర్ణయించుటకు ఒక చారిత్రిక సాధనము కలదు.[37] పురాణములందు శాతవాహనుల తర్వాత ఆభీరులు, ఇక్ష్వాకులు, శకులు పాలింతురని కలదు. శకులైన క్షాత్రపులలో అర్వాచీనులు దక్షిణా వధమున అధమపక్షము కొంత భాగము పాలించినట్లు ఆధారములు కలవు. వారిలో మొదటి పాలకుడు విజయసహా లేక సేనుడు. ఇతని శాసనకాలము క్రీ. శ. 222వ సంవత్సరము. చివటి పాలకుడు విశ్వసహా లేక సేనుడు. ఇతని నాణెములు క్రీ. శ. 292, 302 సంవత్సరములనాటివి కర్హాద్ (కరహాటకము) దగ్గఱ లభించినవి. కాబట్టి తన్మధ్య కాలము అనగా మూడవశతాబ్ది మూడవదశ శాతవాహనులు పాలించిన కాలమునకు పరమావధి అగును.

మఱి శాతవాహనుల కాలనిర్ణయమునకు సమన్వితములు కావలసిన ప్రధాన చారిత్రిక విశేషములు నాలుగు కలవు.

1. అజ్ఞాత కర్తృకమైన 'పెరిప్లస్ ది ఎరిత్రియన్ సీ' అను మార్గదర్శక గ్రంధమునందు 41వ అధికరణమునసౌరాష్ట్రము నకు అధిపతి మొంబారస్ అని కలదు. 52వ అధికరణమున పెద్ద సరగనస్ కాలము నందు కల్యాణి అను పట్టణము అభివృద్ధి చెందినట్లు, సందరెన్ కాలమున అచటవ్యాపారము తీవ్రనిర్బంధము

లకు లోనైనట్లు, గ్రీకు నౌకలు పొరబాటున రేవులో ప్రవేశించిన రక్షకభటవర్గము భరుకచ్ఛమునకు తరలించునట్లు కలదు. ఆ విషయమిది [38] :

'41. To the gulf of Baraca succeeds that of Barygaza and the mainland of Ariaca, a district which forms the frontier of the kingdom of Mombarus and of all India —

52. The local marts which occur in order along the coast after Barygaza are Akabaru Suppara Kalliena, a city which was raised to the rank of a regular mart in the times of the elder Saraganus, but after Sandarnes became its master, its trade was put under the severest restrictions; for if Greek vessels even by accident enter its ports a guard is put on board and they are taken to Barygaza'.

ఇందు 'మొంబారస్'ను 'నంబానస్'గ సవరించి అతడు సౌరాష్ట్ర పాలకుడైన నహపానుడని డబ్ల్యు. హెచ్. స్కాఫ్ సమన్వయము.[39] అది మొదట అనుసరించినను తరువాత అసంగతమని కె.పి. జయస్వాల్ నిర్ణయము.[40] కాని, మొంబారస్ మహేంద్ర శాతవాహనుడని మఱల జయస్వాల్ సూచనము.[41] మహేంద్ర శాతకర్ణి సౌరాష్ట్ర పాలకుడైన శాతవాహన రాజ్యము లోని కళ్యాణి పట్టణమున వ్యాపారము తీవ్ర నిర్బంధములకు లోనగుట, గ్రీకు నౌకలను భరుకచ్ఛమునకు తరలించుట సంగతము కాదు. కాబట్టి, మొంబారస్ ఎంత మాత్రము మహేంద్ర శాతవాహనుడు కాడు. నహపానుడు అంతకంటె కాడు. నహపానుని పూర్వుడు భూమకుడు కావచ్చును. ఉభయులు సౌరాష్ట్ర పాలకులు ఉపరి, క్షత్రపులు. క్షత్రపుల పేరులందు బిందుప్రాప్తి వికల్పము. మఱొక క్షత్రపుడు శోడాశుని పేరు శోండాశుడనియు శాసనము అందు కలదు.[42] అట్లు భూమకుడు భూంమకుడు అయిన, వర్ణవ్యత్యయము జరిగి మొంబారస్ అను గ్రీకు వికారము నిష్పన్నమగును. ఇక సరగణస్ శాతకర్ణి శబ్దమునకు గ్రీకు వికార మని డబ్ల్యు హెచ్. స్కాఫ్ సమన్వయము.[43] సర్వసమ్మతము. సందర్నెస్ సుందర శాతకర్ణి అని కూడ డబ్ల్యు. హెచ్. స్కాఫ్ సమన్వయము.[44] శకసామంతుడని డాక్టర్ డి. సి. సర్కార్ సమన్వయము.[45] సరగణస్ ఒక శాతకర్ణి అయిన సందర్నెస్ మఱొక శాతకర్ణి అగును. అతడు స్కంద శాతకర్ణి అగును. సరగణస్‌కు పెద్ద అను విశేషణము కలదు. ఏబదియారు సంవత్సర ములు పాలించునని ఏకగ్రీవముగ నాల్గు పురాణములును పేర్కొన్న శ్రీ శాతకర్ణి వార్ధక దశలో పెద్ద శాతకర్ణి అనబడుట లోక సహజము. అతడు వీరుడు, శూరుడు, అప్రతిహతచక్రుడు అని పూర్వోక్తము. అతని కాలమున శాతవాహనులకు సౌరాష్ట్ర పాలకులైన శకుల బెడద లేదని, స్కంద శాతకర్ణి కాలమున శాతవాహనులకు సౌరాష్ట్ర పాలకులైన శకుల బెడద వచ్చిపడినదని ప్రకరణమును బట్టి ప్రతీయమానము. అది పెరిప్లస్ అను గ్రంథము యొక్క రచనా కాలమునకు అవ్యవహిత పూర్వమని అనుమేయము. పెరిప్లస్ అను గ్రంథము క్రీ.శ. 73–77 సం.ల మధ్య కాలమున ప్లినీ రచించిన 'నేచురల్ హిస్టరీ' అను గ్రంథము కంటె పూర్వకాలికమని సాధారణాభిప్రాయము.[46] అనగా పెరిప్లస్ అను గ్రంథము యొక్క రచనా కాలము స్థూలముగ క్రీ. శ. 70 ప్రాంతము కావచ్చును. కాబట్టి శ్రీ శాతకర్ణి పరిపాలించిన కాలము క్రీ.శ. 70వ సంవత్సరమునకు సమీప పూర్వకాలము, స్కంద శాతకర్ణి పరిపాలించిన కాలము క్రీ. శ. 70వ సంవత్సరమునకు సమకాలము కావలయును.

2. వాసిష్ఠీపుత్త్ర పులుమావి నాసికశాసనమున గౌతమీ పుత్త్ర శాతకర్ణి సౌరాష్ట్ర పాలకుడని, కహరాతవంశ నిరవశేషకరు డని కలదు.[47]

## ప్రాకృతము :-

'... ... సురఠ ... ... రాజస'
'ఖఖరాత వస నిరవసేసకరస'

## సంస్కృతచ్ఛాయ :-

'... ... సురాష్ట్ర ... ... రాజస్య'
'క్షహరాతవంశ నిరవశేష కరస్య'

ఇందు గౌతమీపుత్త్ర శాతకర్ణి సౌరాష్ట్ర పాలకుడని, క్షహరాతవంశ నిరవశేషకరుడని స్పష్టము. క్షహరాతవంశజులు సౌరాష్ట్రపాలకులు. చరిత్రకు అందినంతవరకు భూమకుడు, నహపానుడు అని ఇద్దఱు మాత్రమే క్షహరాతవంశజులైన సౌరాష్ట్రపాలకులు కలరు.[48] అందు నహపానుడు దక్షిణా పథము లోని ఉత్తర కొంకణము, గోవర్ధనము (నాసిక) లోని అహారములు (మండలములు), మామాలపురము (పూనా) పాలించినట్లు నహ పానునికి సంబంధించిన శాసనములు కలవు.[49] అట్టి నహపానుని గౌతమీపుత్త్ర శాతకర్ణి సర్వనాశనము చేసినట్లు నాణెముల ప్రమాణము కలదు. అది జగల్తాంబి యొద్ద ఉపలబ్ధమైన, గౌతమీపుత్త్రశాతకర్ణి పునర్ముద్రించిన పదమూడువేల ఏడువందల నహపానుని నాణెముల నిధి [50] అవి బహుకాలము వాడుకలో ఉన్న తర్వాత పునర్ముద్రించినట్లు కలవని, కనుక గౌతమీపుత్త్రశాతకర్ణి, నహపానుడు సమకాలికులుకారని ఒక వాదము కలదు [51] కాని గౌతమీపుత్త్ర శాతకర్ణి క్షహరాతవంశనిరవశేషము కావించి సౌరాష్ట్ర పాలకుడు అయిన తర్వాత నహపానుని నాణెములు బహుకాలము వాడుకలో ఉండుట సంగతము కాదు. అవి నహపానుని కాలము నందే బహుకాలము వాడుకలో ఉండుట బాహాటము. నహపానుడు నలుబది లేక నలుబదిరెండు సంవత్సరముల వఱకు పరిపాలించి నట్లు జైనమత గ్రంథములైన పట్టావలి, హరివంశము అందు కలదు.[52] అంతేకాదు. భరుకచ్ఛము (సౌరాష్ట్ర రాజధాని) లోని నహపానుని, ప్రతిష్ఠానము (శాతవాహన రాజధాని)లోని శాలివాహన రాజు చంపినట్లును జైనమత గ్రంథము అందు కలదు [53]

'భరుయచ్ఛే ణహరే నవవాహణోరాయా కోసనమిద్ధో,
ఇ ఓ య పఇట్ఠాణే సాలవాహణోరాయా బలసమిద్ధో ...
ఏసా దవ్వపణిహీ భావపణిహీ ఏ ఉదాహరణం—'

ఇది ఆవశ్యకసూత్రనిర్యుక్తిలోని అంశము. ఇందు భరుకచ్ఛమున నహవాహనుడు అనగా నహపానుడు మహాధనవంతుడని. ప్రతిష్ఠానమున శాలివాహనుడు అనగా శాతవాహనుడు మహా బలవంతుడని స్పష్టము. శాతవాహనరాజు నహపానుని ఉపాయమున చంపినట్లు ఇంకను సవివరముగ కలదు. ఆ శాతవాహనరాజు క్షహరాతవంశ నిరవశేషకరుడైన గౌతమీపుత్ర శాతకర్ణియే అగుట నిరాఘాటము. కాఁబట్టి గౌతమీపుత్ర శాతకర్ణి నహపానుని చంపి, క్షహరాతవంశ నిరవశేషకరుడయి, నహపానుని నాణెముల మీద ఒకవైపు స్వముద్రను పునర్ముద్రించి సౌరాష్ట్రమును పాలించినట్లు స్పష్టము. అయినను, గౌతమీపుత్ర శాతకర్ణి నహపానుని కాక నహపానుని కుమారుని చంపినట్లు వింతవాదము కలదు.[54] ఆ వాదమునకు వాయుపురాణమున నఖపానజుడు లేక నహపానజుడు కలడమట ప్రాతిపదిక. కాని, వాయుపురాణమున నఖవానుడు లేక నఖవంతుడువినా నఖపానజుడు కాని, నహపానజుడు కాని లేదు. అంతేకాదు. నఖవానుడు లేక నఖవంతుడు నాగకులోద్వహుడు. ఆ శ్లోకమిది :

'భోగీ భవిష్యతోరాజా నృపో నాగకులోద్వహః
సదా చన్ద్రస్తు చన్ద్రాంశో ద్వితీయో నఖవాంస్తథా'
— శ్లో. 361, అ. 37, ఉ. అ.

ఇందు నఖవానుడు లేక నఖవంతుడు నాగకులోద్వహుడని స్పష్టము. నాగకులోద్వహుడు అనగా నాగకులమును ఉద్ధరించిన వాడని, అథవా, నాగకులమున ఉద్భవించినవాడని అర్థము. అనగా నాగవంశజుడని తాత్పర్యము. అతడు క్షహరాతవంశజుడు అగుట అసంభవము. కాఁబట్టి గౌతమీపుత్ర శాతకర్ణి నహపానుని కుమారుని చంపెనను వాదము నిరాలంబ నృత్యము. శాసనాధారమును బట్టి, నాణెముల ప్రమాణమును బట్టి, గ్రంథసాక్ష్యమును బట్టి గౌతమీపుత్ర శాతకర్ణి నహపానుని చంపి క్షహరాతవంశ నిరవశేషకరు డగుటయే సంభవము.

నహపానునికి సంబంధించిన శాసనములు అయిదు కలవు. అందు నహపానుని అల్లుడు ఋషభదాతుడు లేక వృషభదత్తుడు వేయించిన శాసనములు నాసికలో మూడు, కార్లేయందు ఒకటి కలవు. నహపానుని అమాత్యుడు వేయించిన శాసనము జున్నార్‌లో ఒకటి కలదు. నాసిక శాసనమున 41, 42, 45 అని, జున్నార్ శాసనమున 46 అని సంవత్సర సంఖ్యలు కలవు. అవి శాలివాహన శక సంవత్సరములని, విక్రమ శక సంవత్సరములని అభిప్రాయ భేదములు కలవు[55] నతి్ౕక శకసంవత్సరములని, రాజ్యవర్షములని వాదములు కలవు.[56] కాని ఆ శాసనముల లిపి స్వరూపమునుబట్టి, అందౌ శాసనములోని అంశముల సాదృశ్యమును బట్టి, శాలివాహన శక సంవత్సరములని డాక్టర్ డి. సి. స ర్కర్ నిర్ణయము[57] కాఁబట్టి నహపానునికి సంబంధించిన శాసనముల కాలము క్రీ. శ. 119వ సం. నుండి 124వ సం. వఱకు అని స్పష్టము. (41 + 78 = 119; 46 + 78 = 124) అనగా గౌతమీపుత్ర శాతకర్ణి నహపానుని సంహరించి, క్షహరాతవంశ నిరవశేషకరుడయి, సౌరాష్ట్ర పాలకుడైన కాలము క్రీ. శ. 124వ సంవత్సరము కంటె పూర్వము కాదని అవగాహకము.

ఇందుకు ఒక పూర్వపక్షము కలదు.[58] గౌతమీపుత్ర శాతకర్ణి 124వ సం. ప్రాంతమున నహపానుని క్షహరాత వంశమును నిర్మూలించినచో, అతని రాజ్యమున ఉజ్జయినికలదు. అదే 124వ సం. ప్రాంతమున చష్టనుడు ఎట్లు ఉజ్జయినికి పాలకుడగును? అను ఎదురుప్రశ్న అది.

**'If Goutamiputra Satakarni uprooted ksharata (Nahapana) after the year 46 (supposed to be 124 A. D.) whose rule included Ujjain, how could Chastana be ruling at Ujjain about 124 A.D. ?'**

ఇది కె. పి. జయస్వాల్ గారి ప్రశ్న. ఇందు ప్రతిబంధకము దుర్బలము. వాసిష్ఠీపుత్ర పులుమావి నాసిక శాసనమున గౌతమీపుత్ర శాతకర్ణి అవంతీదేశ పాలకుడని కల మాట యథార్థము. అవంతీ దేశమునకు రాజధాని ఉజ్జయిని. పూర్వోక్తమైన అందౌ శాసనము చష్టనుని, అతని మనుమడు రుద్రదాముని సంయుక్త శాసనము. చష్టనుడు మహారాజు, రుద్రదాముడు యువరాజు కావచ్చును. అందౌ శాసన కాలము క్రీ. శ. 130 వ సంవత్సరము. అనగా 130 వ సం. ప్రాంతమున చష్టనుడు అవంతీ పాలకుడని అర్థము. క్రీ. శ. 124వ సం. ప్రాంతమున గౌతమీపుత్ర శాతకర్ణి, క్రీ. శ 124వ సంవత్సరమునకు పూర్వము 130వ సం. ప్రాంతమున చష్టనుడు అవంతీ పాలకులగుట అసంభవము కాదు. గౌతమీపుత్రశాతకర్ణి అవంతీదేశ పాలకత్వము నాలుగైదు సంవత్సరములకు పరిమితమగుట విపరీతము కాదు. నహపానుడు క్షహరాత వంశజుడు చష్టనుడు కార్దమక వంశజుడు.[59] కాఁబట్టి ఈ పూర్వ పక్షమువలయి సమన్వయమునకు ప్రతిబంధకము కాదని స్పష్టము. అనగా గౌతమీపుత్ర శాతకర్ణి నహపానుని సంహరించి, క్షహరాత వంశ నిరవశేషకరుడయి, అవంతీ సౌరాష్ట్రములకు పాలకుడైన కాలము క్రీ. శ. 124వ సం. ప్రాంతము కాఁబట్టి గౌతమీపుత్ర శాతకర్ణి పరిపాలించిన కాలము క్రీ. శ. 124 వ సంవత్సరమునకు సమకాలము కావలయును.

3. టాలెమీ అను గ్రీకు భూగోళ శాస్త్రజ్ఞుని గ్రంథమునందు అతని కాలమున ప్రతిష్ఠానమునందు శ్రీ పులుమావి, ఉజ్జయినిలో చష్టనుడు పాలించుచున్నట్లు కలదు. ఆ సందర్భము లివి[60] :

'Baithana (the royal seat) of (Siro)
Ptolemaios or Polemaios 18° 30°
Ozene, the capital of Tiastanes 117° 20°'

ఇందు బైరాన=పైథాన్ లేక ప్రతిష్ఠానము. సిరోప్టోలిమ య్మైస్ లేక పోలిమయ్మైస్ = శ్రీ పులుమావి: ఒజేనే = ఉజ్జయిని. తైస్టనెస్ = చష్టనుడు. ఉజ్జయిని పాలకుడైన చష్టనుడు కలడు. ప్రతిష్ఠాన పాలకులైన పులుమావులు కలరు. ఒక పులుమావి, చష్టనుడు, టాలెమీ సమకాలికులని టాలెమీ సమాచారమును బట్టి స్పష్టము అంధౌ శాసనమున చష్టనుడు కలడని పూర్వోక్తము. ఆ విషయ మిది[61] .

## ప్రాకృతము :-

'[రాజో] [చాష్ట] న స య్సామోతిక పుత్రస
రాజో రుద్రదామస్ జయదామ పుత్రస—'

## సంస్కృత చ్ఛాయ :-

'రాజ్ఞః చష్టనస్య జామోతిక పుత్రస్య
రాజ్ఞః రుద్రదామ్నః జయదామ పుత్రస్య'

ఇందు చష్టనుడు, రుద్రదాముడు సంయుక్త పాలకులుగ స్పష్టము. ఇక రుద్రదాముని జునాగడ్ శాసనము నందు చష్టనుని పౌత్రుడు రుద్రదాముడు మాత్రమే పాలకుడుగ కలదు. ఆ విషయ మిది[62] :

'స్వామి చష్టనస్య పౌత్ర [స్య] [రాజ్ఞః క్షత్రపస్య
సుగృహీతనామ్నః స్వామి జయదామ్న] పుత్రస్య రాజ్ఞో
మహాక్షత్రపస్య గురుభిరభ్యస్తనామ్నో రు[ద్రు]దామ్నో—'

ఇందు చష్టనుని పౌత్రుడు రుద్రదాముడు మాత్రమే పాలకుడని స్పష్టము. అంధౌ శాసనకాలము క్రీ. శ. 130వ సంవత్సరము. జునాగడ్ శాసనకాలము క్రీ. శ. 150 వ సంవత్సరము. టాలెమీ భూగోళశాస్త్ర గ్రంథ రచనాకాలము క్రీ. శ. 140 వ సంవత్సరము.[63] అనగా 140వ సంవత్సరమునకు అవ్యవహితపూర్వ కాలమున ఉజ్జయినిలో చష్టనుడు, ప్రతిష్ఠానమున ఒక పులుమావి పరిపాలించునట్లు స్పష్టము. ఆ పులుమావి వాసిష్ఠీపుత్ర శ్రీ పులుమావి అగును. అతడు గౌతమీపుత్ర శాతకర్ణి తనయుడగుట తన్నిమిత్తము. కాఁబట్టి వాసిష్ఠీపుత్ర శ్రీపులుమావి పరిపాలించిన కాలము క్రీ.శ. 140వ సంవత్సరమునకు సమకాలము కావలయును.

4. చష్టనుని పౌత్రుడైన రుద్రదాముడు ఒక శాతకర్ణిని రెండుసారులు జయించి, సమీప బంధుత్వము వలన సంహరింపక ప్రతిష్ఠ సంపాదించెనని రుద్రదాముని జునాగడ్ శాసనమున కలదు. ఆ విషయమిది [64] :

'......... దక్షిణాపథపతే స్సాతకర్ణే ర్ద్విరపి నిర్వ్యాజమ
వజిత్యా వజిత్య
సంబంధా విదూరతయా అనుత్సాదనాత్ప్రాప్త యశసా ...'

ఇందు రుద్రదాముడు శాతకర్ణిని జయించినట్లు స్పష్టము. రుద్రదాముని జునాగడ్ శాసనకాలము క్రీ.శ. 150వ సంవత్సరము. కనుక రుద్రదామునికి సమకాలికుడుగా క్రీ. శ. 150వ సంవత్సరమున ఒక శాతకర్ణి ఉండవలయును. ఆ శాతకర్ణి వాసిష్ఠీపుత్ర పులుమావి అని,[65] వాసిష్ఠీపుత్ర శాతకర్ణి అని,[66] గౌతమీపుత్ర యజ్ఞశ్రీ శాతకర్ణి అని [67] కూడ అభిప్రాయభేదములు కలవు. వాసిష్ఠీపుత్ర పులుమావియు శాతకర్ణి శబ్దవాచ్యుడే వాసిష్ఠీపుత్ర పులోమ శ్రీ శాతకర్ణి అని భవిష్యత్పురాణమున కలదు. ఆ శ్లోకమిది :

'పులోమశ్రీ శాతకర్ణి ర్ద్వాత్రింశద్భవితా సమాః
వాసిష్ఠీపుత్ర నామ్నాతు శాసనేషు స ఉచ్యతే'

మఱి, వాసిష్ఠీపుత్రశాతకర్ణికి రుద్రదాముడు తనయ నిచ్చి వివాహము చేసినట్లు శాసనప్రమాణము కలదని పూర్వోక్తము. అందువలన రుద్రదాముడు జయించిన శాతకర్ణి అల్లుడైన వాసిష్ఠీపుత్రశాతకర్ణికాక, తత్సంబంధి వాసిష్ఠీపుత్రపులుమావి అగుటయే సంభవము. 'సంబంధావిదూరతయా' అను శాసనస్థ విషయమునకిది సార్థక్యము. కాఁబట్టి వాసిష్ఠీపుత్ర పులుమావి పరిపాలించిన కాలము క్రీ. శ. 150 వ సంవత్సరమునకును సమకాలము కావలయును.

ప్రతిష్ఠాన పురవరాధీశ్వరులైన ప్రధాన శాతవాహన రాజులందు తృతీయుడైన శ్రీశాతకర్ణి క్రీ. శ. 70వ సంవత్సరమునకు సమీప పూర్వకాలమున, తురీయుడైన స్కంద శాతకర్ణి క్రీ. శ. 70వ సంవత్సరమునకు సమకాలమున, సప్తముడైన గౌతమీపుత్ర శాతకర్ణి క్రీ.శ. 124వ సంవత్సరమునకు సమకాలమున, అష్టముడైన వాసిష్ఠీపుత్ర పులుమావి క్రీ. శ. 140వ సంవత్సరమునకు క్రీ. శ. 150వ సంవత్సరమునకు సమకాలమున ఉండుట పరస్పరోపబలకము.

ఇంతకు మిక్కిలి శాతవాహనుల కాలనిర్ణయమునకు సమన్వితములు కావలసిన చారిత్రిక విశేషములు లేవు. అంతేకాదు. శాతవాహన కాలనిర్ణయమునకు ఇతర సాధనములు, అన్యథా బాధనములు లేవు. కాఁబట్టి ప్రతిష్ఠానపురవరాధీశ్వరులైన ప్రధాన శాతవాహన రాజులకు పురాణ రాజనామావళిలోని సంవత్సర సంఖ్యలను స్వీకరించుట ఒకటే గత్యంతరము.

శిముక శాతవాహనుడు 23 సంవత్సరములు పాలించునని వాయు మత్స్య బ్రహ్మాండ భవిష్యోత్తర పురాణములందు ఏకవాక్యత కలదు. కృష్ణుడు 18 సంవత్సరములు పాలించునని బ్రహ్మాండ భవిష్యోత్తర పురాణములందు ఏకవాక్యత కలదు. శ్రీ శాతకర్ణి 56 సంవత్సరములు పాలించునని వాయు మత్స్య బ్రహ్మాండ భవిష్యోత్తర పురాణములందు ఏకవాక్యత కలదు. స్కందశాతకర్ణి ఏడు సంవత్సరములు పాలించునని మత్స్య భవిష్యోత్తర పురాణము లందు ఏక వాక్యత కలదు. హాలుడు ఒక్క సంవత్సరము పాలించునని వాయు బ్రహ్మాండపురాణములందు ఏకవాక్యత కలదు గాని, హాలుడు

వాఙ్మయ వ్యాసంగమునుబట్టి 5 సంవత్సరములు పాలించునను మత్స్య భవిష్యోత్తర పురాణములోని ఏక వాక్యత పరిగ్రాహ్యము. మాఢరీపుత్ర శివస్వాతి శకసేనుడు 28 సంవత్సరములు పాలించునని వాయు మత్స్య బ్రహ్మాండ భవిష్యోత్తర పురాణము లందు ఏకవాక్యత కలదు. గౌతమీపుత్ర శాతకర్ణి 21 సంవత్సరములు పాలించునని వాయు మత్స్య బ్రహ్మాండ పురాణము లందు ఏక వాక్యత కలదు గాని, అది శాసన ప్రమాణమునకు విరుద్ధము. గౌతమీపుత్ర శాతకర్ణి వాసిక శాసనమున 24వ రాజ్యవర్షమని కలదు.[68] కాబట్టి గౌతమీపుత్ర శాతకర్ణి 25 సంవత్సరములు పాలించునను భవిష్యోత్తర పురాణములోని పరిగణనము పరిగ్రాహ్యము. వాసిష్ఠీపుత్ర పులుమావి 28 సంవత్సరములు పాలించునని మత్స్య పురాణమున, 32సంవత్సరములు పాలించునని భవిష్యోత్తర పురాణమున కలదు. తక్కువ సంఖ్యకంటె ఎక్కువ సంఖ్య ప్రమాదరహితము. కాబట్టి వాసిష్ఠీపుత్ర పులుమావి 32 సంవత్సరములు పాలించునను భవిష్యోత్తర పురాణములోని పరిగణనము పరిగ్రాహ్యము. వాసిష్ఠీపుత్ర చతరపణ శాతకర్ణి విషయము కల విష్ణుపురాణము నందు సంవత్సర సంఖ్యలు లేవు. చతరపణ శాతకర్ణి నానాఘాట్ శాసనమున 13వ రాజ్యవర్షమని కలదు.[69] కాబట్టి వాసిష్ఠీపుత్ర చరతపణ శాతకర్ణి కనీసము13 సంవత్సరములు పాలించినట్లు పరిగ్రాహ్యము. శివశ్రీ శాతకర్ణి 7 సంవత్సరములు పాలించునని మత్స్య భవిష్యోత్తర పురాణము లందు ఏక వాక్యత కలదు. గౌతమీపుత్ర యజ్ఞశ్రీ శాతకర్ణి 19 సంవత్సరములు పాలించునని వాయు, బ్రహ్మాండ, భవిష్యోత్తర పురాణము లందు ఏక వాక్యత కలదు గాని అది మఱల శాసన ప్రమాణమునకు విరుద్ధము. గౌతమీపుత్ర యజ్ఞశ్రీ శాతకర్ణి చినగంజాము శాసనమున 27వ రాజ్యవర్షమని కలదు.[70] కాబట్టి గౌతమీపుత్ర యజ్ఞశ్రీ శాతకర్ణి 29 సంవత్సరములు పాలించునను మత్స్య పురాణములోని పరిగణనము పరిగ్రాహ్యము. విజయశ్రీ శాతకర్ణి 6 సంవత్సరములు పాలించునని వాయు మత్స్య బ్రహ్మాండ భవిష్యోత్తర పురాణము లందు ఏక వాక్యత కలదుగాని, శాసన ప్రమాణమునకు విరుద్ధము. గౌతమీపుత్ర శ్రీ విజయ శాతకర్ణి నాగార్జున శాసనమున 8వ రాజ్యవర్షమని కలదు.[71] కనుక గౌతమీపుత్ర శ్రీ విజయ శాతకర్ణి కనీసము 8 సంవత్సరములు పరిపాలించినట్లు పరిగ్రాహ్యము. వాసిష్ఠీపుత్ర చంద్రశ్రీ శాతకర్ణి 3 సంవత్సరములు పాలించునని వాయుమత్స్య బ్రహ్మాండ భవిష్యోత్తర పురాణము లందు ఏక వాక్యత కలదు శ్రీ పులుమావి 7సంవత్సరములు పాలించునని వాయు మత్స్య బ్రహ్మాండ భవిష్యోత్తర పురాణము లందు కలదు. గాని అది కూడ శాసన ప్రమాణమునకు విరుద్ధము. శ్రీ పులుమావి మేకదోని శాసనమున 8వ రాజ్యవర్షమని కలదు.[72] కనుక శ్రీ పులుమావి కనీసము 8 సంవత్సరములు పరిపాలించినట్లు పరిగ్రాహ్యము.

పురాణము లందు ఏక వాక్యత కల సంవత్సర సంఖ్యలు, శాసన ప్రమాణమునకు సంవాదము కల సంవత్సర సంఖ్యలు పరిగ్రహించి, శాతవాహనులు పరిపాలించిన కాలమునకు ప్రాగవధి నుండి పరిగణించిన, ప్రతిష్ఠానపురవరాధీశ్వరులైన ప్రధాన శాతవాహన రాజుల పరిపాలన కాలములు క్రింది విధముగ పర్యవసన్నము లగును.

| | | | | |
|---|---|---|---|---|
| 1. | శిముక శాతవాహనుడుః శాతకర్ణిః | 23 | క్రీ. పూ. | 31–8 |
| 2. | కృష్ణః శ్రీ శాతకర్ణిః | 18 | ,, | 8– క్రీ. శ. 10 |
| 3. | శ్రీ శాతకర్ణి | 56 | క్రీ. శ. | 10–66 |
| 4. | స్కంద శాతకర్ణి | 7 | ,, | 66–73 |
| 5. | హాలుడు | 5 | ,, | 73–78 |
| 6. | మాఢరీపుత్ర శివస్వాతిశకసేనుడు | 28 | ,, | 78–106 |
| 7. | గౌతమీపుత్ర శాతకర్ణి | 25 | ,, | 106–131 |
| 8. | వాసిష్ఠీపుత్ర పులుమావిః పులోమశ్రీ శాతకర్ణిః | 32 | ,, | 131–163 |
| 9. | వాసిష్ఠీపుత్రః చతరపణః శాతకర్ణి | 13 | ,, | 163–176 |
| 10. | శ్రీ శివః వ ఖః/పులుమావి/శాతకర్ణి | 7 | ,, | 176–183 |
| 11. | గౌతమీపుత్ర యజ్ఞశ్రీ శాతకర్ణి | 29 | ,, | 183–212 |
| 12. | గౌతమీపుత్ర శ్రీ విజయ శా కర్ణి | 8 | ,, | 212–220 |
| 13. | వా. ష్ఠీపుత్ర చంద్రశ్రీ శాతకర్ణి | 3 | ,, | 220–223 |
| 14. | శ్రీ పులుమావి | 8 | ,, | 223–231 |
| | | 262 | | 31+231=262 |

ఇది శాతవాహనులు పాలించిన కాలమునకు పరమావధి అయిన క్రీస్తుశకము మూడవశతాబ్ది మూడవ దశకు సంప్రతించు నది. అంతేకాదు. వాయు మత్స్య బ్రహ్మాండ పురాణము లందు సప్తాంధ్రులు కాకుండ శాతవాహనులు స్థూలముగ రెండున్నర శతాబ్దులు పాలింతురను సూచనమునకు సంవదించునది.

ఇందు వాసిష్ఠీపుత్త్ర పులుమావి పరిపాలన కాలమున క్రీ. శ. 131వ సం. నుండి 163వ సం॥ వఱకు కనుక వాసిష్ఠీపుత్త్ర పులుమావి పరిపాలించిన కాలము క్రీ. శ. 140వ సంవత్సరమునకు సమకాలము. క్రీ. శ. 150 వ సంవత్సరమునకును సమ కాలము అనగా టాలెమీ, చష్టనుడు వాసిష్ఠీపుత్త్ర పులుమావి సమకాలికు లగుటసంగతము. అంతేకాదు. రుద్రదాముడు వాసిష్ఠీపుత్త్ర పులుమావి లేక పులోమ శ్రీ శాతకర్ణి సమకాలికు లగుటయు సంగతము.

ఇందు గౌతమీపుత్త్ర శాతకర్ణి పరిపాలన కాలము క్రీ. శ. 106వ సం॥ నుండి 131వ సం॥ వఱకు కనుక, గౌతమీపుత్త్ర శాతకర్ణి పరిపాలించిన కాలము క్రీ. శ. 124వ సంవత్సరమునకు సమకాలము. అనగా గౌతమీపుత్త్ర శాతకర్ణి నహపానుని సంహరించి, క్షహరాతవంశనిరవ శేషకరుడయి, నహపానుని నాణెములు పునర్ముద్రించి సౌరాష్ట్రపాలకుడగుట సంగతము.

ఇందు శ్రీ శాతకర్ణి పరిపాలన కాలము క్రీ శ. 10వ సం॥ నుండి 66వ సం॥ వఱకు కనుక, అది క్రీ. శ. 70వ సంవత్సరమునకు సమీప పూర్వకాలము. స్కంద శాతకర్ణి పరిపాలనకాలము క్రీ.శ. 66వ సం॥ నుండి 73వ సం॥ వఱకు కనుక, అది క్రీ.శ. 70వ సంవత్సరమునకు సమకాలము. అనగా పెరిప్లసు అను గ్రంథము ప్రకారము శ్రీ శాతకర్ణి కాలము నందు కల్యాణిఅభివృద్ధి చెందుట, స్కంద శాతకర్ణి కాలమున అచట వ్యాపారము తీవ్ర నిర్బంధములకు లోనగుట, గ్రీకు నౌకలు పొరబాటున రేవులో ప్రవేశించిన (శక) రక్షకభట వర్గము భరుకచ్ఛమునకు తరలించుట సంగతము.

సమన్వితములు కావలసిన ప్రధాన చారిత్రిక విశేషములు నాల్గును ప్రకృత శాతవాహనరాజ్య కాలనిర్ణయమునకు సమన్వితము లయినవి. కాని, శ్రీ శాతకర్ణి నానాఘాట్ ప్రతిమా శాసనము, నాగనిక నానాఘాట్ శాసనము క్రీస్తుపూర్వము ప్రథమ శతాబ్ది ఉత్తరార్థములోనివికాక, క్రీస్తుశకము ప్రథమ శతాబ్ది పూర్వార్థములోనివి కావలసియున్నవి. లిపి స్వరూపమును బట్టి చేయు శాసన కాలనిర్ణయము అటునిటు స్వల్పకాలవ్యవధానమును సహించునది. శ్రీశాతకర్ణి రాజ్యారంభ కాలము క్రీ. శ. 10వ సంవత్సరము కనుక, నాగనికా శ్రీ శాతకర్ణుల శాసనముల కాలము క్రీ. శ. ప్రథమ శతాబ్ది ద్వితీయదశ కావచ్చును. అది క్రీస్తుపూర్వము ప్రథమ శతాబ్ది ఉత్తరార్ధమునకు నేదిష్ఠకాలమే. కాబట్టి నిర్బాధకము.

ఇక భవిష్యోత్తర పురాణమున ఇతోధిక విశేషము కలదు. అది కడపటి శాతవాహనరాజు శ్రీ పులుమావి ఘటోత్కచుని పుత్త్రుడైన చంద్రగుప్తుని సహాయమున పాలించునని అనంతరము గుప్తులు పాలింతురని కలదు. ఆ శ్లోకమిది :

'పులోమావి తదాచాన్యః సమాః సప్త భవిష్యతి,
ఘటోత్కచస్య పుత్త్రేణ చన్ద్రగుప్తేన పాలితః'
'తేషాంతు సంస్థితే రాజ్యే భూమిర్గుప్తాన్గమిష్యతి
శ్రీ పర్వతీయాన్ధ్ర భృత్యా ఇత్యాఖ్యాం యాంతియేనృపాః'

ఇందు పులుమావి చంద్రగుప్త పాలితుడని, అనంతరము గుప్తులు పాలింతురని, గుప్తులు శ్రీ పర్వతీ యాంధ్రభృత్యులని స్పష్టము అంతేకాదు చంద్రగుప్తుడు పార్వతీయకులోద్భవుడని, శ్రీపర్వతేంద్రాధిపతి అయిన గుప్తభూపతి పౌత్రుడని, ఘటోత్కచ భూపుని తనయుడని, నేపాలాధీశుని పుత్త్రిక కుమారదేవిని వివాహ మాడి, లిచ్ఛవుల సహాయమున రాజ్యాధిపతి అగునని భవిష్యోత్తర పురాణమున కలదు. ఆ శ్లోకము లివి:

'అథ శ్రీ చన్ద్రగుప్తాఖ్యః పార్వతీయ కులోద్భవః
శ్రీ పర్వతేన్ద్రాధిపతేః పౌత్రః శ్రీ గుప్తభూపతేః
శ్రీ ఘటోత్కచభూపస్య తనయోఽమితవిక్రమః
కుమారదేవీ ముద్వాహ్య నేపాలాధీశితుః సుతాం
లబ్ధప్రవేశో రాజ్యేఽస్మిన్ లిచ్ఛవీనాం సహాయతః'

ఇందు చంద్రగుప్తుని భార్య కుమారదేవి అని, చంద్రగుప్తుడు లిచ్ఛవుల సహాయమున రాజ్యాధిపతి అగునని స్పష్టము. ఇది చంద్రగుప్తుని నాణెము లందు కల నామధేయములకు [73] సంవదించునది.

'చంద్రగుప్తః — కుమారదేవీ — లిచ్ఛవయః'

మఱి, చంద్రగుప్తుడు గుప్తభూపతిపౌత్త్రుడు, ఘటోత్కచ భూపుని పుత్త్రుడు అను విషయము చంద్రగుప్తుని పుత్త్రుడైన సముద్రగుప్తుని అలహాబాద్ శిలాస్తంభశాసనములోని సముద్రగుప్తుని వంశక్రమమునకు సంవదించునది. ఆ క్రమమిది[74] :

'మహారాజశ్రీ గుప్తప్రపౌత్రస్య మహారాజశ్రీ ఘటోత్కచ పౌత్రస్య
మహారాజాధిరాజశ్రీ చన్ద్రగుప్తపుత్రస్య లిచ్ఛవీ దౌహిత్రస్య మహాదేవ్యాం
కుమారదేవ్యా ముత్పన్నస్య మహారాజాధిరాజశ్రీ సముద్రగుప్తస్య — '

ఇది గుప్తుల ఇతర శాసనములందును కలదు. [75] సరిగా భవిష్యోత్తరపురాణమును సంవదించునది. కాని గుప్తుల శాసనము లందు గుప్తభూపతి శ్రీ పర్వతేంద్రాధిపతి అని కాని, గుప్తులు శ్రీ పర్వతీయాంధ్రభృత్యులు అని కాని, కానరాదు. అంతేకాదు. గుప్తుల పుట్టుపూర్వోత్తరములు తెలియవని భారతదేశ చరిత్రకారుల భావనము.[76] వాయు మత్స్య విష్ణు బ్రహ్మాండ భాగవత పురాణములందు గుప్తవంశజులు పాలింతురనియే కాని గుప్తరాజుల సమాచారములేదు. శాసనములకు, నాణెములకు సంవదించు భవి

ష్యోత్తరపురాణములోని గుప్తవంశ వివరములవలె, గుప్తవంశజులు శ్రీ పర్వతీయాంధ్రభృత్యులని, గుప్తభూపతి శ్రీ పర్వతేంద్రాధిపతి అని భవిష్యోత్తరపురాణమునందు కల గుప్తుల పుట్టుపూర్వోత్తరములును యథార్థము కావచ్చును. ఇందుకు స్కాందపురాణాంతర్గతమైన శ్రీ శైలఖండములోని గుప్తవంశజుడైన చంద్రగుప్తుని వృత్తాంతము [77] కూడ ఉపబలకము. శ్రీ పర్వతీయాంధ్రభృత్యులు అనగా శ్రీ పర్వతీయాంధ్రుల రాజోద్యోగులని అర్థము. శ్రీ పర్వతీయాంధ్రులు ఇక్ష్వాకులు. ఇక్ష్వాకుల కాలమున గుప్తభూపతి శ్రీ పర్వతీయాంధ్రభృత్యు డగును. అతని పౌత్రుడైన చంద్రగుప్తుడు ఇక్ష్వాకులకు పూర్వుడైన శ్రీ పులుమావికి సమకాలికుడగుట దుర్ఘటము. కాబట్టి శ్రీ పులుమావి చంద్రగుప్త పాలితుడను భవిష్యోత్తరపురాణములోని విషయము మాత్రము ప్రమాద పతితము. కాబట్టి నిర్బాధకము.

సమష్టిపై శాతవాహన రాజ్యకాలము క్రీస్తుపూర్వము 31వ సంవత్సరము నుండి క్రీస్తుశకము 231వ సంవత్సరము వఱకు అని సిద్ధాంతము.

## అ ను బం ధ ము

శాతవాహనుల నాణెములందు శాతవాహన నామాంకితములైన నాణెములు శిముకశాతవాహనుని తండ్రి శాతవాహనుని నాణెములని, శ్రీ శాతకర్ణిపుత్త్రుడు కుమార శాతవాహనుని నాణెములని శిముక శాతవాహనుని నాణెములని చరిత్రకారులందు అభిప్రాయభేదములు కలవు.[78] శిముక శాతవాహనుని తండ్రి శాతవాహనుడనుటకు ఆధారములేదు. ఉపరి, కథాసరిత్సాగర కథా సకమునుబట్టి శిముకశాతవాహనుని తండ్రి దీపకర్ణి కావచ్చును. భవిష్యోత్తరపురాణము నందలి సింహకస్వాతికర్ణి నామధేయము తదుపబలకము. ఇక శ్రీ శాతకర్ణి పుత్త్రుడుకుమార శాతవాహనుడు పాలకుడనుటకు శాసన ప్రమాణములేదు. పురాణ రాజనామావళి పురస్కారమైనను లేదు. కాబట్టి శాతవాహన నామాంకితములైన నాణెములు శిముక శాతవాహనుని నాణెము లగుటయే సంభవము. అంతేకాదు. ఈ వ్యాసమును వ్రాసిన అనంతరము శిముక శాతవాహన నామాంకితములైన నాణెములు దొరికినవి. ఆ నాణెముల మీద 'సిరిఛిముక సాతవాహ' అని కలదు. ఒక నాణెము మీద నామమునకు ముందు జో అను వర్ణము కలదు. అది 'రజో సిరి ఛిముక సాతవాహన' అగును. ఆ నాణెములమీది లిపి స్వరూపమును బట్టి అవి 'సుమారు క్రీ. పూ. 50-40 మధ్య కాలమునకు చెందినవిగా చెప్పవచ్చును...వీటిని ఇంతకంటె తర్వాతకు తీసికొని వచ్చుట కష్టము.' అని వాని సమాచారమును అందజేసిన శ్రీ పి. వి. పరబ్రహ్మశాస్త్రిగారి నిర్ణయము.[79] ఇది శిముక శాతవాహనుని కాలము క్రీ పూ. 31వ సం॥ నుండి క్రీ. పూ. 8వ

సం॥నలకు అనుపయిచారిత్రిక సమన్వయమునకు పరమసన్నిహితము. లిపి స్వరూపమునుబట్టి చేయు కాలనిర్ణయము స్వల్పకాలవ్యవధానమునకు సావకాశము కలది. కాబట్టి శిముకశాతవాహన నామాంకితములైన నాణెముల కాలము పయి సిద్ధాంతమునకు పరిపోషకము.

శాతవాహనుల రాజ్యారంభకాలము క్రీ. పూ. ప్రథమశతాబ్ది ఉత్తరార్ధమే అనుటకు ఉపబలకసాధనములు ఎంకను కలవు అవి ప్రొ॥ అజయ్ మిత్రశాస్త్రిగారు ప్రతిపాదించినవి. ఆ ప్రతిపాదనలివి :

1. 'లిపి స్వరూపమునుబట్టి నాగనిక నానాఘాట్ శాసనము క్రీ. పూ. రెండవ శతాబ్ది పూర్వార్ధమునకు చెందునన్న బూలర్, (Buhler) నానాఘాట్ శాసనములకు గౌతమీపుత్త్రశాతకర్ణి శాసనములకు నడుమ వందసంవత్సరముల కంటె ఎక్కువ కాలవ్యవధానముండదని నొక్కి వక్కాణించెను ఆ కారణమున గౌతమీపుత్త్రశాతకర్ణి కాలము క్రీ.పూ. ప్రథమశతాబ్ది మధ్యకాలముకంటె కొంచెము పూర్వమని బూలర్ భావించెను. కాని, ఇప్పుడు గౌతమీపుత్త్రశాతకర్ణి కాలము క్రీ. శ. రెండవ శతాబ్ది పూర్వార్ధమని ఇంచుమించు ఏకవాక్యత కలదు కనుక, నాగనిక నానాఘాట్ శాసనము క్రీ. శ. ప్రథమ శతాబ్ది మధ్యకాలముకంటె పూర్వ... కాజాలదు.

2. ఇటీవల మహారాష్ట్రదేశము నందలి అహమ్మద్ నగర మండలములోని గోదావరీనదికి ఉపనది అయిన ప్రవర సమీపమున నెవసాయొద్ద సంక్షిప్తముగ జరిపిన పురావస్తు ఖననముల పొరల భూగర్భశాస్త్రీయపరిశీలనమున (Stratiography)మానవుల మనుగడను తెలుపు ఆరుకాలములు వెలుగునకు వచ్చినవి. అందు నాల్గవకాలమునకు సంబంధించిన పొరలలో శాతవాహనరాజుల – శాతకర్ణి, శాతవాహనుడు – నాణెములు రెండు లభించినవి. ఆ నాల్గవకాలమున ఇనుము; నలుపు, ఎరుపు వస్తువులు మొదలైనవి వాడబడినవి. ఆ కాలము క్రీ పూ. ప్రథమశతాబ్ది తుదిభాగము లేదా క్రీస్తుశకము ప్రథమశతాబ్ది తొలిభాగము. అంతేకాదు. క్రీస్తుశకము రెండవశతాబ్ది తొలిభాగము కూడ.

3. కాళిదాసు మాళవికాగ్నిమిత్రము చారిత్రిక సంఘటనల మీద ఆధారపడిన నాటకము. అందు విదర్భదేశము యజ్ఞసేనుని ఆధిపత్యమున స్వతంత్రరాజ్యమైనట్లు కలదు. యజ్ఞసేనుడు అగ్నిమిత్రునికి శుంగరాజులైన పుష్యమిత్రునికి అగ్నిమిత్రునిక ప్రబల శత్రువు అయిన కడపటి మౌర్య మంత్రికి సమీపబంధువు యజ్ఞసేనునికి జ్ఞాతి, అగ్నిమిత్రునికి మిత్రుడు అయిన మాధవసేనుడు అగ్నిమిత్రుని రాజధానిఅయిన విదిశానగరమునకు వెళ్ళుచుండగా, అతనిని యజ్ఞసేనునిఅధికారి (అంతపాలుడు) బంధించును అతనిని విడుదల చేయుమని అగ్నిమిత్రుడు అడుగ, అగ్నిమిత్రుడు అంతకుముందు బంధించిన మౌర్యమంత్రిని విడుదలచేయుమని యజ్ఞసేను- అడుగును ఫలితముగ అగ్నిమిత్రుడు తన బావమరది వీరసేనుని విదర్భదేశముమీద దండయాత్ర చేయించును. యజ్ఞసేనుడు ఓడిపోవును. మాధవసేనుడు విడుదల అగును. అంతేకాదు. విదర్భదేశము యజ్ఞసేన, మాధవసేనులకు విభక్తమగును. ఉభయులును పుష్యమిత్రుని సార్వభౌమాధికారమును అంగీకరింతురు. కాబట్టి పుష్యమిత్ర శుంగుని కాలమున విదర్భదేశము మొదట ఒక స్వతంత్రరాజ్యమని, తరువాత రెండు సామంతరాజ్యములని స్పష్టము. ఇటీవల విదర్భదేశములోని భండారమండలము నందలి పౌని అను చారిత్రికస్థలమున శాతకర్ణి I నాణెములు రెండు లభించినవి. అవి విదర్భదేశము శాతకర్ణి రాజ్యములోనిదనుటకు ఆధారములు. శాతవాహన రాజ్యారంభకాలము క్రీస్తుపూర్వము మూడవశతాబ్ది ఉత్తరార్ధము అయినచో, పుష్యమిత్ర శాతకర్ణులు సమకాలికులు. లేదా సమీప కాలికులు అగుదురు. అయిన, కాళిదాసు విదర్భదేశమునకు సంబంధించి శాతకర్ణిని పేర్కొనకపోవుటకు హేతువేమి ? పుష్యమిత్రుని కాలమున శాతవాహనులకు విదర్భదేశమునకు సంబంధములేదు. పుష్యమిత్రుని సార్వభౌమాధికారమును సమ్మతించిన యజ్ఞసేన, మాధవసేనులే విదర్భపాలకులు. మౌర్యసామ్రాజ్య పతనానంతరము, విదర్భదేశము యజ్ఞసేనుని ఆధీనమైనట్లు మాళవికాగ్నిమిత్రమునుబట్టి ద్యోతకమగును. శాతకర్ణి I, యజ్ఞసేన మాధవసేనులు సమకాలమున విదర్భదేశమును పాలించుట అసందర్భము.

4. అతిప్రాచీనమైన భారతీయ నాణెములమీద నామావళి లేదు. భారతీయ నాణెములమీద నామావళి అవతరించుటభారతీయ నాణెముల చరిత్రలో అర్వాచీన కాలికము అది స్వతస్సిద్ధమని భారతదేశమును పాలించిన గ్రీకురాజుల నాణెముల ప్రభావమని అభిప్రాయభేదములు కలవు. కాని తన్ముద్రణ విధానక్రమ వికాసమునుబట్టి శాతవాహనుల నాణెములమీది నామావళి భారత గ్రీకు రాజుల నాణెముల ప్రభావమని అంగీకరించక తప్పదు. భారతీయ నాణెముల స్వరూపమును మార్చిన నూతన పరిణామమిది జరిగిన కాలము క్రీస్తుపూర్వము ప్రథమశతాబ్ది కంటె పూర్వము కాదు.

5. శాతకర్ణి I, శాతవాహనుడు రాగినాణెములు, రాగి + తగరము (Potin) నాణెములతోపాటు సీసపు నాణెములు కూడ వెలువరించిరి. సీసము క్రీ. పూ. నాల్గవ శతాబ్దివాడైన కౌటిల్యునికి తెలిసిన మిశ్రము లోహమైనను, నాణెముల నిర్మాణమునకు అదొక లోహముగ ఉపయోగించినది అర్వాచీన కాలమునందే. శాతవాహనులకు, వారి ఇరుగు పొరుగువారిని, వారసులను వదలిన క్రీ. పూ. ప్రథమ శతాబ్దికి చెందిన స్ట్రాటో – II (Strato – II) సీసపునాణెములను వెలువరించిన మొట్టమొదటి రాజు. శాతవాహనుల, ఇక్ష్వాకుల అనంతరము ఉత్తరాపథమునకాని దక్షిణాపథమున కాని సీసపు నాణెములను వెలువరించుట అంతరించినది. నాణెములను నిర్మాణము చేయుటకు సీసమును వాడుట, భారతీయ నాణక శాస్త్రమునుబట్టి ఒక ప్రత్యేక కాలమునకు సంబంధించిన విలక్షణమైన విశేషము. కాబట్టి సీసపు నాణెములను వెలువరించిన తొలి శాతవాహన రాజుల కాలమును క్రీ.పూ. ప్రథమశతాబ్ది కంటె పూర్వము నిర్ణయించుటకు వీలులేదు.

మొత్తముమీద వాఙ్మయ, పురావస్తు సంబంధి సాక్ష్యములను సరిగా ప్రస్తరించి, సమన్వయించి, సంవదించి చూచిన శాత

వాహన రాజ్యారంభకాలము క్రీస్తుపూర్వము ప్రథమ శతాబ్ది మధ్య కాలమునకు సమీపమగుట సంభవము.

ఇదియెల్ల శాతవాహన రాజ్యకాలము క్రీస్తుపూర్వము 31 వ సం. నుండి క్రీ. శ. 231వ సం. వఱకు అను సిద్ధాంతమునకు అనుగుణము.

## అధస్సూచికలు

1 Early History of Deccan, pp 42-47 (1884)

2 B. S. A. J., pp. 3, 4 (1887)

3 a) Andhra History and Coinage (Z. D. M. G.) (1902-3)
b) The early History of India, pp. 218 - 224 (1924)
c) Coins of the ancient India, Vol.1, p. 208.

4 హిందూమహాయుగము, పుటలు 188-90 (1907).

5 ఆంధ్రుల చరిత్రము, పూర్వయుగము, పుటలు 103-55 (1910).

6 బౌద్ధ మహాయుగము, పుటలు 209-226 (1925).

7 సాతవాహన సంచిక, పుటలు 63-68 (1950).

8 ఆంధ్రుల చరిత్ర – సంస్కృతి, పుటలు 70 – 71 (1951).

9 a) తెలుగు విజ్ఞాన సర్వస్వము, మూడవ సంపుటము, పుటలు 91-98 (1959).
b) The Early History of Deccan, pp. 90-108 (1960)

10 ప్రాచీన దక్షిణభారతచరిత్ర, పుటలు 70-71 (1967).

11 Essays presented to Sir Jadunath Sarkar, pp. 232-251 (1973)

12 a) JBORS, Vol. XVI, p. 281
b) సాతవాహన సంచిక, పుటలు 66, 83.

13 తెలుగు విజ్ఞాన సర్వస్వము, 3వ సంపుటము, పు. 91.

14 a) ASWL, Vol. V, p. 60 F, p. 64
b) Ludher's List Nos. 113 - 118; 987, 1001, 1024, 1112.
c) Epigraphia Indica, Vol. VIII. Nasik Inscriptions No. 1-5, 14, 19, 20,24 and 25,
d) Ibid, Vol. XIV, pp. 153-155.
e) Ibid, Vol. XVIII, pp 316-19
f) Burgess - Buddhist Stupas of Amaravat and Jaggayyapeta, Ch. XII, p. 100.
g) Select Inscriptions, pp. 183-205.
h) సాతవాహన సంచిక, అనుబంధము, పుటలు 1-15.
i) Ancient India, No. 16, p. 84 F. N.

15 సాతవాహన సంచిక, పుట. 62.

16 తెలుగు విజ్ఞాన సర్వస్వము, 3వ సంపుటము, పు 97.

17 a) A catalogue of Indian Coins in the British Museum by E. J. Rapson.
b) Coins in the Indian Museum byV A. Smith
c) Coins of the Ancient India, Vol. 1 by V. A. Smith.
d) Coins of the Southern India by W. Elliot.
e) Satavahana Coins in the A. P. Govt. Museum by M. Rama Rao.
f) Coinage of Ancient India by Satyaprakash & Rajendra Singh.
g) Journal of the Bengal Branch of the Royal Asiatic Society (Numismatic supplement)
h) Journal of the Numismatic Society, Vols. I, II, IV, VIII, XIII, XIV, XVI, XXVII, XLVII, XXX V, XXXVI, etc.
i) Coinage of the Satavahanas and coins from Excavations, Ed. by Ajay Mitra Shastri, M. A., Ph. D.,

18 సాతవాహన సంచిక, పుటలు 32, 34.

19 Journal of Numismatic Society, Vol. XXVI, pp. 91 -94.

20 History of the 'Sunga Dynasty', pp. 44-45.

21 Select Inscriptions, pp. 184 - 185.

22 Ibid ,, p. 183.

23 Ibid ,, pp. 186 - 190.

24 Ibid, p. 187, F. N. 2.

25 Select Inscriptions, p. 183, F. N. 1 'Earlier scholars generally placed the early Satavahana kings about the Middle of the 2nd C. B. C. Modernscholars,like Mr R.P. Chanda,(M.A.S.I. No.1)have however proved that the Nanaghat records are to be assigned to a much later date on Palaeographic grounds. Angular forms of some letters (cf. మ of మహా) in the present epigraph prove in my opinion that the record is not earlier than the latter half of the first century B. C.' by Dr. D. C. Sircar.

26 J. N. S. I., Vol. XIV, p. 26.

27 Select Inscriptions, pp. 206 - 13.

28 Ibid, pp 206 - 13.

29 a) సాతవాహన సంచిక, పు. 66.
b) తెలుగు విజ్ఞాన సర్వస్వము, పుటలు 91, 93.

30 Historical Geography and Dynastic History of Orissa, pp. 131 – 32.
31 a) An Early History of Orissa, p. 294.
b) New Aspects of History of Orissa, pp. 11, 12
c) History of 'Sunga Dynasty', pp. 86, 89.
d) A History of India, p. 103.
e) Select Inscriptions, p. 206, F. N. 1.
32 a) A History of India, p. 89.
b) Bimbisara to Asoka, p. 80.
33 a) A History of India, p. 73.
b) Bimbisara to Asoka, p. 79.
అలెగ్జాండర్‌ను సందర్శించిన చంద్రగుప్తుడు (Sandro - cottus) మౌర్యచంద్రగుప్తుడుకాడని, గుప్తచంద్రగుప్తుడని ఒక వితండవాదముకలదు. అలెగ్జాండర్ అనంతరము భారత దేశముపై దండయాత్రకు వచ్చిన సెల్యూకస్ నికటర్ సంధి చేసికొన్న చంద్రగుప్తుడు నందులను (Nandrus) నాశనము చేసినవాడని జస్టిన్ వివరణము కలదు. నంద విరోధియైన చంద్రగుప్తుడు మౌర్య చంద్రగుప్తుడని ప్రసిద్ధము.
34 A History of India, pp. 76, 77.
35 Bimbisara to Asoka, p. 5.
36 Ibid, p. 7.
37 Early History of the Deccan, p. 55.
38 Classical Accounts of India, pp. 301, 304, 305
39 Ibid, F. N. 26.
40 JBORS, Vol. XVIII, Part I, pp. 7–9.
41 Ibid.
42 Select Inscriptions, pp. 118, 119.
43 Classical Accounts of India, p.304,305,F.N.41.
44 Ibid.
45 The Age of Imperial Unity, p. 200, F. N. 1 and p. 179.
46 Classical Accounts of India, p. 283.
47 Select Inscriptions, pp. 196–200.
48 Chronology of Gujarat Historical & Cultural, pp. 53, 54, & 98, 99.
49 Select Inscriptions, pp. 157–166.
50 A Catalogue of the Indian Coins in the British Museum.
51 JBBRAS, Vol. XXII, p. 224.
52 Vikramaditya of Ujjayini, pp. 21, 22.
53 a) Life in ancient India as depicted in the Jaina Cannons, p. 393.
( va. Nir. 1299, Ava. Cu. II, p. 200 F).
b) సాతవాహన సంచిక, అనుబంధము, పుటలు 52, 53.
54 సాతవాహన సంచిక, పు. 55.
55 Select Inscriptions, p. 157, F. N. 1.
56 a) సాతవాహన సంచిక, పు. 87.
b) తెలుగు విజ్ఞాన సర్వస్వము, 3వ సంపు., పు. 95.
57 Select Inscriptions, p. 157, F. N. 1.
58 JBROS, Vol. XVI, pp. 248, 49.
59 Chronology of Gujarat, pp. 98, 99.
60 Ancient India as described by ptolemy, pp. 152, 175.
61 Select Inscriptions, pp. 167–69.
62 Ibid, pp. 169–74.
63 Select Inscriptions, p. 157, F. N. 1.
64 Ibid, p. 189.
65 A History of India, p. 106.
66 సాతవాహన సంచిక, పుటలు 92, 99.
67 తెలుగు విజ్ఞాన సర్వస్వము, 3వ భాగము, పు. 97.
68 a) Epigraphia Indica - Nasik Inscription, No. 5.
b) Select Inscriptions, pp. 194 – 95.
c) సాతవాహన సంచిక, అను., పుటలు 5, 6.
69 సాతవాహన సంచిక, అను., పు. 11.
70 అదే, పు. 14
71 Ancient India, No. 16, p. 84 F. N.
72 a) Select Inscriptions, p. 205.
b) సాతవాహన సంచిక, అను., పు. 14.
73 Select Inscriptions, pp. 253, 54.
74 Ibid, p. 259
75 Ibid, pp. 253 – 340.
76 A History of India, p. 110.
77 శ్రీశైల స్థల పురాణము (ఆంధ్ర శ్రీశైల ఖండము), పుటలు 84–90.
78 a) సాతవాహన సంచిక, పుటలు 61, 62.
b) Journal of the Numismatic Society, Vol. XI, p. 2.
c) The Age of Imperial Unity, p. 198, F.N. 4.
79 భారతి – జూన్, 1978, పుటలు 51–55.
80 Coinage of Satavahanas and Coins from Excavations, pp. 105–108.

# కొత్తకాంతులు సంతరించుకుంటున్న ఆంధ్రప్రదేశ్




ఆంధ్రప్రదేశ్ అపారమైన సహజ సంపదలతో తుల తూగుతూ వుంది.

దేశం నడిబొడ్డున అలరారుతూ ఉత్తర, దక్షిణ ప్రాంతాలకు వారధిగా నిలుస్తున్నది. సహజ సంపదలతోపాటు, ఆధునిక పరిశ్రమలు నెలకొల్పేందుకు అనువైన పరిస్థితులు కూడా అధికంగా వున్నాయి. అందుకే దేశం నలుమూలల నుంచీ పారిశ్రామిక వేత్తలను ఆకర్షించగలుగుతుంది.

ఇప్పుడు మన రాష్ట్రంలో **260** భారీ. మధ్యతరహా పరిశ్రమలు ఉన్నాయి.

వీటి పెట్టుబడి రు. **478** కోట్లు.

ఈ పరిశ్రమల మూలంగా ఆంధ్రప్రదేశ్ స్వరూపమే మారిపోతూంది.

కాకినాడలో రు. **232** కోట్లు ఖర్చుకాగల ఎరువుల కర్మాగారం నిర్మిస్తున్నారు. దీనికి **1978** జూలై **7**న రాష్ట్రపతి శంకుస్థాపన చేశారు.

**1981** నాటికి యీ కర్మాగారం ఉత్పత్తిని ప్రారంభిస్తుంది.

సాలీనా రు. **90** కోట్లు విలువచేసే **4.95** లక్షల టన్నుల యూరియా ఉత్పత్తి చేస్తుంది.

---

*డైరెక్టరు, సమాచార, పౌరసంబంధశాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాద్.*
39/78–79



# ఇంద్రధనుస్సు

## శ్రీ రామగిరి శివకుమారశర్మ

అన్యాయాన్ని, సహిస్తూ
ఆకలిని కడుపులో నింపుకొని,
ఆ భుక్తాయాసానికి, ప్రక్రియగావస్తున్న
ఉరుముల్లాంటి "బ్రేవ్" ధ్వనులు ఇవి

అక్రమాన్ని సహింపక కొందరు
మానవతులు,

ఆత్మాహుతి చేసుకున్న, కొలిమి
ప్రక్కన నిలబడి, రక్తసంబంధీకులు
ఆక్రందనలతో రోదిస్తున్న రొదయే
జుయ్, జుయ్ మని ఈ గాలి రొద
వారి నిట్టూర్పులు కొలిమికి ఢీకొని
భగ్గున మండి మరల మాయమయే మెరుపులు.

ఇక మిగిలిన జీవచ్ఛవాల
కన్నీటి జల్లులోంచి
రేడియం డయల్సు,
ఉంగరాల కాంతి,
నెక్లెస్ రాళ్ళకాంతి,
సూర్యకాంతిలా ప్రసరించి
అమావాస్య చీకటిలోనే
ఆకాశంలో ఓ దిక్కున
పరచుకున్నది
ఏడురంగుల ఇంద్రధనుస్సు

స్వార్థపు, అసంతృప్తిచే
అంతులేని, అంతస్తుల, మూగహృదయాల
మెట్లెక్కుతూ, విశ్రాంతికోసం
సోఫాలో తన లావు శరీరాన్ని పడవేసి
VAT 69 తో గొంతు తడుపుకొన్న వేళలో
వాడిగుండెలో మంట, కళ్ళలో ఎఱ్ఱజీర.
మళ్ళీ ఆరోహించుటకు సంసిద్ధుడయి
ఆ మూగజీవాల, గుండెల మెట్లెక్కుతుంటే
వీరి గుండెల్లో మంట, ఏమీ చేయలేని
కోపంతో, కళ్ళలో మండుతున్న ఎఱ్ఱజీరలు

ఆ ఎఱ్ఱ జీర చూపులెపుడూ
ఒకే పథంపై పడలేదు
కాని, ఇపుడు
ఆ వేడిచూపులన్నీ వాడి చూపులయి
ఒకే పథంపై పరుగులుతీస్తూ
వెలుగురవ్వల్ని చిందిస్తూ,
వాడిబాణంగా రూపంచెంది,
ఆకాశంలోకెగిరి ఆ ఏడురంగుల
ఇంద్రధనుస్సుపై నిల్చిఉంది.

దాన్ని
అన్యాయాన్ని పాలిస్తున్న
ప్రభువులను
స్వార్థపరులను, మట్టుపెట్టే
దృక్పథంతో
విల్లును ఎక్కుపెట్టి
ఆ బాణాన్ని గురిచూసి
వారి గుండెల్లోకి విడుస్తాను నేను.



శ్రీ స్వర్ణరాజ హనుమంతరావు

# తెలుగులో ఏకపాత్ర రూపకాలు

"సాని యీశానియై మహోత్సవమునందు
కేల నవచంద్రకాంతంపు గిన్నెపూని
వీధి భిక్షాటన మొనర్చువేళ జేయు
మరుల నృత్యంబు జగములు మరులుకొలుపు"

అన్నాడు శ్రీనాథుడు తన భీమఖండంలో. ఒకసాని ఈశాని వేషం ధరించి నృత్యంచేసింది. అది ఒకవిధమైన నృత్యపద్ధతి. ఏకపాత్ర ప్రయుక్తమైయుండవచ్చుననిపిస్తుంది యక్షగాన పరిణామపు వివిధ దశల్లో ఒకవ్యక్తి వేషధారణ చేసికొని ఆడిపాడటం ఉంది. కాని అక్కడ కథను స్ఫుటంగా దృశ్యమానం చేయటం మాత్రం ఆ పాత్రధారిపని. భారతీయ నాట్యసంప్రదాయంలో ఉన్న దశవిధ రూపకాల్లో 'భాణ'మనే రూపక ప్రభేదమొకటి ఉంది. ఇది ఏకపాత్ర ప్రయోజ్యము. దీనిలో సంభాషణ ఆకాశభాషణములు ఆధారంగా నడుస్తుంది. వీధికూడ అట్టి రూపక భేదాల్లో ఒకటి. ఇది ఒకపాత్రచేగాని రెండు పాత్రలచేగాని ప్రయుక్తము కావచ్చు. కాని ఈనాడు తెలుగులో ప్రయుక్తమౌతున్న ఏకపాత్రరూపకాలపై సంస్కృతరూపక సంప్రదాయంలోని భాణాదుల ప్రభావం ఉన్నట్లు తోచదు.

ఆంగ్లసాహిత్యంలో డ్రమెటిక్ మోనోలాగ్ (Dramatic Monologue) అని ఒకటి ఉంది. కాని అది కవిత. ఒక రకంగా అది నేతి బీరకాయవంటిది. అది కవితలోని ఒక అభివ్యక్తీకరణ విధానము మాత్రమే. సంభాషణాత్మకమైన నాటకీయ లక్షణం కొంత దానిలో ఉన్నా అది నాటకంతో ప్రత్యక్ష సంబంధం కలది కాదు. డ్రమెటిక్ మోనోలాగ్ ఉద్వేగపూరితమైన లక్షణం కలిగి ఉంటుంది. ఇందులో మాట్లాడుతున్న పాత్ర ఒకటుంటుంది; మాట్లాడక ఉన్న ఇతరపాత్రల యొక్క విక్రియల (Reactions)ను మాట్లాడుతున్న పాత్ర భావోద్వేగంతో వివరిస్తూ ఉంటుంది. రెండవపాత్ర అగాక్కుగా ఉండి ఒక్కపాత్ర మాత్రమే మాట్లాడటంతో ఇది డ్రమెటిక్ మోనోలాగ్ అగుంది. కాని ఈనాడు తెలుగులో ప్రయుక్తమౌతున్న ఏకపాత్రరూపకాలకు దీనికి ఏమీ సంబంధములేదు. పర్యవసానంగా తెలుగునాటకానికి ఇంతో అంతో సంబంధమున్న సంస్కృత ఆంగ్లసాహిత్య సంప్రదాయాల్లో దేని నుండి వచ్చిందికాదు. అలాగే జానపద కళారూపాలైన 'కొరవంజి' మొదలైనపాత్రల ప్రభావము ఈనాటి ఏకపాత్ర రూపకాలపైలేదు. పగటివేషాలని పిలువబడే జాతీయాల (బహురూపు ప్రదర్శించేవి) లోకూడ ఒకే కళాకారు పాల్గొనేపాత్రలున్నా వానిపోలికలు మనకు ఈనాడు ప్రదర్శింపబడుతున్న ఏకపాత్రలలో కనిపించవు. అయితే జాతీయాలకు అనుకృతులుకొన్ని కళాశాలలు పాఠశాలలు మొదలగు చోట్ల విచిత్ర వేషధారణ అనేపేరుతో ప్రదర్శించటం మాత్రం జరిగింది. ఈ వ్యాసంలో తెలుగునాట ఈనాడు విరివిగా ప్రదర్శింపబడుతున్న ఏకపాత్రరూపక పరిణామాన్ని గురించి పరిశీలించటానికి ప్రయత్నం జరుగుతుంది.

తెలుగులో ఏకపాత్ర రూపక రచనను శ్రీ బి టి రాఘవాచార్యులుగారుచేసి1920లో ప్రకటించినట్లు శ్రీ శ్రీనివాసచక్రవర్తి తమ ఆంధ్ర నాటకదర్శిని[1] లో పేర్కొన్నారు.ఆతరువాత1928లో శ్రీ కేతవరపు రామకృష్ణశాస్త్రిగారి రాయచూరు ముట్టడి ఆధారంగా చేసికొని కీ.శే. శ్రీ శ్రీనివాసచక్రవర్తిగారొక ఏకపాత్ర రచనను తామేజేసికొని దాన్ని ప్రదర్శించినట్లు తెలుస్తుంది. ఆయన అప్పుడు నోబులుకళాశాల విద్యార్థి.ఆ రోజుల్లో శ్రీ వెంకోబరావుగారనే ఆంధ్రేతరు లొకరుకొన్ని ముఖ్య స్థలాల్లో షేక్స్పియర్ నాటకాలలోని ప్రసిద్ధ ఘట్టాలను ఒక్కరే అభినయించినట్లు అప్పటి నోబులు కళాశాల విద్యార్థులైన ఈనాటి వృద్ధుల వలన తెలుస్తోంది. [2] బహుశా శ్రీనివాసచక్రవర్తిగారి ప్రదర్శనకు అవి ప్రేరకమైయుండవచ్చును.

ఆ తర్వాత శ్రీ యడవిల్లి సూర్యనారాయణగారు తాము మైలవరం కంపెనీ వారి "ద్రౌపదీ వస్త్రాపహరణం"[3] నాటకంతో కలిపి ప్రదర్శిస్తున్న మక్కపాటి వెంకటరత్నంగారి "ద్రౌపదీ మానసంరక్షణం"లోని 'మయసభ'ను విడదీసి (నాటకం ప్రదర్శించకుండా) ఒకరి సన్మాన సందర్భంగా విడిగా ప్రదర్శించినట్లు తెలుస్తోంది. [4]

ఇది ఇలా ఉండగా కోలాచలం శ్రీనివాసరావుగారి రామరాజ చరిత్రలోని పఠాణీ పాత్రయొక్క ప్రభావము కూడ ఏకపాత్రాభినయాలపై ఉన్నట్లు తోస్తుంది దీనికి కారణం ఆ పాత్రను నటించినప్రసిద్ధనటుడు శ్రీ బళ్లారి రాఘవాచార్లు- ఆ పాత్రకు పెట్టిన ఒరవడి. అందులో తందనాల పాట వాళ్లు రామరాజు యొక్క ఘనతను కథగా చెబుతూ ఉంటే దానిని ఏవగించుకుంటూ పఠాణీగా శ్రీ బళ్లారి రాఘవ చేసేనటన, అలాగే రామరాజు తన తండ్రి అని తెలిసికూడ చంపి, తరువాత పశ్చాత్తాపపడే ఘట్టంలో రాఘవచేసే నటన సమున్నత శిఖరాలనధిరోహించిన కారణాన నటులు అట్టి ఘట్టాల నటన పట్ల బాగా ఆకృష్టులైనట్లు రసజ్ఞుల భావన. రామరాజు చరిత్రలో తందనాల పాటసమయంలో పఠాణీ అభినయం కేవలం వాచిక రహితమైన మూకాభినయం. ఆ పాత్ర ఒక్కముక్కకూడ సంభాషణ చెప్పదు. రామరాజు చరిత్ర

లోనేగాక కోలాచలం శ్రీనివాసరావుగారి ఇతర నాటకాలలోను, ఇంకా ఇతరుల నాటకాలలోను మనకు అక్కడక్కడ స్వగతాలు కనిపిస్తాయి. చక్కపాటివారి ద్రౌపదీ మానసంరక్షణంలోనే దుర్యోధనుడి స్వగతం తరువాత సౌబలుని సంభాషణ 5 కూడ ఒకటుంది. అక్కడ ''సౌబలుడు యోచించుచున్నవాడుగా ప్రవేశించుచున్నా''డని ప్రవేశపెట్టబడ్డాడు.

పైన పేర్కొన్న వానిలోను కొన్ని ఇతరఘట్టములలోను మనకు కనిపించేవి స్వగతాలో లేక స్వగతప్రాయాలో అయినా ఇప్పుడు ప్రయుక్తమౌతున్న ఏకపాత్ర (దీన్ని ఏకపాత్రరూపకం అందాం) కేవలం స్వగతంకాదు. ద్రౌపదీ మానసంరక్షణంలోకూడ పూర్వార్థంలో దుర్యోధనుడు మయ సభా సందర్శన జనితమైన విభ్రమంతో ఒకవిధంగా ''ప్రకాశము''గనే సంభాషణ చెప్పవలసి ఉంటుంది. కాని ఉత్తరార్థం మానసిక సంఘర్షణను వ్యక్తం చేసే స్వగతం. నాటకంలో నటుడు స్వగతమే మాట్లాడినప్పటికి అది చూస్తున్న ప్రేక్షకునికి వినిపించవలసిన అవసరముండటంచేత నాట్య ధర్మంగా పైకి బిగ్గరగా అనవలసివస్తోంది. అందుచేత ఏకపాత్ర రూపకానికి బీజాలు స్వగతాలలోనే కనిపిస్తాయి. అయినా స్వగతం కంటె ఏకపాత్ర ఒకడుగు ముందుకు పోయిన రచన. నేను పైన పేర్కొన్న సౌబలుని సంభాషణలో ఆ లక్షణము నిక్షిప్తమై ఉంది. ఈ ఒక్క సంభాషణతోను శకుని పాత్ర తత్త్వములోని రహస్యము తెలుస్తుంది.

ఈనాడు తెలుగుదేశంలో ప్రదర్శితమౌతున్న ఏకపాత్ర రూపకాలు అంతకంటె శిల్పంలో పరిణతి చెందినట్టివి. ఆ ''పాత్ర''లు చెబుతున్నవి కేవలం స్వగతాలుకాదు. స్వగతం ఎప్పుడు కేవలం ఒక అవస్థలేక మానసిక స్థితిని ప్రదర్శించటానికి మాత్రమే పరిమిత మౌతుంది. ఆ డోలాయమాన మానసిక స్థితిని అనుభవిస్తున్నపాత్ర ఆ స్థితినుండి బయటపడి ఏదోఒకనిర్ణయానికి రావటంతో ఆ అవస్థ ముగుస్తుంది. ద్రౌపదీ మానసంరక్షణంలో దుర్యోధనుని స్వగతం రెండు భాగాలు. మయసభా సందర్శనంలో దుర్యోధనుడు తాను విన్నది ద్రౌపదీ పరిహాసమనుకొని అవమానితుడైనట్లు భావించుకొనటం మొదటి ఘట్టం. రెండవది అవమాన జ్వాలలతో దహింపబడుతూ ప్రతీకారేచ్ఛతో నిర్ణయానికి రావటం! ఈ రెంటికి మధ్య నాటకంలో కొంత వ్యవధి ఉంది. ''ప్రవేశక'' ప్రాయమైన ఒక చిన్న ''స్థలము'' ఉంది. ఆ విధంగా స్వగతంలో ఆ ''స్థితి''కి నాటకీయమైన న్యాయం కలుగగానే ఆ సన్నివేశం ముగియటం జరుగుతుంది.

కాని ఇప్పుడు ప్రదర్శింపబడుతున్న రచన లట్టివి గావు. ఆ పాత్రలోని మౌలికమైన స్వరూప స్వభావాలను ఆవిష్కరించేవిగా ఆ రచనలోని శిల్పముంటుంది. ఇతర పాత్రల తోడ్పాటు లేకనే ఆ పాత్రే తన వ్యక్తిత్వాన్ని, గత చరిత్రను, వర్తమాన స్థితిలో తా నెదుర్కొనవలసిన నాటకీయ సంఘర్షణను, భవిష్యములో తాను అనుసరింపదలచిన విధానాన్ని ఏదోవిధంగా ప్రకటింపదలుస్తుంది. ఏకపాత్ర రూపక నిర్మాణం కొంత క్లిష్టమైంది. దానికి చాల పరిమితులున్నాయి. తెర తొలగి పాత్ర రంగం పైకివస్తే, పాత్రను ప్రదర్శించే పదిహేను ఇరవై నిమిషాల కాలంలో తన మూర్తిని రూపుకట్టుకొనేటట్లు చూపించి ప్రేక్షక హృదయ ఫలకాలపై చెరగిపోని ముద్ర వేసేటట్లు తన పాత్రను ప్రదర్శించుకోవాలి. సంభాషణ రూపంలో మరొకరు సహాయం చేయరు. దీపాలు ఆరటం వెలగటంవంటి సూచనలద్వారా కాలాంతర స్థలాంతరాలను సూచించటం అభిలషణీయంకాదు. ఇందులో ఒక్కసారే పాత్ర ప్రవేశ నిష్క్రమణములు—ఈ రెంటిమధ్యలోనే ప్రక్రియ పూర్తి అవుతుంది గనుక స్థలాంతరాన్ని రచయిత సూచించటానికి కూడ వీలు కుదరదు. ఉండేనాటకీయత అంతా ఒక్క సంభాషణ వలననే రూపొందించబడాలి. నాలుగు పాత్రలు—ఒక్కొక్కటి ఒకటికంటె ఎక్కువసార్లు వేరు వేరు భావస్థితులలో ప్రవేశించి వేరు వేరు భావస్థితులలో నిష్క్రమించేటప్పుడు కలిగే ఆనందము, వైవిధ్యము ప్రేక్షకునికి ఇందులో కలిగే సావకాశములేదు. అయినా ఏకపాత్ర రూపకం ఇప్పటికి తెలుగునాట ఒక రూపాన్ని సంతరించుకొని నిలిచిందని చెప్పవచ్చు. లక్షణ వివేచనమాత్రం జరుగవలసి ఉంది. అంతే!

ఒక ముఖ్యమైన విశేషమేమంటే—పాత్ర ఎన్నికలోనే ఇతివృత్తం కూడ ఇమిడి ఉంటుంది. ఆ విధమైన ఎంపికలో ధీరోదాత్త పాత్రలకంటె ధీరోద్ధత పాత్రలే ముందుకు దూకినవి. రావణుడు, దుర్యోధనుడు, కంసుడు వంటి ప్రతినాయకులకు అధిక ప్రాముఖ్యము పొందినట్లనిపిస్తుంది. అహంకారము చూపి అట్టహాసముచేసే పాత్రలు తొందరగా ముందువరసలో నిలబడుతున్నవి. కీచకవధా ఘట్టములో ఏకపాత్ర కీచకపాత్ర రాణించినట్లు భీముని పాత్ర రాణించదు- దుర్యోధనుడు ఆకర్షించినట్లు ధర్మరాజు ఆకర్షించడు.

వీనిలో శృంగార హాస్య కరుణ శాంతములకంటె వీర రౌద్ర భయానక బీభత్స రసాలకు ప్రాముఖ్య మీయబడి రచనలు సాగుతున్నట్లు అవి నటుల్ని ప్రేక్షకుల్ని ఆకర్షిస్తున్నట్లు అనిపిస్తుంది. ఉత్తమ పాత్రలై ఉండి విధివశమున తమ ఔన్నత్యం లోకంచేత గుర్తింపబడని పాత్రలు తమ తరఫున వాదించుకోటానికి తామై బయటపడినట్లు ఈ ''పాత్రలు'' కనిపిస్తూ ఉంటవి. కర్ణుడు, చిత్రాంగి మున్నగునవి ఇట్టివి. కర్ణుడు శాపగ్రస్తుడు! చిత్రాంగి విధి వంచిత! అభిమన్యుడు, బాలచంద్రుడు అభాగ్యులు! అశ్వత్థామ విధిచేతి కీలుబొమ్మ!

వీనిలో పురాణాలలోని ప్రసిద్ధులేగాక అల్లూరి సీతారామరాజు వంటిచారిత్రక పాత్రలు, యుగంధరునివంటి చారిత్రక నాటకాలలోని కల్పిత పాత్రలు ఉన్నాయి. ఎప్పుడెప్పుడు వీని ప్రదర్శన ప్రారంభమైందో చెప్పలేము గాని ప్రసిద్ధ నాటకాలలోని ప్రసిద్ధ పాత్రలలో చిత్ర నళీయంలోని బాహుకుడు, హరిశ్చంద్రలోని కాటికాపరి దృశ్యములోని వీరబాహుడు, చెఱసాలలోని రామదాసు, కన్యా

శుల్కంలో గిరీశం మొదలైన పాత్రలు ఆయా నాటక రచయితల చేత ఉద్దేశింపబడకపోయినా నటులచేత ప్రదర్శింపబడుతున్నవి. చిత్ర నళీయంలోని బాహుకునితో చతుర్థాంక అష్టమరంగంలో జీవ లుడు అనే పాత్ర నిమిత్తమాత్రంగా ఉంటుంది కాని ఒక్క బాహుకునిదే ఘట్టమంతా! ఆమాత్రం కూడ మరో పాత్ర ప్రవేశ మక్కరలేని ఘట్టము పంచమాంక తృతీయరంగంలో జాబు చదువు కొనే ఘట్టం. ఒక్క సంభాషణ కూడ మార్చనక్కరలేకనే ఏక పాత్రగా మలచటానికి వీలున్న ఘట్టమొకటి విక్రమోర్వశీయ ములో ఉంది. సంస్కృతంలోని ప్రసిద్ధ నాటకాల్లో విక్రమోర్వ శీయ మొకటి. ఇందులో చతుర్థాంకంలో కుమారవనంలో అడుగు పెట్టి ఊర్వశి అడవిలోని తీగెలలో ఒక తీగెగా మారిపోవటంతో విక్రముడు ప్రియావియోగమున కలిగిన ఉన్మాదస్థితిలో అరణ్యమున గ్రుమ్మరిన ఘట్టములో మయూర పిక మరాళ రథాంగ మధుకర కరి గిరి సరిత్కురంగముల నుద్దేశించి అతడు చేసిన ప్రసంగమంతా స్వగతముకాదు. నాటకీయమైన చక్కని సన్నివేశము. ఒక నటుడు తన శక్తికొలది నటింప సావకాశమున్న చక్కని ఘట్టము.

ఏకపాత్ర రూపకాల విషయమై పూనికతో ఒక నిర్దుష్టమైన ప్రయత్నంచేసి ఒక వ్యుత్పన్నతతో కూడిన రూపాన్ని యిచ్చిన ఘనత శ్రీ పెమ్మరాజు వేణుగోపాలకృష్ణమూర్తిగారికి దక్కుతుంది. 'పది ఏకపాత్రాభినయ నాటికలు' అనే పేరుతో తొలిసారిగ 1962లో రెండు స్త్రీ పాత్రలతోసహా పది ఏకపాత్రలను ఒక సంపుటిగా వెలువరించారు వారు. శ్రీ పెమ్మరాజువారు నాటక రచనలో కూడ సిద్ధహస్తులు గనుక వారు రూపొందించిన పాత్రలు కూడ నిండుజీవంతో నిలబడ్డవి. ''మాతృచరణ సన్నిధిలో...'' అనే పేరుగల శ్రీ జమదగ్ని శర్మగారు చేసిన ''ఏకపాత్రాభినయ రూపకం'' ఉదాత్తమైన రచనకు మచ్చుతునక. ఇందులోని పాత్ర వివేకానందుడు. విషయం జగన్మాతృ దర్శన దివ్యానుభూతి. రసము శాంతము. శ్రీ నండూరి రామకృష్ణమాచార్య తమ దశరూపక సంపుటిలో ప్రకటించిన 'బ్రహ్మనాయని స్వగతము' కూడ చక్కని ఏకపాత్ర రూపకమే. రచయిత 'స్వగతం' అన్నప్పటికీ ఆ రచన ఉత్తరభాగంలో బ్రహ్మనాయుడు కొమ్మరాజు మలి రాజాదుల చిత్రపటాలనుద్దేశించి చేసిన సంభాషణ ఆ పాత్ర రూపొందటానికి తగిన నాటకీయతను తెచ్చిపెట్టింది. ఆధునిక నాటక రచయితల్లో విశిష్టస్థానాన్ని సంపాదించిన శ్రీ కొర్రపాటి గంగాధరరావుగారు చక్కని భాషాపాటవంతో విశిష్టమైన శైలిలో,చక్కని నాటకీయత వైవిధ్యము చూపిస్తూ రెండు సంపుటాలలో ఏకపాత్రలను వెలువరించారు.

ఈ ప్రక్రియా రచనలో ఇంకా పేర్కొనవలసినవారు సర్వశ్రీ సోంపల్లి బాపయ్య, తిపిర్నేని అప్పారావు, రంగకవి, నాగశ్రీ మున్నగు వారు. ఒకే సంపుటిలో రసవైవిధ్యాన్ని కూడ కూర్చ ప్రయత్నించిన వారు శ్రీ కొడాలి గోపాలరావు. వారి సంపుటిపేరు ఏకపాత్రాభినయ నవరస మాలిక. శాతవాహనుల కాలంనాటి పాత్రలు, చరిత్ర ఆధారంగా విజయవాడలోని ఒక సాంస్కృతిక సంస్థ 'శాంతిశ్రీ' అనే ఏకపాత్రరూపక సంపుటిని ప్రచురించింది. అందులో ఉత్తమరచనా పురస్కృతి నందిన పాత్ర ''గుణాఢ్యుడు'' రచయిత స్వర్ణరాజ హనుమంతరావు. ఆంగ్లములోని 'డాక్టరు ఫాస్టసు' నాటకం ఆధారంగా డాక్టరు ఫాస్టసు ఎదుర్కొన్న చరమరాత్రి తెలుగులో ఏక పాత్రగా రూపొందించబడింది. అశోకునిలో గలిగిన పశ్చాత్తాప సన్నివేశం ఆధారంగా 'అశోకుని ఆత్మవిచారము' అనే రచన చేసినవారు శ్రీ కప్పగంతుల మల్లికార్జునరావుగారు. కృష్ణ నిర్యాణానంతరము అర్జునిని ఖేదాన్ని ఉదాత్తంగా చిత్రించారు శ్రీ జి. ధర్మేశ్వరరావు గారు. శ్రీ బండారు రామస్వామి, శ్రీ బి. వి. యస్. శాస్త్రి, శ్రీ ఈమని శ్రీరామబ్రహ్మచారిగారలు ఈ ప్రక్రియలో కొన్ని విలువైన రచనలు చేశారు. సోమంచి యజ్ఞన్నశాస్త్రిగారి 'సంఘం కోసం చందాలు'—చందాలవసూళ్ల విషయమై పడేబాధల్ని చిత్రించే వ్యంగ్య రచన. సమాజంలో ఒక తరగతికి ప్రాతినిధ్యము వహించే పాత్రలైన బిచ్చగాడు, సిపాయివంటి పాత్రలుకూడ ఇందులో ఉన్నవి. పి. సూర్యారావుగారి ''కళాజీవి'', జాస్తి వెంకటనరసయ్య గారి ''ఉపాధ్యాయుడు'' కూడ ఈ కోవకు చెందుతవి. యుగంధరుడు, రక్తకన్నీరులోని గోపాలంవంటి పాత్రల్ని యువనటులు పెద్ద నటుల నటనపట్ల ఆకృష్టులై కూడ నటించటానికి పూనుకున్నారు. బాలనాగమ్మలోని 'మాయలఫకీరు' కూడ ఏకపాత్రగా అక్కడక్కడా అట్టహాసం చేశాడు. ఇటీవల వచ్చిన పాత్రల్లో 'తెలుగు మాష్టారు' ఒకడు. ఇవన్నీ కలసి సంఖ్యలో సుమారు వందకుమించి ఉంటాయి. వీని వివరాలు ఇంకా సేకరించి సాకల్యంగా పరిశీలింపవలసి ఉంది. ఈ ప్రక్రియ ఆంధ్రదేశంలో బహుళ ప్రచారం పొందటానికి పరోక్షంగా కారణభూతులైన వారిలో డాక్టరు చంద్రశేఖరంగారిని, రావి వెంకటచలం సోదరులను చెప్ప వలసి ఉంది. సౌకృత్రాలు అనే ఒక ప్రక్రియా ఉంది. అక్కడ కూడ పాత్ర ఒక్కటేకాని శ్రవ్య కళారూపం. అందుచేత అట్టి రచనలు ఈ వ్యాస పరిధిలోకి రావు.

ముగింపుగా ఒకమాట చెప్పవలసి ఉంది. ద్రౌపదీ మాన సంరక్షణంలోని దుర్యోధన పాత్ర నాటకం వ్రాసినప్పుడు ఏకపాత్రగా ఉద్దేశింపబడలేదు. అయినా నాటికీ నేటికీ తెలుగు రంగస్థలంపైన స్వైర విహారం చేసి తెలుగులో ఏకపాత్రలకు ఒరవడి దిద్దింది. అంతకుముందు ఒకటి రెండు పాత్రలు ప్రదర్శన పొందినా ఈ ప్రక్రియ ప్రేరణ కలిగించింది దుర్యోధనపాత్రే. అది ఎన్ని వందల ప్రదర్శనలు పొందిందో చెప్పలేము. సుమారు అరగంటకు పైగా ప్రేక్షకుల్ని ఉఱ్ఱూతలూపించే ఆ 'రచనా చమత్కారము' మంచినటుల చేతిలో అద్వితీయంగా రాణిస్తోంది.

మరొక్కమాట. ఆంధ్రదేశంలో ప్రతి గ్రామపట్టణాలలో జరుగుతున్న పోటీలలోను, సాంస్కృతిక కార్యక్రమాలలోను ఏక పాత్రాభినయ ప్రదర్శన చోటు చేసుకుంటోంది. ఇప్పటికి దానికి వ్యవహారంలో ఉన్న పేరు 'ఏకపాత్రాభినయ ప్రదర్శనం'. పెమ్మ

( మిగతా 37వ పేజీలో )

శ్రీ పిరాట్ల శివరామకృష్ణమూర్తి

# గిరిజన భాషా మాండలికం-2

ఏప్రిల్ '78 'భారతి' లో కొన్ని విశేషాలు విన్నవించాను.
ఇపుడు తూర్పు గోదావరి జిల్లాలోవే మరికొన్ని ప్రత్యేకతలు.

## పద నిర్మాణం

సుండెలు=పెదవులు; సుండేవిల్లు=వెదురు బద్దతో తయారు చేసిన హార్మోనియం వంటి వాద్యం. దీనికి సన్నని తీగ, లాగేందుకు చివర కుచ్చు ఉంటాయి. ఈ వెదురు బద్దను పెదవుల మధ్య నుంచి తీగ లాగుతారు. ఆ పీడనకు మధ్యలో చీలిన నాలుక ప్రకంపించి నోటిలో ప్రతిధ్వనిస్తుంది. నోటిలో ప్రతిధ్వనించకుంటే ఆ కొద్ది ధ్వనిని గుర్తించలేం. వివిధ గతులలో యీ సుండేవిల్లు వాదనం జరుగుతుంది.

చేవడి బస=అడవిలో వేటాడిన పిట్టలను, గబ్బిలాలను, నేదులను కాల్చి ఉప్పుకారం వగైరా కూరి కల్లులో నంజుకుంటారు. ఈ స్థలం చేవడి బస. మన వ్యవహారంలో కూడా 'చావడి' (గ్రామ చావడి)ఉన్నది. ఒకవేళ ఒకనాడు కల్లుపోసేచోటుకు పరిమితమైన చావడి, అర్థవిస్తారం పొంది మన వ్యవహారంలో ఉన్నదా. చేవడు = కల్లు అమ్మేవాడు.

వరసకల్లు=ప్రతిరోజు తెచ్చే కల్లు, అమ్మకపుకల్లు, వాడుక కల్లు. (1) పోతు కల్లు (2) నాము కల్లు (3) పండు కల్లు (4) ఎడకల్లు - ఇవన్నీ కల్లులో రకాలు.

నగరి బస — గ్రామంలో పండుగలకు - గొట్టుబాసకుకూడే విశాలమైన స్థలం. రాజుల పండుగకు కొండకు వెళ్ళి వచ్చినవారు 'నగరిబసకు వచ్చి ఉపవాసం తీరుస్తారు.'

నగరికి వెళ్ళేటప్పుడు నాగుబాము నట్టునలు' (ఆటవిక గీతం) దొప్పసేసలు= సేసలు అంటే మనకు అక్షింతలు — అంటే బియ్యమే కదా. దొప్పసేసలు అంటే దొప్పలో సమర్పించిన అన్నం (నైవేద్యం)

''దొడ్డైన అమ్మవారికి దొప్పసేసలు సెల్సివా లేవో'' (కొండరెడ్ల పండుగ పదం) ఓరెము=నైవేద్యము, ఓరెపుకుండలు భరణిశాల=అమ్మవారి నెలవు. కన్నెజీలుగు=బదనిక. గోనెఎడ్లు= గోనెలలో సామగ్రి మోసే ఎడ్లు.

సురుబు=జీవం (నోరులేని సురుబు), సురుబు దేవత.

విసక్ర=కేలంక్రకు విశాఖ మాండలికం.

ఎలుగు చుట్టడు=ఎలుగు బంటి దెబ్బతిన్నవాడు.

అల్లరి బొక్కు=అల్లరిచేసి తిను బండారాలు హస్తగతం చేసుకునేవాడు.

గ్రామనామాలు కూడా పద నిర్మాణ ప్రతిభకు తార్కాణాలు.

'అద్దరివలస'(ఆ+దరి వలస). 'నెత్తపులంక' (నెత్తము—కొండ చరియ). 'పులిమందలు', 'పోలమాను గొంది', 'చాపరాయి', 'బూసులకొండ'=(బూసిచెట్లు ఎక్కువగా ఉన్న కొండ) 'అడ్డ తీగల', 'కొండ మొదలు'=(పాపి కొండల మొదలు), రాయిదోలు కొండ=అక్కడ రాతిని పేల్చి గులకగా కొడుతున్నారు.

ఆకుమామిడి కోట, తియ్యమామిడి గండి, గుర మామిడి, పులుసుమామిడి, ఇలా మామిడి పేరిట లెక్కలేనన్ని గ్రామనామాలు. కొండవారికి మామిడి ముఖ్యాధారమైన మధురఫలం. కానితొక్కకు టెంకకు ఎడంలేని కొండ మామిడి ఇది. వేసవికాలపు వేకువవేళల్లో రాలిన యీ పండ్లకోసం ఎలుగు మనుషులు దాగుడుమూత లాడుతూంటారు టెంకెలను నానవేసి జీడిలో దురదపోగొట్టి రొట్టెగా వేసుకు తింటారు వర్షాకాలంలో.

భూపతిపాలెం — తెలుగు పేర్ల మధ్య ఈ సంస్కృత గ్రామనామం చారిత్రక సమాచారం కొంత ఇస్తున్నది. పురుషోత్తమ పట్నంవద్ద రామగిరి దుర్గం నుండి ఈ ప్రాంతాలను పాలించిన ఇమ్మడి దేవచోడుడు ఇచ్చిన అగ్రహారమట ఇది.

రంప చోడవరం — ఆ చోడుని పేరిటిదే ఈ గ్రామం. ఈ విషయాలు శ్రీ గుండు విఘ్నేశ్వర శాస్త్రిగారు చెప్పారు.

రెడ్లలో, వాల్మీకులలో సంస్కృత నామధేయాలు—సుమారు వంద యేండ్ల క్రితం ఈ ప్రాంతాన్ని నెలవు చేసికొన్న యోగి రామ శరణ్ బావా ప్రభావంవల్ల వచ్చినవేమో. గంగాధర వీరభూపతిరెడ్డి — వరేంద్రం — యోగేంద్రం మొ॥

సాధారణంగా గిరిజనుల పేర్లు ఇవి — సామయ్య, పండన్న, పొట్టమ్మి, సంకురు, క్రిదొర — బొర్రంరెడ్డి ఎట్టిడు

ఇండ్లపేర్లు—సిండెల, వలల, కడబాల, మర్ల, కుర, కుండ్ల, సూర్రెలు, తీగల సుంకరి (పన్ను వసూలుచేసే కొండ్ల గాని ఇంటి పేరు)

పుల్లంగి - వాతంగి, జడ్డంగి ఇటువంటి గ్రామ నామాల్లో అంగి, అంగడియొక్క అవశిష్టమా.

ఎర్రమెట్ట – (రంప చోడవరం తాలూకా) ఒకనాడు శిశు బలికి పేరుమోసినదీ గ్రామం. అందువలన వచ్చినదేమో ఈ పేరు ఎర్ర (రక్తపు) మెట్ట.

మొండివాని లంక – ఇపుడు మండువా లంక అంటున్నారు. ఎవడన్నా చెప్పినమాట వినకుంటే మండువా లంకలో దించుతా ననడం సీమగండి (రంప చోడవరం తాలూకా) మీద వ్యవహారం. ఆ లంక వెదురు పొదలతో కాకులుదూరని కారడవిలా ఉంటుంది. ఆ దృశ్యం చూడవలసినది.

గుమ్మళ్ళదొడ్డి = పెద్ద పెద్ద కొండల శిఖరభాగ పార్శ్వంలో తరుము ఉంటుంది. ఎల్లవరం తాలూకాలో కాటమరాజు కొండకు ఈ తరుము ఉన్నది. దూరం నుండి ఈ తరుమునుచూస్తే ఊహ మనోహరమైన కాల్పనిక భావుకతలో మనసు లీనమవుతుంది. ఆ తరుమును గుమ్మళ్ళ దొడ్డిగా భావించారు గిరిజనులు.

గుమ్మడి = ఒకనడుము నొకరు గొలుసుగా పట్టుకొని ఔజం దరువుకు అనువుగా ముందు వెనుకలకు కదులుతూ యువతులుచేసే నృత్యపంక్తి. దానిలా ఉన్నదని గిరిజనుని భావన. ఆ గుమ్మళ్ళు ఆ కొండమీద అలా శాశ్వతంగా ఎందుకు నిలిచిపోయారో చెప్పేగాథ కూడా (myth) గిరిజనుల సంప్రదాయంలో ఉన్నది. అయోధ్య రాజు కూతురును ఐదల రాజు (ఐదల చెరువు సమీపంలో ఉన్నది.) ఇచ్చి పెండ్లి చేయడానికి పెళ్ళివారు తరలి వస్తున్నారట. వారు కాటమరాజు కొండమీదికి వచ్చేసరికి కోడికూసింది. వారుబొమ్మలై పోయారు. (నిజంగా అవి బొమ్మలేమోనని అంత పెద్ద కొండ మీదికి ఫోటోకోసం బయలుదేరాను). ఆ తరుము వరుసలో ఒక విశాలమైన గుహ ఉన్నది. ఇటువంటి గుహలు చాలా పెద్దవి ఈ కొండల్లో చాలాచోట్ల కనిపిస్తాయి.

చేనుపాక = చేలో ఉండడానికి వేసుకున్న పాక.

చేటపాక = తాత్కాలికంగా తడిక నీడన వేసుకున్న పాక.

నిద్రబడ్డి = మంచం మీద రాత్రి పడుకోడానికి కప్పు కూడా వేసుకుండే నిద్రబడ్డి.

## నూతన పదాలు -

ఓరిము – అమ్మవారికి నైవేద్యం ఓరెం, ఓరెపు కుండలు.

పూజారులకు పూజానిర్వహణంలోసహాయపడేవారు లంకెలు.

జాలెలు = రక్త తాళ్ళు, పదిరి = సత్యం, ఆచారం, సత మానం = తాళి (వాల్మీకుల వాడుక) జల్ది = జలధికి వికృతి, కాలువ. అజ్జ = అడుగు, బగిడ = గబ్బిలం, పిడెం = వెదురుపొద, మిడుకు = మట, కరుక్కున = చివరవరకు, తాప = జీలుగు చెట్టుకు పలవలతో కూడిన వెదురు నొకదాన్ని అన్చి ఎక్కుతారు అది తాప.

బొజ్జ = అడ్డు ఆకులతో బుంగలా తయారుచేసిన బుట్ట, జడ్డ = కొమ్మ, బోద = గుండ్రాయి, గొగ్గెం = కొక్కెం, చీడి = పురుగు, నేదు = గిడస పంది, దారబొప్పి=కణుజు, పేడబొప్పి=కారు గేదె, అలమబండ = కొండముచ్చు, తోడేలు = గొర్నపోతు.

మోర్థ = పందికొక్కు, ఇది కోయపదం ఎవడినన్నా వెక్కి రించడానికి తెలుగు గిరిజనులు వాడతారు.

కాకమ్మ = అమ్మమ్మ, ఇది కోయపదం. కాకమ్మ కథలు చెప్పకు అంటే అమ్మమ్మ కథలు చెప్పకు అని తాత్పర్యం అంటూ కోయ భాష గూర్చి పరిశోధిస్తున్న శ్రీ కె. రామారావు చెప్పారు.

మునివాడు = మంచివాడు. వాడు వెజ్జు (మంత్రతంత్రాలు) చేస్తాడా అని అడిగితే అటువంటిది లేదండి వాడు మునివాడు అని సమాధానమిచ్చారు.

కోలలు తినడం = పండుగనాడు ఉపవసించినవారు అమ్మ వారికి మొక్కి పూజారిచేత (దబ్బ) వరిగడ్డితోనేసిన కొత్తకోలతో దెబ్బలు తింటారు. ఆ దెబ్బలకు ప్రక్కనున్న వారు పసుపు రాస్తారు.

## క్రియా పదాలు

నెత్తి దూసుకోడం = ఇలా తెలంగాణాలో కూడా వాడుక.

త్రొర బెట్టడం = కుక్కడం, గిడిసికోవడం = పడిపోవడం

పనువుట = చీడిలు పనువుతున్నవి – కుట్టుట.

సొరుగుట = నిలచుట.

ఈడబోవడం = దిగబెట్టడం

జల్లివేయడం = పారవేయడం, మోయుట–తీసికొనివెళ్ళుట.

## సామెతలు

1 ఆడపిల్ల – అడ్డగింజ

ప్రేలడం ద్వారా బీజవ్యాప్తి–అడ్డతీగ ఉదాహరణ.

ఆడపిల్ల కూడా అంతే వయసు వచ్చాక ప్రాప్తమున్నచోటికి పోతుంది.

2 కుక్కబుద్ధి – కూతురు బుద్ధి

ఎంత తిన్నా కుక్క ఇంకా ఆశపడుతూనే ఉంటుంది. పైగా ఒకచోట తిని ఒకచోట కావలి చేస్తుంది. కూతురు అంతే.

3 ఉమ్మడి దొరలు ఊరికి నష్టం. ఇద్దరు పెళ్ళాలు ఇంటికి నష్టం.

(మిగతా 37వ పేజీలో)

# కాళిదాస ప్రశస్తి

## శ్రీ సురగాలి తిమోతి జ్ఞానానందము

౧

ఘన వాల్మీకి ఋషీంద్రు సత్కవితకున్ గాంగేయపుష్పాభిషే
చన మొనర్చిన సుప్రసిద్ధ కవిరాజా ! కాళిదాసా! జగ
జ్జననీ దివ్యకటాక్ష వీక్షణలచే సాధించినావయ్య చ
క్కని కైతన్ విబుధుల్ ప్రశంసలిడ నెక్కాలమ్ము విశ్వంభరన్

౨

అందమ్ముల్ గుబిపించు నీ రచన లయ్యాకాశ గంగమ్మతో
విందుల్ గూర్చును నీ మనోహర కళావిన్యాస సంభారపున్
మందాక్రాంతము నిశ్చయమ్ముగ నమందానందమై సాహితీ
బంధుల్ గుండెలనావరించినది నీ వైశద్యమేలాటిదో ?

౩

పడమటి ఖండవాసులు నివాళుల నెత్తిరి నీదుకావ్యపున్
జడనిధి నీది నీదియొక శైలి మరేరికి రానియట్టిదీ
గడుసరి వ్రాత లిప్పటికిగాక మరెప్పటికైన కాళిదా
సుడు కవితా ప్రభాసుడను సూక్తి యథార్థముగాగ నిల్చెడిన్

౪

నీ రమణీయ కావ్యమగు 'నీరదవార్తను' విప్రలంభ శృం
గారముచేత నింపిన యఖండుడవీవు మనోజ్ఞభావనా
ధీరుడవీవు శబ్దసమధీతుడవీవు వచింప నీకునె
వ్వారిటసాటి నీయమృతవాణికి గొమ్మివె మత్ప్రణామముల్

౫

విచుళుడు నీకు స్నేహితుడు నీ కవితా లలనాభిమాని ! సం
కుచిత గుణాలు లేని బుధకోవిదుడాతడు నీకు సాయమై
అచలమువోలె నిల్చిన మహాశయుడాతని తర్కవాదపున్
ప్రచురత నీకు గెల్పులను వాదము తథ్యమొకో? కవీంద్రప్రభూ!

౬

తనిసెన్ మిక్కిలి యార్ష భారతము ప్రోవ్యర్థిల నీవాడ బా
రనిమేల్ కైతలలో వెలుంగు నుపలంకార చాతుర్యముల్
ఘనవైదుష్యపు సన్మనోజ్ఞ కవితాగంధమ్ము పీల్చావు బా
కీన చందమ్మును గాంచి యీ జగతి బాకీపడ్డదోయీ కవీ !

౭

రామగిరినుండి యలకాపురమ్ముదాక
విరహ తాపాగ్ని కీలల నెరియుచున్న
యక్షుని కథా విధానమ్ము నమరభాష
సృష్టి సలిపిన నీకు జేజేలు సుకవి

౮

నిలిపెనా నీ జిహ్వ కళికపై మధురమౌ
కమనీయ వాక్యాలు కాళికాంబ
పిలిచెనా నిను సభాస్థలికి గౌరవముతో
ముదమారగా మహా భోజరాజు
కొలిచెనా నీ సుధోక్తులు మెచ్చి సత్కళా
పాథోధి యగు మల్లినాథసూరి
మలచెనా నిను మహోజ్జ్వల దివ్యమూర్తిగా
నినునమ్మికొన్నట్టి యనుగుపడతి

ఈవు సల్పినట్టి యీ మహోన్నత కావ్య
నాటకాల బీజపాటవమ్ము
సందడించినది దిశాభిత్తి వలయాన
క్రమ్మి కాళిదాస ! కవి విభాస !

౯

శ్రుతిహితశబ్ద సుందరత సొంపులు నింపెడు వర్ణనా చమ
త్కృతి పసగల్గు కూర్పు రస దిగ్ధ మనోహర నవ్యకల్పనా
కృతిరహియించు నీకవిత యిట్టిది యంచెవ డూహసేయు మా
మతుకు దోచినట్టిదె ప్రమాణము? నీకు జోహారులయ్యెడిన్

౧౦

ప్రకృతి వర్ణన సేసెడు పట్టులందు
నొక్కడునులేడు నీవలె నూహసేయు
వర కవీంద్రులయందు నీ పథమెవేఱు ?
కారణము కాళి నీదు నాల్కను స్పృశించె

౧౧

బుతమొనర్చెను పరభృతములు హాయిగా
విహరించి యామని వేళలందు
అరయ జగాజిల్గు లమరె సంబరమొప్ప
శరదిందు కిరణాల చల్లదనము
తిరుగాడె "శిప్రా" నదీ తీరభూముల
తోరాన మలయ సమీరకుండు
తనువు పొంగించె వింధ్యాటవీ ప్రాంతాన
నలరారు సుమనోజ్ఞమైన ప్రకృతి
ఒడలు పులకరించె నూర్యశీలావణ్య
మ్మోయి కాళిదాస నీ యఖండ
కావ్యజగతిలోన కాలువెట్టిన యెడ
కవివి యనగ నీవె కవివి నిజము

౧౨

దయతో భోజుడు నిన్ను బిల్చి సముదాత్తంబైన నీ కైతకున్
ప్రియమారందగు గౌరవాలొసగి కల్పించెన్ సుఖశ్రేణి యు
జ్జయినీ భూములు నీ కవిత్వ సుషమా సందేశమున్ వించు న
వ్యయ మ్మోదమ్మును నాడు పొందినవి నేడానందముం
బొందెడిన్.

---

# తెలుగులో ఏకపాత్ర రూపకాలు

( 33వ పేజీ తరువాయి )

రాజు వారు ఏకపాత్రాభినయ నాటికలు అన్నారు. శ్రీ జమదగ్ని శర్మగారు 'ఏకపాత్రాభినయరూపకం' అన్నారు. 'ఏకపాత్ర రూపకం' అంటే చాలనిపిస్తుంది.

## అధోజ్ఞాపికలు

1 చూ. పుట 591

2 శ్రీ వెంకోబరావుగారి వలె తరువాత ఆంగ్లనాటకాలలోని ముఖ్యఘట్టాలను శ్రీ రావి వెంకటచలంసోదరులు విస్తృతంగా ప్రదర్శించారు.

3 దీని రచయిత మల్లాది అచ్యుతరామశాస్త్రిగారు.

4 ఈ విషయాన్ని శ్రీనివాసచక్రవర్తిగారు చెప్పారు.

5 పుట 31. తృతీయ ముద్రణ.

6 దీనికే నక్షత్రమాల పద్యాల ఘట్టమని పేరు. దీన్ని ప్రసిద్ధ నటులు శ్రీ బందా కనకలింగేశ్వరరావుగారు ప్రదర్శిస్తూ ఉండేవారు. జీవలుడు ఒక్క సంభాషణ చెప్పి నిద్రిస్తాడు. పద్యాలన్నీ చదవటం అయిపోయిన తరువాత లేస్తాడు. దీన్ని వారు ఏకపాత్రగా ప్రదర్శింపలేదుగాని ఆ విధంగా ఏకపాత్ర చేయుటానికి అనువైన భాగమే.

---

# గిరిజన భాషా మాండలికం-2

( 35వ పేజీ తరువాయి )

మద్యం మరిగిన మనిషి — మాంసల్ని మరిగిన కుక్క (వదలి పోలేరు)

4 "ములుగు — చేప పాములకు గరి (తల) చూపిస్తది. చేపలకు తోక చూపిస్తుంది." అలా తప్పించుకుంటుందన్న మాట.

5 సొదలేవి సోమడి పెళ్ళికి మక్కల వాయిద్యం.

6 కల్లుకిచ్చినట్లు చల్లకివ్వరు — కల్లు చేరిన వాడిల్లు చేరదు.

**ఉనిక** (Stress and accent)

నయిది మయిది = నాది మాది.

"నయ్య దాపు రూకలేదు — సూటెగుల్ల కోక లేదోయా" (కొండరెడ్ల పాట)

దాపు—దాచుకున్నది చూపు=చూచుటకు. చూపుకుపోతున్నా.

నిజమే — నిజ్జమే అన్నట్లు వినిపిస్తుంది.

నగరిబస — భరణిశాల — జల్ది — కర్మకాండలో గూడా జొరబడిన ఈ పదాలు ఏనాటి మన సంపర్కానికి తార్కాణాలో.

---

శ్రీ బులుసు వేంకటరమణయ్య

# హరిశ్చంద్ర కథ-మార్కండేయ పురాణం

"హరిశ్చంద్రో నలో రాజా
పురుకుత్సః పురూరవః,
సగరః కార్తవీర్యశ్చ
షడేతే చక్రవర్తినః"

అనే శ్లోకం షట్చక్రవర్తులూ ఎవరో తెలియజేస్తున్నది. ఆ ఆరుగురిలోనూ ఆద్యుడై ఆడితప్పని వాడని ఆబాల గోపాలమూ చెప్పుకుంటున్న హరిశ్చంద్రుని కథ విభిన్న రీతుల్లో కానవస్తున్నది. లోక ప్రసిద్ధమై నాటక ప్రదర్శనల మూలంగా ప్రచారం పొందిన కథ ఒకటి, ప్రసిద్ధమైన మార్కండేయ పురాణంలో కానవచ్చే కథ ఒకటిన్నీ.

ప్రసిద్ధంగా ఉండి ప్రచారానికి వచ్చిన కథ యిది —

అమరలోకంలో దేవేంద్రుడు ఒకప్పుడు దేవతలతోను, మహా మునులతోను కొలువుతీర్చి ఉండి "మానవలోకంలో ఆడితప్పకుండా — నిత్య సత్యవ్రతుడైన వ్యక్తి ఎవరైనా ఉన్నాడా ?" అని ఒక ప్రశ్నవేశాడు. "హరిశ్చంద్ర చక్రవర్తి ఆడితప్పనివాడు" అని వసిష్ఠ మహర్షి చెప్పాడు. ఆ మహర్షికి అన్నివిధాలా ప్రతి ద్వంద్వి అయిన విశ్వామిత్రుడు "ఆ చక్రవర్తి అబద్ధం ఆడగల"డని అంటే "అలా జరగదు" అని వసిష్ఠుడు గట్టిగా చెప్పాడు. ఇద్దరూ ప్రతిజ్ఞలు చేశారు కూడా.

హరిశ్చంద్రుడు అబద్ధమాడడని విశ్వామిత్రుడికి తెలుసు. వసిష్ఠుడు ఔనన్నది కాదనడమే తన పద్ధతి కాబట్టి, ఎదురు చెప్పవలసి వచ్చింది. ఆ రాజుచేత అసత్యం పలికించడానికి ఉపాయాలాలోచించి, అతని వద్దకు వచ్చి తాను యాగం చేయబోతున్నాననీ, విశేషంగా ధనం కావాలనీ అతన్ని కోరాడు. హరిశ్చంద్రుడు కోరిన ధనం ఇవ్వడానికి సిద్ధపడగా — తాను యాగం ప్రారంభించినప్పుడు తీసుకుంటానని, అంతవరకూ దాచి ఉంచాలనీ కోరాడు. రాజు దానికి సమ్మతించాడు.

విశ్వామిత్రుడు తన తపః ప్రభావంవల్ల అడవిలో క్రూర మృగాలను సృజించి వాటివల్ల పరిసర గ్రామాల వారికి బాధలు కలిగేటట్లు చేశాడు. ఆ విధంగా హరిశ్చంద్రుణ్ణి అడవికి రప్పించాలని అతని అభిప్రాయం. ప్రజలు మొరపెట్టగా రాజు విశ్వామిత్రుడున్న ఆ అడవికి పోయి క్రూరమృగాలను వేటాడి ఒకచోట విశ్రాంతి తీసుకుంటూ ఉన్నాడు. అప్పుడు ఆ ముని ప్రేరణవల్ల యిద్దరు కన్యలు వచ్చి, తమ్ము వివాహమాడవలెనని హరిశ్చంద్రుణ్ణి నిర్బంధించారు. అతడు తిరస్కరించాడు విశ్వామిత్రుడు ఆ సమయంలో వచ్చి ఆ కన్యల పక్షం మాట్లాడాడు. "నా రాజ్యాన్నయినా యిస్తానుగాని, వీళ్లను పెళ్లాడేదిలే"దని ఆ ప్రభువు ఖచ్చితంగా జవాబిచ్చాడు. 'అయితే, ఆడినమాట తప్పకుండా నీ రాజ్యాన్ని ఇయ్యి" అన్నాడు ముని. హరిశ్చంద్రుడు తన రాజ్యాన్ని అతనికి ధారపోశాడు. రాజ్యం స్వాధీనం చేసుకొన్నాక "నాకు వెనుక వాగ్దానం చేసిన ధనంయివ్వాలి" అని విశ్వామిత్రుడడుగగా— కొలది కాలంలో యిస్తానని ఒక గడువు పెట్టాడు. ఆ సొమ్ము వసూలు చెయ్యడానికి విశ్వామిత్రుడు తన శిష్యుడైన నక్షత్రకుని రాజువెంట పంపాడు రాజు భార్యాపుత్రులతో కాశీకి వెళ్ళాడు. నాటితో గడువు ముగిసిపోతుందనగా—ఆ ధనంకోసం హరిశ్చంద్రుడు ఒక బ్రాహ్మణుడికి భార్యను అమ్మవలసి వచ్చింది.

అంతతో మునిఋణం తీరింది. కాని తనదారిబత్తెం సొమ్ము ఇచ్చి తీరాలని నక్షత్రకుడు నిర్బంధించాడు. అందువల్ల హరిశ్చంద్రుడు ఒక కాటికాపరికి అమ్ముడుపోవలసివచ్చింది. యజమానుని ఆజ్ఞననుసరించి సదా శ్మశానంలోనే నివసిస్తూ శవాల సుంకాన్ని వసూలుచేస్తూ ఉండవలసివచ్చింది.

భార్యతో కూడా బ్రాహ్మణుని యింట్లోఉన్న కుమారుడు సర్పదష్టుడై మరణించగా, క్రూరురాలైన బ్రాహ్మణపత్ని ఆ బాలుని దహనానికి చంద్రమతీదేవికి అర్ధరాత్రి అనుమతి ఇచ్చినది. రాజపత్ని అట్టి నిశీథ సమయంలో పిల్లవానిని మోసికొని శ్మశానానికివచ్చి దహింపబోగా సుంకాన్ని చెల్లిస్తేగాని దహనం సాధ్యపడదని హరిశ్చంద్రుడన్నాడు. తనదగ్గర డబ్బులేదని ఆమె అనగా, మెడలోఉన్న పుస్తెనమ్మి పైకం తీసుకుని రావలెనని హరిశ్చంద్రుడు సలహా ఇచ్చాడు. ఆమె మంగళసూత్రం భర్తకేగాని మరొకరికి కనబడదనే శాపంఉంది. అప్పుడు చంద్రమతీ హరిశ్చంద్రులు ఒకరి నొకరు పోల్చుకొని, తమకు కలిగిన యీ కష్టాలకు మిక్కిలి దుఃఖించారు. సుంకం తీసుకోకుండా దహనం చెయ్యడం సాధ్యంకాదు కనుక, మంగళసూత్రం అమ్ముటకు చంద్రమతి నగరంలోనికి వెళ్లినది.

ఆ సమయంలో రాజభవనంలో కొందరు దొంగలు విలువైన నగలను దొంగిలించి వస్తూ, తమను రాజభటులు వెంటాడినందున భయపడి నగలమూటను చంద్రమతివద్ద పడవేసి, ఆ కటికచీకటిలో కానరాకుండా పారిపోయారు. రాజభటులువచ్చి, ఆ నగలమూట చూచి, ఆమెయే నగల నపహరించినదని నిశ్చయించి ప్రభువుకు మనవి చేశారు. యుక్తాయుక్త వివేకంలేని రాజు ఆమెకు మరణ శిక్షవిధించి, వెంటనే దానిని అమలుజరపాలని అన్నాడు. ఆమెను చంపవలసినపని హరిశ్చంద్రునిపైని పడింది. అతడు గుండెనిబ్బరం చేసుకుని తన విధిని నెరవేర్చడానికి కత్తిని ఎత్తగా విశ్వామిత్రుడు వచ్చి అడ్డుపడి అది అంతా తానుచేసినపనియే అనీ, అతని సత్యపాలనను పరీక్షించడానికే ఇలా జరపవలసివచ్చిందనీ చెప్పి హరిశ్చంద్రుణ్ణి మిక్కిలి ప్రశంసించాడు. చనిపోయిన అతని కుమారుని బ్రతికించి రాజ్యాన్ని తిరిగి అప్పగించాడు. సత్యపాలనకు ఈ చరిత్రాన్నే అందరూ ఉదాహరిస్తూ ఉంటారు.

గౌరన హరిశ్చంద్ర ద్విపదలోనూ, శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానంలోనూ ఈ కథయే గ్రహించబడింది నాటక ప్రదర్శనలోనూ ఈకథయే కానవస్తుంది.

కాని, మార్కండేయ పురాణంలో ఈ కథ మరొకవిధంగా కానబడుతున్నది ఆ కథ యిది —

త్రేతాయుగంలో హరిశ్చంద్రుడనే రాజు ఉండేవాడు. ఆయన గొప్ప ధర్మాత్ముడు. ఆయన రాజ్యంలో ప్రజలు ఎట్టి లోపమూ లేకుండా సుఖంగా ఉండేవారు. ధర్మాన్ని అతిక్రమించేవారు కారు.

ఆ రాజు ఒకప్పుడు అడవికి వేటకు వెళ్లి ఒక జింకను వెంట తరుముచుండగా "రక్షించండి" అని స్త్రీ యొక్క ఆక్రందన ధ్వని వినిపించింది. హరిశ్చంద్రుడు జింకను వెంట తరుముట మాని "భయపడవద్దు. నేను ప్రజాపాలకుడనై ఉండగా ఏ దుర్మార్గుడూ బాధించలేడు" అంటూ ఆ మొర వినవచ్చిన దిక్కుకు వెళ్లాడు.

ఆ వనంలో విశ్వామిత్రుడనే మహాముని భవాదులకున్నూ సిద్ధించని విద్యలను సాధించడానికి ఘోరమైన తపస్సు చేస్తూ ఉన్నాడు. ఆ తపస్సు తాపానికి తాళలేక అక్కడివారు మిక్కిలి భయపడి మొరపెడుతున్నారు. హరిశ్చంద్రుడువిన్నది అట్టి మొరనే!

ఇట్టి స్థితిలో ఉపేక్షిస్తే ప్రజలకు పెద్దహాని కలుగుతుందని భావించి వినాయకుడు విశ్వామిత్రుడి మనస్సును తీవ్ర తపస్సునుండి మళ్లించడానికి ఆలోచించాడు. ఆ గణాధిపతి తన సంకల్ప సిద్ధికోసం హరిశ్చంద్రునిలో ప్రవేశించి అతనికి ఉద్రేకాన్ని కలిగించాడు. వినాయకుని ఆవేశం పొందిన హరిశ్చంద్రుడు క్రోధోద్రిక్తుడై "ఎవడురా గుడ్డచివర నిప్పుమూటగట్టదలచి ఉన్నాడు? నేను ఈ రాజ్యాన్ని పాలిస్తూ ఉండగా అధర్మం ఎలా ఉంటుంది? అధర్మప్రవర్తకుణ్ణి నా బాణాలతో కొట్టి క్షణంలో యముని యింటికి పంపనా?" అని గట్టిగా అరుస్తూ వెళ్లగా విశ్వామిత్రుడు కనిపించాడు.

ఈ అరపు విని, నియమంలో ఉన్న ఆ మహాముని మండిపడి లేచి హరిశ్చంద్రుని దగ్గరకు వచ్చాడు. అతణ్ణి చూచి రాజు భయపడ్డాడు. విశ్వామిత్రుడు "దురాత్మా! ఎందుకలా అరచి మా నియమానికి విఘ్నం కలిగిస్తావు?" అని అన్నాడు. హరిశ్చంద్రుడు చేతులు జోడించి అతనికి నమస్కరిస్తూ "ఓ మహామునీ! నిష్కారణంగా నాపై ఎందుకు కోపిస్తారు? నేనేమీ తప్పుపని చెయ్యలేదు. నా ధర్మాన్ని నేను పాలిస్తాను. అధర్మానికి భయపడతాను" అని అన్నాడు. అప్పుడు విశ్వామిత్రుడు "రాజా! నీవు అధర్మానికి భయపడి, ధర్మంగా పాలిస్తే, ఎవరికిస్తావో, ఎవరిని రక్షిస్తావో, ఎవ్వరితో యుద్ధం చేస్తావో చెప్పు" అని అన్నాడు. తాను విప్రులకూ, జీవిక లేనివారికీ కోరినది యిస్తాననీ, భయపడిన వారిని రక్షిస్తాననీ, శత్రువులతో యుద్ధం చేస్తాననీ బదులు చెప్పాడు. విశ్వామిత్రుడు "నీవు నీ రాజధర్మాన్ని నెరవేర్చదలిస్తే — నేను విప్రుడను కాబట్టి నేనుచేయబోయే యాగానికి భూరి దక్షిణ ఇయ్యి" అన్నాడు. దానికి హరిశ్చంద్రుడు "సరే" అన్నాడు. అంతతో ఊరుకోలేదు. గణాధిపావిష్టుడైన హరిశ్చంద్రుడు "ఓ మహామునీ! యాగ దక్షిణ మాత్రమే కాదు. నా భార్య, నా పుత్రుడు, నేను, నా సర్వస్వమూ, నా రాజ్యమూ అంతా నీ ఆధీనమే. వీటిలో ఏది కావలసినా తీసుకోవచ్చు" అని ఉద్రేకంతో అన్నాడు. ఆ అవకాశాన్ని చిక్కించుకుని విశ్వామిత్రుడు "రాజా! నీ భార్యాపుత్రులతోగాని, నీతోగాని నాకు నిమిత్తంలేదు. నీవు రాజ్యాన్నయినా ఇస్తానన్నావు కాబట్టి నీ సంపదతో కూడా నీ రాజ్యాన్ని నాకు ఇచ్చివెయ్యి" అన్నాడు. అప్పుడు హరిశ్చంద్రుడు ముఖంలో ఎట్టి వెలవెల పాటులేక సంతోషంతో తన రాజ్యాన్నీ, తన సర్వస్వాన్నీ ఆ మునికి ధారాదత్తం చేశాడు.

విశ్వామిత్రుడు "రాజా! నీవు నీ రాజ్యాన్ని నాకిచ్చివేశావు గనుక దీనికి నేనే సర్వాధికారిని. నీవు నా రాజ్యంలో వుంటే నీవే అధికారివని ప్రజలనుకొంటారు. అందువల్ల నీవీ రాజ్యాన్ని విడిచిపెట్టి మరెక్కడికయినా వెళ్లిపోవాలి" అని అన్నాడు. ఆ మాటలకు రాజు దిగ్భ్రాంతుడైనాడు రాజ్యంలోని ప్రజల్లో ఒకడుగా తాను అక్కడ ఉండకూడదా? అని అనుకున్నాడు. "స్వామి! ఈ రాజ్యానికి నీవే అధికారివి. నా అధికారంలేదు. నేను సామాన్యుడను" అన్నాడు. "నేనే దీనికధికారిని కావున నీవు ఈ రాజ్యంలో ఉండకూడదని శాసిస్తున్నాను" అన్నాడు విశ్వామిత్రుడు. హరిశ్చంద్రుడు మారుమాట చెప్పక కట్టుబట్టలతో భార్య అయిన శైబ్యతోను, కుమారుడు లోహితునితోను బయలుదేరాడు. అతడు పోతూ ఉండగా విశ్వామిత్రుడు దారి కడ్డంగా నిలిచి "నాకు యాగానికి ఇస్తానని వాగ్దానం చేసిన ధనం యిచ్చి మరీ వెళ్లు" అని గద్దించి అడిగాడు అప్పుడు హరిశ్చంద్రుడు "ఓ మహామునీ! నా రాజ్యమంతా నీకిచ్చివేశాను మా శరీరాలు తప్ప ఇక మావద్ద ఏమీలేవు గదా!" అని అన్నాడు. విశ్వామిత్రుడు కోపించి "ఓ రాజా! బ్రాహ్మణునికి వాగ్దత్తమైన ధనం ఇయ్యవలసిందే! నేను రాజసూయ యాగం చేస్తున్నాను. ఆ యాగానికి ఎంత దక్షిణ

యివ్వాలో అది నీవు తప్పక యివ్వాలి. లేకపోతే నా శాపానికి గురి అవుతావు'' అన్నాడు. ''సరే ఇస్తా''నని చెప్పి రాజు ఒకనెల దినాలు గడువు కోరాడు. దానికి విశ్వామిత్రుడు సమ్మతించాడు. ఆ రాజు నగరం విడిచిపోతూ ఉండగా ప్రజలు అడ్డంవచ్చి వెళ్లిపోవద్దని ఎంతగానో ప్రార్థించారు. రాజు వెళ్లిపోతే తామున్నూ అతనితోనే వస్తామన్నారు. వారిని సమాధాన పరచడానికి హరిశ్చంద్రుడు కొంతసేపు మసలవలసి వచ్చింది. ప్రజల మాట విని రాజు ఉండి పోతాడేమో అనే సందేహం కలిగి, విశ్వామిత్రుడు వచ్చి క్షణమైనా ఆలస్యం చేయక వెళ్లిపోవాలని ఆదేశించాడు.

అంతఃపురంనుంచి బయటికి అడుగుపెట్టని రాజపత్నికీ, రాజకుమారునికీ కాలినడకను ప్రయాణం చెయ్యడం ఎంతో శ్రమ అయింది ఎలాగో వారు ముగ్గురూ కాశీనగరం చేరుకున్నారు. విశ్వామిత్రుడు హరిశ్చంద్రునికి కలిగిస్తున్న యీ కష్టాలను చూచి అయిదుగురు విశ్వేదేవులు జాలిపడి మనస్సులోనే విశ్వామిత్రుణ్ణి నిందింపసాగారు. ఆ విషయాన్ని గ్రహించి ఆ ముని వారిని మానవులుగా పుట్టునట్లు శపించాడు.

ఈ విధంగా గణపతి విశ్వామిత్రుని మనస్సును ఘోర తపస్సు నుండి మళ్లించడం సాధ్యపడింది

హరిశ్చంద్రుడు కాశీనగరానికి వెళ్లడానికి నెలరోజులు పట్టింది. గడువు పూర్తి అయ్యే దినాన అతడు అక్కడ ప్రవేశించాడు. అక్కడికి వెళ్లేసరికి విశ్వామిత్రుడు ప్రత్యక్షమయి గడువు ముగిసినందున సొమ్ము ఇయ్యాలని నిర్బంధించాడు. ఇంకా సాయంకాలంవరకూ గడువు ఉందనీ, అప్పుడు ఇయ్యగలననీ ఆ రాజు సమాధానపరచి అతణ్ణి పంపివేశాడు. ఆ తర్వాత డబ్బు ఎలా ఇవ్వడమా ? అని ఆలోచనకలిగింది. ఇవ్వడం సాధ్యం కాకపోతే ఆత్మహత్య చేసుకోవడమే మేలేమో ! అలా ఋణం తీర్చకుండానే మరణిస్తే, బ్రాహ్మణుని సొత్తు అపహరించిన పాపాన పురుగునై పుట్టవలసి వస్తుంది. అందువల్ల అలా ప్రాణాలు విడవడం సరి కాదు. ఎవడికయినా అమ్ముడుపడి, ఆ ధనంతో ఋణం తీర్చడం మేలు. అని అతడు తనలో ఆలోచిస్తూ తలవంచుకొని ఉండగా, అతని విచారాన్ని గ్రహించి భార్యయైన శైబ్య ఇలా అన్నది —

''వాగ్దానం చేసిన సొమ్ము మహామునికి ఇచ్చి తీరాలి గదా ! వివాహమాడడం సంతానం కోసమే ! నాకు ఎలాగూ పుత్ర సంతానం కలిగింది. మీ వంశం నిలవడానికి లోహితుడున్నాడు. నన్ను అమ్మివేసి ఆ ధనం విశ్వామిత్రునికి ఇవ్వండి· ఇంత కంటె మార్గాంతరంలేదు·''

ఆ మాటలు విని దుఃఖం పట్టలేక హరిశ్చంద్రుడు మూర్ఛ పోయాడు. అతని అవస్థను చూస్తున్న భార్యకునుమూర్ఛవచ్చింది. ఇద్దరూ మూర్ఛపోగా, పసివాడైన కుమారుడు ఆకలి అంటూ ఏడ్వసాగినాడు. అట్టి సమయంలో విశ్వామిత్రుడు వచ్చి హరిశ్చంద్రుని ముఖంపై నీళ్లు చల్లి మూర్ఛతేర్చి ''సాయంకాలం లోపుగా సొమ్ము ఇవ్వకపోతే శపిస్తా''నని బెదిరించి వెళ్లిపోయాడు.

పిదప హరిశ్చంద్రుడు విధిలేక తన భార్యను ఒక వృద్ధ బ్రాహ్మణునికి విక్రయించాడు. ఆ బ్రాహ్మణుడు శైబ్యను తీసుకుని పోతూ ఉండగా తల్లిని విడువలేక లోహితుడు ఆమె వెంట పడ్డాడు. ఆమెకూడా ఆ బాలుణ్ణి విడిచి ఉండలేక పోవడంవల్ల, ఆమె ప్రార్థనను అంగీకరించి ఆ బ్రాహ్మణుడు బాలుణ్ణి కూడా కొన్నాడు. ఆ బ్రాహ్మణుడే ఆ ధనాన్ని హరిశ్చంద్రుని వస్త్రం చివర మూట కట్టాడు. అప్పుడు విశ్వామిత్రుడు రాగా, రాజు ఆ ధనాన్ని అతనికి సమర్పించాడు. ''ఈ ధనం యాగ దక్షిణకు చాలదు. ఇంకా ఇవ్వాలి'' అని ఆ ముని కోపంతో శపించడానికి సిద్ధపడ్డాడు. ఇంకా దినంలో నాల్గవ భాగం గడువుకు మిగిలి ఉన్నదని, సాయం కాలంలోగా ఇస్తానని హరిశ్చంద్రుడు అన్నాడు.

సాయంకాలం కావచ్చినది. ప్రవీరుడనే చండాలుడు కోరినంత ధనం యిచ్చి హరిశ్చంద్రుణ్ణి కొనడానికి సిద్ధపడ్డాడు. కాని, అతడు చండాలుడికి సేవకుడుగా ఉండుటకు మొదట్లో ఇష్టపడలేదు. విశ్వామిత్రుడు వచ్చి, తనకు కావలసినంత ధనం యిస్తానన్న ప్రవీరుడికే అమ్ముడుపోవాలని సలహా యిచ్చాడు. ''నీకు ఈయవలసిన డబ్బుకు బదులుగా నీకు దాసుడనై ఉంటానుగాని, చండాలునికి దాస్యం చెయ్యనని హరిశ్చంద్రుడు చెప్పి, తన్ను సేవకునిగా అంగీకరించాలని'' ఆ మునిని ప్రార్థించాడు. ''నీవు నాకు దాసుడవయితే, నేను నిన్ను ప్రవీరునికే అమ్ముతా'' నని చెప్తూ విశ్వామిత్రుడు హరిశ్చంద్రుణ్ణి ఆ చండాలునికే విక్రయించాడు. హరిశ్చంద్రుడు మారుమాట చెప్పక ప్రవీరుని వెంట వాని నివాసానికి వెళ్లిపోయాడు.

ప్రవీరుని యింటిలో కొంతకాలం ఉండి, తర్వాత అతని ఆజ్ఞ ననుసరించి శ్మశానానికి కావలిగా ఉండవలసి వచ్చింది. శవాల దగ్గర ఉంచే అన్నం తింటూ, అతి నీచంగానూ, దుర్భరంగానూ కాలం గడపవలసి వచ్చింది. అట్టి స్థితిలోనే ఒకనాడతనికి ఒక కల వచ్చింది. ఆ కల యిలా ఉన్నది—''తాను పన్నెండేళ్లు కాటికాపరిగా ఉండగా, ఎవ్వరో విశ్వామిత్రునికి డబ్బిచ్చి తన్ను విడిపించారు. తర్వాత తానొక చండాల యువతి గర్భంలో జనించి, ఏడేండ్ల వయస్సులో కాటికాపరిగా పనిచెయ్యసాగాడు. ఒక పేద బ్రాహ్మణుని శవమును అతని బంధువులు శ్మశానానికి తీసుకొనిరాగా, సుంకం ఇవ్వకుండా దహించడానికి వీలులేదని గట్టిగా చెప్పవలసి వచ్చింది. ఆబంధువులు కోపించి 'నీవు హరిశ్చంద్ర రాజుగా పుట్టి పాపిష్ఠమైన, అశుభమైన పని చేయుదువు గాక !' అని శపించారు. ఆ మాటలకు హరిశ్చంద్రుడు వారిని ఎదిరించగా, ఆ క్షణంలోనే ఘోరమైన నరకానికి పోయేటట్లు శపించారు. ఆ శాపంవల్ల అతడు నరకానికి పోయి నూరేండ్లు పెక్కు బాధలను అనుభవించి తర్వాత కుక్కగా జన్మించాడు. ఆ శునకం ఒక చలిమంటలో పడి చచ్చిపోయింది. పిదప అతడు అనేక మృగములుగాను, పక్షులుగాను, కీటకములుగాను, వృక్షములుగాను జన్మము లెత్తుచు నూరేండ్లు బాధపడి ఎంతో

తమకు కలిగిన కష్టాలకు ఎంతో వాపోయారు. పుత్రునికి దహన సంస్కారం చేసి, తాము కూడా అగ్నిప్రవేశం చేసి పరలోకానికి పోవాలని నిశ్చయించుకొన్నారు.

హరిశ్చంద్రుడు భగవంతుని గూర్చి తుది ప్రార్థన చేయుచుండగా బ్రహ్మ, యముడు, ఇంద్రుడు మున్నగు దేవతలందరును ప్రత్యక్షమయి అతని ధర్మ ప్రవర్తనకు మెచ్చుకొన్నారు. భార్యాభర్తలను మరణ ప్రయత్నము నుండి మళ్లించారు. ఇంద్రుడు లోహితాస్యుని బ్రతికించెను. ఇంద్రుడు హరిశ్చంద్రుని, భార్యా పుత్రులను స్వర్గమునకు రమ్మని ఆహ్వానించెను. తన యజమాని యైన ప్రవీరుని అనుమతి లేకుండా ఎక్కడికీ రావడం సాధ్యం కాదని అతడు చెప్పగా యముడు "నిన్ను పరీక్షించడానికి నేనే చండాల నాయకుడిని అయినా"నని చెప్పి ఎంతో ఆశ్చర్యాన్ని కలిగించాడు. తన ప్రజ లెక్కడ వుంటే తానూ అక్కడనే ఉంటాననీ, వారు లేని స్వర్గం తన కక్కర లేదనీ హరిశ్చంద్రుడు ఇంద్రుడికి తెలియజేశాడు. తర్వాత అందరూ అయోధ్యకు వెళ్లారు. విశ్వామిత్రుడున్నూ వారితో వచ్చి రాజ్యం అప్పగించాడు. హరిశ్చంద్రుడు దేవతల సమక్షంలో లోహితాస్యునికి పట్టం కట్టి, తర్వాత భార్యతోను, పురప్రముఖులతోను ఇంద్రుడు రప్పించిన విమానంలో స్వర్గం చేరుకున్నాడు.

ఇది మార్కండేయ పురాణంలోని హరిశ్చంద్ర కథా సంగ్రహం.

పయి రెండు కథలకూ కొంత వ్యత్యాసం కానవస్తున్నది. మార్కండేయ పురాణంలోని హరిశ్చంద్రుడు ధర్మతత్పరుడు. ఎట్టి స్థితిలోనూ ధర్మాన్ని అతిక్రమించడు. వాగ్దత్తమైన ధనాన్ని ఇయ్యకపోతే శపిస్తానని విశ్వామిత్రుడు తరచు అతణ్ణి బెదిరిస్తాడు. ఈ బెదరింపులు అవసరం లేదేమో అని అనిపిస్తుంది. తొలి కథలోని హరిశ్చంద్రుడు సత్యనిష్ఠుడు. సత్యనిష్ఠకు ప్రాధాన్యం ఇవ్వడం కోసమే ఇంద్రలోకంలో నిండుసభలో ఇంద్రుని ప్రశ్న, వసిష్ఠ విశ్వామిత్రుల ప్రతిజ్ఞలూ, చండాల కన్యల వివాహాభిలాష కల్పించబడినవి. ఎలాగయినా హరిశ్చంద్రుని చేత — అబద్ధమాడించాలనే సంకల్పంతోనే విశ్వామిత్రుడు అతనిని పెట్టరాని బాధలు పెట్టడం జరిగింది. నక్షత్రకుడి పాత్రను ప్రవేశ పెట్టడంలో ప్రధానోద్దేశం అదే! రాజు భార్యను బ్రాహ్మణుని భార్య కలహకంఠి పెక్కువిధాల కష్టపెట్టడం, ఆమెయందు దొంగతనం ఆరోపించడం, ఆమెను హరిశ్చంద్రుడు చంపుటకు సిద్ధపడడం కూడా అసత్యం పల్కించడానికి ఒత్తిడి తీసుకొని రావడానికే అని స్పష్టంగా తెలుస్తూనే ఉన్నది. వాడుకలో ఉన్న కథలోని విశ్వామిత్రుడు రాజర్షి. క్షత్రియుడు. కాని మార్కండేయ పురాణంలోని విశ్వామిత్రుడు బ్రాహ్మణుడైనట్లు

"యష్టు మిచ్ఛామి విప్రోఽహం
దీయతా మిష్ట దక్షిణా"

[అధ్యాయం 7—శ్లోకం 21]

అనే దానివల్ల తెలుస్తున్నది.

హరిశ్చంద్రుడు కూడా తాను బ్రాహ్మణులు ఏది అడిగినా ఇస్తానని నియమం పెట్టుకొన్నట్లు "దాతవ్యం విప్రముఖ్యేభ్యః" (శ్లోకం 20) అనే శ్లోకభాగమే వెల్లడిస్తున్నది.

ప్రసిద్ధంగా ఉన్న కథలోని హరిశ్చంద్రుడు గొప్ప పట్టుదల కలవాడు. అతని స్వభావం మానవాతీతమైనది. అందువల్లనే ఎట్టి సాహసానికయినా అతను సిద్ధపడ్డాడు. మార్కండేయ పురాణంలోని హరిశ్చంద్రుడు అమాయకుడు, ఉద్రేకం కలవాడున్నూ. అమాయకుడు కాబట్టే విశ్వామిత్రుని తపస్సుకు భంగం కలిగించదలచిన గణాధిపతి అతనిలో ప్రవేశించి తన కోరికను నెరవేర్చుకోగలిగినాడు. విశ్వామిత్రుడు అతనిని యాగదక్షిణను మాత్రం కోరాడు. దానిని వాగ్దానం చెయ్యడంతో రాజు ఇంకనూ ఏమి కావలసినా యిస్తాననీ, తన రాజ్యాన్ని కూడా యిస్తాననీ చెప్పి, తాను కోరి కోరి ఉపద్రవం తెచ్చిపెట్టుకున్నాడు. ఇది అతని ఉద్రేకాన్ని స్పష్టం చేస్తున్నది.

తెలుగులో ఉన్న గౌరన, శంకర కవుల హరిశ్చంద్ర చరిత్రలను, మారన మార్కండేయ పురాణాన్నీ పరిశీలిస్తే ఇద్దరు హరిశ్చంద్రుల వ్యత్యాసాన్నీ గ్రహించవచ్చును.

రాజు భార్య, మున్నగు వారి పేర్లలో మార్పు కానవస్తుంది.



దుఃఖించాడు. తర్వాత సూర్యవంశంలో పుట్టి జూదంలో తన రాజ్యం పోగొట్టుకొని, భార్యా పుత్రులతో వియోగం పొంది, అడవిలో ఒంటరిగా తిరుగుతూ ఉండగా ఒక సింహం మింగివేసింది. భక్షితుడైన ఆ రాజు తన భార్య కోసం విలపిస్తూ, ఇటూ అటూ పరుగెత్తుతూ మరణిస్తాడు. మరణించిన ఆరాజుకు 'నాథా! నన్ను రక్షించు, రక్షించు' అని తన భార్య మొరపెట్టడం వినబడింది. ఆమెను యమభటులు ఈడ్చుకొని పోతూ ఉండడం అతనికి కనబడింది. ఇంతలో అంతరిక్షం నుంచి 'ఇక్కడికి రా' అనే యముని పిలుపు వినబడింది. 'నీవు యాగ దక్షిణను ఇయ్యనందున నిన్ను శిక్షిస్తున్నా' నని యముడు చెప్పాడు. యమభటులు రాజును పాశాలతో బంధించి తీసుకొనిపోతూ వుండగా శ్రాద్ధదేవుడు 'ఇది విశ్వామిత్రుని పని' అని అతనితో అన్నాడు. పన్నెండేళ్ళ శిక్ష అనుభవించాక యమభటులు అతణ్ణి యముని వద్దకు తీసుకొని వచ్చారు. యముడు అతనిని చూచి 'ఓ రాజా! విశ్వామిత్రుని కోపాన్ని ఎవ్వరూ అడ్డుకోలేరు. అతడు నీకుమారుడు మరణించేటట్లు కూడా చెయ్యగలడు. మనుష్య లోకానికి పోయి నీ దుఃఖశేషాన్ని అక్కడ అనుభవించిన తర్వాత మేలు కలుగుతుందిలే.' అన్నాడు. పిదప యమదూతలు ఆ రాజును అంతరిక్షం నుంచి తోసివేస్తారు. అతడు భూలోకంలో పడతాడు ''

ఇలా కలగన్న తర్వాత హరిశ్చంద్రునికి మెలకువ వచ్చింది. ఈ కల అతనికి పుండుపై కారము చల్లినట్లు ఎంతో బాధను కలిగించినది. కలలో చూచినట్లు తానక్కడ పన్నెండేళ్ళు ఉన్నానేమో అని సందేహం కలిగి అక్కడ వుంటున్న చండాలురను కొందరిని అడుగగా—ఉన్నావని కొందరు, లేవని కొందరు అన్నారు అతడేమీ నిశ్చయించలేకపోయాడు. తన సంగతి తనకే తెలియని స్థితి అతనిది.

అప్పుడు సర్పదష్టుడై మరణించిన కుమారుణ్ణి దహనం చెయ్యడానికి శైబ్య ఆ పుత్రునితో అక్కడికి వచ్చింది. ఆమె మిక్కిలి బక్కచిక్కి వికార స్వరూపంతో ధూళిధూసరిత శరీరంతో ఉండి మిక్కిలి విలపిస్తూ ఉన్నది. ఆమె తన భర్త అని హరిశ్చంద్రుడిని గుర్తుపట్టలేదు. హరిశ్చంద్రుడు కూడా ఆమెను పోల్చలేకపోయాడు. మృత బాలుడు రాజలక్షణాలతో ఉన్నందువల్లను, తన కుమారునివలెనే ఉన్నందునను, ''మా లోహితాస్యుడు కాడుగదా!'' అనే అనుమానం కూడా అతనికి కలిగింది. ఏడుస్తూ ఆమె పలికిన మాటలవల్ల ఆమె తన భార్యయే అనీ, మరణించిన బాలుడు లోహితాస్యుడే అనీ తెలుసుకొని దుఃఖం పట్టలేక అతడు మూర్ఛపోయాడు. తన భర్త తుదకు కాటికాపరియైనందుకు శైబ్యకు కల్గిన దుఃఖమున కంతము లేదు. తర్వాత హరిద్దరూ

హిందీమూలం : శ్రీ మోహన్‌రాకేశ్

# మరపురాని సంఘటన

అది లుధియానా సమీపంలోని ఒక చిన్న గ్రామం. రిటైర్ అయిన తరువాత డాక్టర్ హరివంశరాయ్ అక్కడే స్థిరపడి పోయారు. ఆయన జన్మస్థానం అదే. పురాతత్త్వ శాస్త్రంలో గొప్ప పండితుడైనప్పటికీ, ఆయనలోని భావుకత్వం పుట్టి పెరిగిన వాతావరణంలోనే జీవితంలోని చివరి రోజులు గడపమని ప్రేరేపించింది. అక్కడకు వెళ్లిన నాలుగు సంవత్సరాలకే ఆయన గుండెపోటు వల్ల మరణించారు. ఆయన శ్రేయోభిలాషులందరికీ ఈ వార్త త్వరలోనే అందినా, నాకు మాత్రం ఆయన పోయారన్న విషయం నాలుగు నెలల తరువాత తెలిసింది.

ఒక మంచి మిత్రుణ్ణి పోగొట్టుకొన్నందుకే కాకుండా, ఒక గొప్ప పండితుడు మరణించినందుకు చాలా విచారించాను. ఆయన పోయినందుకు చర్చలు, సమావేశాలు జరుగలేదు. ఆయనకు అతి సన్నిహితులైన కొందరికి ఈ వార్త అందనేలేదు. పట్టణంలో వున్నట్లైతే సంతాప సభలు జరిగేవి. సంతాప సూచకంగా సందేశాలు కూడా వచ్చేవి. కానీ......

ఒకసారి ఆయన కుటుంబ సభ్యులను కలుసుకోవాలని నిర్ణయించుకొన్నాను. ఆయన ఇంట్లో వుండేది ఇద్దరే ఇద్దరు; ఆయన భార్య, కుమార్తె. ఊరువిడిచి వచ్చేటప్పటికి ఆ అమ్మాయి వయస్సు సుమారు పన్నెండు సంవత్సరాలు వుండవచ్చును. ఆ వయస్సులోనే ఆమె ఎంతో చాకచక్యంగా ప్రతి విషయాన్ని గురించీ తర్కించేది. గంభీరమైన విషయాలను గురించి తన అభిప్రాయాలను తెలియజేసేది. ఒకసారి నేను "నీలిమ ముందు ముందు గొప్ప విదుషీమణి అవుతుంది" అన్నాను. ఈ మాటను ఆసరాగా తీసుకొని ఆమె అప్పుడప్పుడూ తాను చెప్పదలచిన విషయాన్ని సమర్థించుకోవడానికి, "నీలిమ గొప్ప విదుషీమణి కాబోతుందని మరచిపోయారా ?" అని అడిగేది.

ముందుగా తెలియపర్చకుండానే, ఒకరోజు వాళ్ల గ్రామం వెళ్లి శిథిలమైన వాళ్ల యింటిముందు నిలబడ్డాను. ఆ చిలిపి అమ్మాయి స్థానంలో అణుకువగల నవయువతిని చూసి ఆశ్చర్యపోయాను. ఆమె ఒక్కక్షణం నావైపు విస్మయంగా చూసి, వినమ స్వరంలో "రండి! బాబాయ్ అమ్మ వంటగదిలో వుంది. ఇప్పుడే పిలుస్తాను" అన్నది పేరులోనూ, రూపంలోనూ ఆమె నీలిమయే. కాని స్వభావంలో మాత్రం అపరిచితురాలులా కనిపించింది.

నీలిమ తల్లి లోపల నుండి వచ్చింది. మొదటి నుండీ ఆవిడ అలంకరణ విషయంలో నిరాడంబరంగా వుండేది కానీ ప్రస్తుతం ఆమె వేషధారణ దైన్యాన్నీ, మాలిన్యాన్నీ సూచిస్తూంది నన్ను కూర్చోమని చెప్పి, తను మాత్రం పరధ్యానంగా నిలబడిపోయింది. నాకు ఎందుచేతనో నీలిమ మాటల్లో ఆత్మీయత లోపించినట్టు అనిపించింది. ఆ క్షణంలో ఆమె నన్ను పరాయివాడి క్రింద జమ కట్టిందేమోనని అనిపించినా, ఆ భావం పైకి వ్యక్తం కాకుండా పూర్వం ఉండే చనువుతో ఆమెను నా దగ్గిర కూర్చోబెట్టాను. స్నేహపూర్వకంగా నీలిమ తలను చేతితో నిమిరాను. నేను ఏదో చెప్పేలోగా, నీలిమ కళ్లు అశ్రుపూరితములైనాయి. నీలిమ తల్లి దుఃఖాన్ని ఆపుకోవడానికి ప్రయత్నిస్తూ మరోవైపు చూస్తూ వుండిపోయింది. వాళ్ల దయనీయమైన పరిస్థితిని ప్రత్యక్షంగా గమనించిన నా హృదయం ఆర్ద్రమయ్యింది. నా కళ్లలో నీళ్లు నిండాయి వాళ్లలో కూడా ఇదివరకటి ఆత్మీయభావం జాగృతమయ్యింది. నీలిమ నా మోకాళ్ళమీదపడి వెక్కివెక్కి ఏడవసాగింది.

విలపిస్తున్న ఆమె కంఠంలో నుండి అతి కష్టం మీద వెలువడ్డ "బాబాయ్", అనే మాట నా అణువణువులో ప్రతిధ్వనించింది.

ఆమె చాలసేపటి వరకు ఏడుస్తూ వుండిపోయింది. నేను ఆమె తలను చేతితో నిమరసాగాను. నీలిమ తల్లి సజలనయనాలతో నావైపు చూస్తూ "ఆయన పోయిన తరువాత ఇలా తయారయ్యింది" అన్నది.

నేను ఆమె పరిస్థితిని అర్థం చేసుకొన్నాను.

కొంతసేపటికి తేరుకొని నీలిమ కళ్ళు తుడుచుకొంది. తిరిగి స్వాభావిక స్థితికి రావాలని ఆమె చేసిన ప్రయత్నం వ్యర్థమయ్యింది కొంతసేపు మౌనంగా వున్న తరువాత, "బాబాయ్, నీలిమ పిచ్చిదానిలా తయారయ్యిందేమని అనుకొంటున్నారా ?" అన్నది.

"నువ్వు పిచ్చిదానవు కాదు; కానీ ఎదుటి వాళ్లను పిచ్చి వాళ్లను చేస్తున్నావు" అన్నాను నేను వాత్సల్య భావంతో.

ఆమె మారు పలుకలేదు.

"విదుషీమణి, మౌనం వహించింది ఎందుకో ?" అన్నాను నేను రెట్టిస్తూ.

అయినా ఆమె మాట్లాడలేదు.

"నీలిమ ముందు ముందు గొప్ప విదుషీమణి అవుతుంది. అవునా ?"

''ఇక నీలిమ చదవదు బాబాయ్.'' ఈ మాట పొర పాటున అన్నదేమోనని అనిపించింది. ఉన్నట్టుండి ప్రసంగం మారుస్తూ ''అమ్మా, నేను బాబాయికి టీ తెస్తాను'' అంటూ వెళ్లిపోయింది.

నేను నీలిమ తల్లితో మాట్లాడుతున్నంతసేపూ ''నీలిమ ఇక చదవదు'' అనే విషయం నా హృదయాన్ని క్షోభింపజేసింది. నిజానికి ఆమె గొప్ప విదుషీమణి కాగలదు. కాని ఇప్పటి పరిస్థితిలో అది సాధ్యం కాకపోవచ్చును. ఈ సంగతి ఆమెకు తెలియకపోయి వున్నట్లైతే, ఈ విషయానికి అంత ప్రాధాన్యం ఇవ్వవలసి వుండేదికాదు. కానీ ట్రాజడీ ఏమిటంటే, ఈ సంగతి ఆమెకు తెలుసు. అతి చిన్న వయస్సులోనే ఆమె తనను తాను గుర్తించడం నేర్చుకొన్నది. ప్రస్తుతం ఈ ప్రవృత్తి ఆమె జీవితానికి ఒక సమస్యగా పరిణమించింది.

ఆమె టీ తీసుకొని వచ్చింది.

నేను టీ కప్పు వంక పరికించి చూశాను. తిరిగి ఆమె ముఖం వంక చూశాను. రెండిటికీ ఒక పోలిక కనిపించింది. రెండిటి స్వచ్ఛతా, అతిత్వరలో నాశయమౌతుంది. బహుశా ఆ టీ కప్పును చాలాకాలం తరువాత వాడుతున్నారనుకొంటాను.

''నువ్వు కూడా నాతోపాటు త్రాగు అమ్మా'' అన్నాను కప్పు అందుకొంటూ.

ఆమె ఒక్కక్షణం మౌనం వహించింది. తిరిగి ''మీరు త్రాగండి. నేను తరువాత త్రాగుతాను.''

''నాతోపాటు త్రాగకూడదా?''

మరికొంతసేపు మౌనంగావుండి ''ఈ కప్పు కడిగిన తరువాత త్రాగుతాను'' అన్నది.

నా చెయ్యి కంపించింది. వాళ్ల ఇంట్లో రెండో కప్పు లేదన్నమాట. ''ఏమైనా మనం ఇద్దరం కలిసే త్రాగాలి'' అని సగం టీ సాసరులో వేసి సాసరు ఆమెకు అందించాను.

''మీరు త్రాగండి'' అని నా చేతిలో నుండి సాసరు అందు కొని ఒక గ్రుక్కెడు ఆమె కూడా త్రాగింది.

ఆ యింటి పరిస్థితి అధ్వాన్నంగా కనిపించింది. ఒక గోడ బీటలు వేసింది. ఆ యింటి మొత్తం మీద బయటి వరండా మాత్రం కొంత మట్టుకు సురక్షితస్థానంలా కనిపించింది. అక్కడ కూడా పావురాలు, ఇతర పక్షులు గూళ్లు కట్టుకొన్నాయి. నీలిమ తల్లిది జాలిహృదయం. ఆమెకు వాటిని అక్కడనుంచి వెళ్ల గొట్టడం ఇష్టంలేదు. శూన్యమైన జీవితాన్ని గడుపుతున్న ఆమెకు ఆ పక్షులను చూస్తుంటే ఏదో తెలియని తృప్తి కలుగుతుందను కొంటాను.

నెమ్మదిగా వాళ్ల పరిస్థితి మరింత స్పష్టంగా అవగత మయ్యింది. డాక్టర్ హరివంశ తన జీవితకాలంలో ఆస్తిపాస్తులేమీ సంపాదించలేదు. తన కుమార్తె యోగ్యురాలై తనకాళ్ల మీద తాను నిలబడితే చూడాలని ఆయన సంకల్పం. కానీ ముప్పై అయిదవ యేట వివాహం చేసుకొనే వ్యక్తి యొక్క సంతానంతండ్రి సంరక్షణలో ఎక్కువ కాలం వుండబోదని ఆయన ఊహించలేదు.

''బాబాయ్! పురాతన వ్రాతప్రతులువరైనా కొంటారా?'' నీలిమ అకస్మాత్తుగా అడిగింది.

డాక్టర్ హరివంశ్ తాను బ్రతికి వున్నరోజుల్లో దేశం నలు మూలల నుండీ అనేక తాళపత్ర గ్రంథాలు సేకరించిన సంగతినాకు జ్ఞప్తికి వచ్చింది. వాటిని ఆయన తన అమూల్య సంపదగా భావించే వారు. అకస్మాత్తుగా మరణించి వుండకపోతే ఆయన వాటిని నిస్సందేహంగా ఏ గ్రంథాలయానికో బహూకరించి వుండేవారు. కాని ఇప్పటి పరిస్థితివేరు. ఆ కుటుంబానికి ఇప్పుడు గౌరవం కన్న, డబ్బు అవసరమే ఎక్కువ.

''ప్రయత్నించవచ్చు. గ్రంథాలయాలలో అడిగి తెలుసు కొంటాను'' అన్నాను నేను

''అమ్మ వాటిని చిత్తు కాగితాలవారికి అమ్ముతానంటుంటే నేనే అమ్మనివ్వలేదు.''

' చిత్తుకాగితాలుగానా ?'' నా హృదయానికి మరొక దెబ్బ తగిలింది. వాళ్లపరిస్థితి మరింత వాస్తవికంగా, నా కళ్లకు కట్టి నట్లయ్యింది.

''చిత్తుకాగితాల క్రింద అమ్మితే ఏం వస్తుంది? ఇవిపొట్లాలు కట్టడానికి కూడా పనికిరావే ?''

''చిత్తుకాగితాలవారు మణుగు మూడు రూపాయల చొప్పున కొంటారు. మొత్తం అన్నీకలిసి సుమారు ఒకటింపావు మణుగుల బరువు వుంటాయి.''

కొన్ని శతాబ్దాల పరిశ్రమ, ప్రతిభకు తార్కాణమైన వీటిని సంపాదించడానికి ఎన్నో సంవత్సరాలు పట్టింది. వీటిని మూడున్నర రూపాయలకు అమ్మబోతున్నారన్న ఊహతట్టగానే హృదయం కంపించింది.

''వేరే ఎవరైనా కొంటారేమో, అడగలేదా ?''

''గుళ్లో వున్న పూజారిగారికి ఈ గ్రంథాలన్నీ చూపించాము. ఆయన శ్రీమద్భాగవతం రెండు రూపాయలకు తీసుకొని, మిగతావి తనకు పనికి రావని అన్నారు. ఆయనే ఈ పుస్తకాలన్నీ యాభై అరవై రూపాయలకిమ్మత్తు చేస్తాయని చెప్పారు.''

''అంత డబ్బు వస్తుందా ?'' నీలిమ తల్లి అడిగింది. ఆమె స్వరంలో నిరాశ ధ్వనించింది.

''ఏ దైనా గ్రంథాలయానికి అమ్మితే ఇంకా ఎక్కువ మొత్తం వస్తుంది'' అన్నాను నేను. ఆమె కళ్లలో ఆశాకిరణం తళుక్కుమన్నది.

సంధ్యా సమయం కావస్తోంది. నేను చివరి బస్సుకు వెళ్లాలి. వాళ్లదగ్గర సెలవు తీసుకొనేటప్పుడు ఇద్దరి కళ్ళలోనూ మళ్లా నీళ్లునిండాయి. నేను నీలిమతో ''అమ్మా, నా వెంటరా, నిన్ను చదివిస్తాను. నాన్నగారు ఆశించినట్టుగా నిన్ను గొప్ప విదుషీమణిగా చేస్తాను'' అని అనాలని అనుకొన్నాను. కాని భవిష్యత్తుకు చెందిన దృశ్యాలు నా కళ్ల ముందు మెదిలాయి. నీలిమను చదివిస్తే సరిపోదు. ఆమెకు వివాహం చెయ్యాలి. నా కుమార్తె వివాహానికి నేను చేసిన అప్పులు తీరడానికి ఇంకా చాలా సంవత్సరాలు పడుతుంది. నేను కూడా ముసలివాణ్ణి అయ్యాను. నా పెన్షను అరవై రూపాయలు. అదీగాక నా భార్య స్వభావం అంత మంచిది కాదు.

వెళ్లే ముందు ఇలా అన్నాను ''అమ్మా, నాకు గ్రంథాల పట్టిక తయారుచేసి పంపు. నేను వివరాలు తెలుసుకొని నీకు ఉత్తరం వ్రాస్తాను.'' నా కళ్ల వెంబడి అశ్రు బిందువులు జారి పడ్డాయి.

నేను జలంధర్ తిరిగి వచ్చాను. సుమారు వారం రోజుల తరువాత నాకు నీలిమ దగ్గరనుండి ఉత్తరం వచ్చింది. దానిలో తాళపత్రగ్రంథాల పట్టిక ఇవ్వబడింది. ఆ పట్టికలో సుమారు వంద గ్రంథాలు వున్నాయి. నేను ఆ పట్టికను ఒక సంస్కృత పండితునికి చూపించాను. ఆయన వాటిలో కొన్ని గ్రంథాలు అమూల్యమైనవనీ, సుమారు పది పుస్తకాలకు సంబంధించిన ప్రతులు అసలు దొరకడమే దుర్లభమనీ తెలియజేసాడు.

నా హృదయం ఆనందంతో పులకించింది. ఈ గ్రంథాలకు అయిదారు వందలరూపాయలు దొరికితే, ఆ కుటుంబానికి కొంత ఆదాయం దొరుకుతుంది. నేను ఆ సంస్కృత పండితుని ఆదేశాను సారం దేశంలోని వివిధ గ్రంథాలయాలకూ ఉత్తరాలు వ్రాసాను. ఆ గ్రంథాల పట్టికల తాలూకు నకళ్లు వాళ్లకు పంపించాను.

రెండు మూడు వారాలవరకు జవాబు రాలేదు. నాకు నిరాశ కలిగింది.

ఒకరోజున ప్రాంతీయ పబ్లిక్ లైబ్రరీ నుండి ఉత్తరం వచ్చింది. శిథిలావస్థలో లేనిపక్షంలో ఆ గ్రంథాలన్నిటినీ, రెండువేల రూపాయలకు తీసుకోవడానికి అంగీకరించారు.

రెండువేల రూపాయలు! నీలిమ విదుషీమణి రూపంలో నా కళ్ల ముందు సాక్షాత్కరించింది. ఈ మొత్తంతో ఆమెచదువుతో పాటు పెళ్లి, సుఖప్రదమైన జీవితం...............

మొదట అంగీకార సూచకంగా వెంటనే జవాబు వ్రాయాలను కొన్నాను. ఇంకా ఎవరి దగ్గర నుండి అయినా ఉత్తరాలు వస్తాయేమో, ఇంకా ఎక్కువ మొత్తం దొరుకుతుందేమోనని ఆలోచించి వూరుకొన్నాను.

పెద్ద పెద్ద గ్రంథాలయాలన్నిటికీ రెండవ సారి ఉత్తరాలు వ్రాసాను. ఒకరిద్దరినుండి అవసరం లేదని జవాబు వచ్చింది. బొంబాయికి చెందిన ఒక గ్రంథాలయంవారు నేనుపంపిన జాబితాలో కొన్ని గ్రంథాలు మాత్రమే కావాలనీ, వాటికి డెబ్బై యనభై రూపాయల వరకూ ఇవ్వగలమనీ వ్రాసారు. ఆ తరువాత మరెవ్వరి దగ్గర నుండీ ఉత్తరాలు రాలేదు. నేను ఆ గ్రంథాలన్నిటినీమొత్తంగా రెండువేల రూపాయలకు ఇవ్వాలని నిశ్చయించాను.

ఈ విషయం తెలియజేస్తూ గ్రంథాలయం వారికి ఉత్తరం వ్రాసిన రెండు మూడు రోజులకు నీలిమ దగ్గర నుండి ఉత్తరం వచ్చింది. తాళపత్ర గ్రంథాలన్నిటినీ అమ్మేశారట. పూజారిగారు తనవెంట ఎవరో పండితుణ్ణి తీసుకొనివచ్చి వాటిని మొదట వందరూపాయలకు ఇవ్వమని అడిగారట. నెమ్మదిగా బేరం రెండు వందల వరకూ వెళ్లిందట. ఆయన అంత మొత్తం ఆ కుటుంబం యెడల గల సానుభూతితో మాత్రమే ఇస్తున్నానని చెప్పారట.

నీలిమ ఆ ఉత్తరంలో ''ఇంతకన్నా ఎక్కువ వస్తుం దంటారా బాబాయ్?'' అని అడిగింది. నేను కొంతసేపు ఆమెకు ఏమని జవాబు వ్రాయాలని తలపట్టుకొని కూర్చున్నాను.

ఆ తరువాత రోజు నేను ఆమెకు జవాబు వ్రాసాను. ఉత్తరంలో ఆ గ్రంథాలు రెండువేల రూపాయల ఖరీదు చేస్తాయని మాత్రం తెలియ పర్చలేదు. ఉదాసీనమైన ఆమె జీవితంలో లభించిన స్వల్పమైన ఆనందాన్ని అణచి వేసేందుకు సాహసించ లేకపోయాను.

నీలిమ సంరక్షణా భారం నేనే వహించాలని మళ్లా నాకు అనిపించింది. నా భార్యా, వృద్ధాప్యం, వీటి సంగతి ఎలా వున్నా వెంటనే ఆమెను నా దగ్గరకు తీసుకురావాలి .........

కాని అది సాధ్యం కాలేదు.

అనువాదం : శ్రీ బి. వి. రమణ



# కాలసముద్రతీరంలో శిథిల హృదయారామం

## మ హే ం ద్ర

అది ఆనంద సముద్రం
నీరెండలో తీరాలనుండి పడవలు కడలిలోకి అడుగిడుతున్నాయి
రాత్రులు వీచిన గాలుల చల్లదనాన్ని నెమరేసుకుంటూ సరుగుడు చెట్లు ఊగుతున్నాయి
బిందువుగా దూరాన
ఆనంద సింధువు తీరాన
తొలినాటి వైభవాన్ని తలపోసుకుంటూ సముద్రతీర దేవాలయం —
గోపురాలపై కిరణాలు,
ద్వారాలకు పవనతోరణాలు,
పడికెట్లకు తరంగ మంజీరాలు — ఓహో !
ఆలయం ఆపాదమస్తకమూ పులకించిపోతోంది
కాలహయపు హేషవలె సముద్రపు ఘోష
గుడిగోడల ఊగులాడు గతకాంతుల డాలు
గగనాల గాలులలో పక్షుల సంకీర్తన
సాగరాల తీరాలలోన భిక్షుల సంవేదన

★ ★ ★

ఈద్వార బంధంపై అలదిన పసిమి వలయంలో కుంకుమ బొట్టై మిలమిల మెరిసిన సూరీడు
కాలపు గూడులో సాలీడుకు ఆహారంగా చిక్కాడు మిణుగురు పురుగై నేడు
ఈ శివాలయపు జటాజూటంలో ముడిచిన చంద్రకాంత పుష్ప విలాసిని
సామీప్య సైకత భూములలో ఏడ్చీ ఏడ్చీ ఇప్పుడే పడుకుంది —
తరుక్కుపోయిన గుండెతో, కాళ్ళను డొక్కలోకి ముడుచుకుని
గాలులు కాలు కాలిన పిల్లులై వెలుపలికి లోపలికి తెగతిరుగుతున్నయ్
అలలు పిచ్చి పట్టిన కుక్కలై దిక్కులు జూస్తూ తెగమొరుగు తున్నయ్
ఏ మంగళ నాదస్వరాలతో మేల్కొల్పబడ్డ ఈ ఆలయం
నేడు ఈదరగాలిచే పదేపదే చెంపదెబ్బలు తింటోంది లేవడానికి
మాటి మాటికి వెనక్కి తిరిగి జూస్తూ
వెనక్కి దిరిగి వెళిపోతున్నాడెవడో దిక్కు గాలిన కవి
కన్నీరై జారిన బాధను కొనగోటితో మీటి — ఏదో రాగం విని జలదరించిపోయాడు.

అనంతమయిన జలధిలోని అలలారా !
అనాదిగా నరుడు గన్న కలలారా !
ఈ తీరపు సితారుపై ఉషస్సార మీటుతున్న చ్యుతి నెరుగని ఆ రాగం చెవులారగ విన్నారా !
నా హృదయారామపు రక్తకుడ్య తలాలపై అవిరామంగా నర్తిస్తున్న వీచికలను కన్నారా !
ఆ అస్పష్టపు అమరభావ గీతికలకు వ్యాఖ్యానం జేస్తారా ! తాత్పర్యం చెబుతారా !

★ ★ ★

అది గదిగో ఆ చక్రం నిలిచిపోదు
చైతన్యపు ఆ స్రవంతి ఇంకిపోదు
వీస్తున్న గాలి రేపుతున్న కిరణకేశాల్ని
సరిజేసుకుంటూ దిగంతరేఖపై కాలూనుకుని
నిక్కి నిక్కి నిల్యోత్సాహంతో చూస్తున్న అనాదిరేడు ఆదిత్యుడు
అన్నీ అస్థిరమయిన ఈ జగతిలో అస్మదీయుల అనుబంధమే స్థిరమంటున్నాడు —
సముద్రంతో, సముద్రతీర దేవాలయంలోని అనాథునితో.

తొలినాళ్ళు గడచిపోయె — తొలి ప్రాభవమింకిపోయె
అభిషేకము అరుదైనా నైవేద్యము కరువైనా
ఆనంద ముద్రతో అనంత సాగరాన్ని చూస్తున్నాడొక మూర్తి
తరతరాల జనావళికి యిస్తున్నాడొక స్ఫూర్తి

★ ★ ★

నిశీథి అంతా నిశ్శబ్దం — నిందిస్తున్నది సముద్రఘోష
నిదురిస్తున్న జగతి నెదిరిస్తూ, ఉదయం ఎంతోదూరం లేదని బెదిరిస్తూ
వేయి వేల అలలతో తీరాలను కొట్టికొట్టి, గుక్కపట్టి అరుస్తున్న సముద్రం
ప్రత్యూష వేళా సమాగమానికి నాంది పలుకుతోంది.
శుభోదయం సమీపిస్తోంది
గతకాలపు పొరలనుంచి దారితప్పి వచ్చిందొక సుప్రభాతగీతిక.



శ్రీ పి. వి. పరబ్రహ్మశాస్త్రి

# ఆంధ్ర-కర్నాటకము

ఆంధ్ర–కర్నాటక రాష్ట్రముల మధ్య సరిహద్దు ప్రాంతము కడు విస్తారమైనది. ఉత్తరమున బిదరుకోటనుండి దక్షిణమున మదనపల్లిని దాటి కొంతవరకు ఈ రెండు రాష్ట్రాలు దాదాపు 1500 కిలోమీటర్ల పొడవున కలిసియున్నవి. ఇంత పొడవైన సరిహద్దు ప్రాంతములో నిరువైపుల బీదరు–మెదకు, గుల్బర్గా–రంగారెడ్డి (జిల్లా), రాయచూరు–మహబూబునగరం, బళ్లారి–కర్నూలు తుంకూరు–అనంతపురము, బెంగుళూరు, కోలారు – చిత్తూరు అను 13 జిల్లాలున్నవి వీటిలో ఉత్తరమున కొద్దిప్రాంతము మహారాష్ట్రముతోను, దక్షిణమున కొంత తమిళముతోను సంబంధము కలిగియున్నవి. మధ్యనుండు జిల్లాలలో ఆంధ్ర–కర్నాటక సమ్మిళితమైన విశిష్ట సంస్కృతి యొకటి వ్యక్తమగుచుండును. దీని స్వభావమును గూర్చి తెలుపుటయే యీ వ్యాసముయొక్క ముఖ్యోద్దేశము. ఆంధ్ర–కర్నాటక రాజకీయ, సాంస్కృతిక సంబంధములను గూర్చి లోగడ డా. నేలటూరి వెంకటరమణయ్యగారు,[1] శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు,[2] డా. మారేమండ రామారావుగారు[3] మున్నగు విద్వాంసులు విపులముగ చర్చించియుండిరి. శ్రీ నిడుదవోలువారు సారస్వత దృష్టితోను, మారేమండవారు రాజకీయదృష్టితోను మొత్తము ఆంధ్ర, కర్నాట రాష్ట్రములకు గల సంబంధమును వివరించిరి· నేలటూరివారు కేవల కర్నాటమును గూర్చి చర్చించిరి· చరిత్రను తెలియగోరువారికి విషయము ఆసక్తి కరముగ నుండును గనుక పైవారు చెప్పిన విషయములలో కొన్ని ముఖ్యాంశముల నిచట వ్రాయుచుంటిని.

## ఆంధ్రము

ఆంధ్రపదము జాతివాచకముగ అతి ప్రాచీనముగ తెలియుచున్నది. దేశ వాచకముగను, భాషాపరముగను దాని వాడుక అర్వాచీనమని తెలియుచున్నది. క్రీ. పూ. 3వ శతాబ్దినాటి అశోకుని శిలాశాసనములందు 13వ దానిలో ఆంధ్రులు, పులిందులు భిన్న జాతుల ప్రజలుగ జెప్పబడిరి. ఈ ప్రజలుండెడి ఆనాటి ప్రాంతమును గూర్చి అభిప్రాయభేదములు గలవు. వింధ్యప్రాంతములనుండి దక్షిణము కృష్ణానది ప్రాంతమువరకు గల దక్షిణాపథములోనే ప్రత్యేక విభాగములో ఆ ప్రజలుండెడివారో నిర్ణయముగ తెలియకున్నది. అశోకుని శాసనములందు చోడ, పాండ్య, సాతియపుత్ర, కేరళపుత్ర, తామ్రపర్ణి అని రెండవ శిలా శాసనంలోను; చోడ, పండ, తంబపణీయులను పత్యన్త దేశవాసులుగను, ఆంధ్ర–పులిందులను స్వవిషయములోని వారినిగను 13వ శిలాశాసనములో జెప్పబడిరి. కలింగదేశ ప్రసక్తి మూడు, నాలుగు శాసనములలో వచ్చును. పై వాటిలో తాంబ్రపర్ణి సింహళమును, కేరళపుత్ర, సాతియపుత్ర అనునవి మళయాళ దేశమును తెలుపుచున్నవి. కళింగము తరువాత బేర్కొనిన ప్రాంతములలో చోళ, పాండ్య, కేరళ, సింహళములు గాక ఆంధ్ర ప్రాంతము లేక జాతి మాత్రమే. అశోకుని శాసనాలు కర్నూలు జిల్లాలో జొన్నగిరి (సువర్ణగిరి), రాజులమండగిరి, రాయచూరు జిల్లాలో–మస్కి, కొప్పల్లు, బళ్లారి జిల్లాలో నిట్టూరు మొదలైనచోట్ల కనుపిస్తున్నవి. కాని ఆనాడీ ప్రాంతము నేమనెడివారో చెప్పలేదు. ప్రస్తుత కర్నాటకమునకు ప్రాచీన కాలమందున్న కుంతలమనుపేరు ఆ శాసనములలో కానరాదు. కనుక కళింగమునుండి యీ శాసనములున్న ప్రాంతము వరకుగల దేశ విభాగమంతయు అంధ్రపదముతోటే ఆనాడు గ్రహింపబడెడిదా అను సంశయము గలుగుచున్నది. కర్నూలు నగరముకుండ ప్రవహించు హంద్రి యను నది పేరు అంధ్రి యొక్క రూపాంతరముగ దోచుటకూడ గమనించదగిన విషయము. గోదావరి-కృష్ణల నడిమి దేశము అంధ్రదేశమై యుండునను విషయమును పలువు రంగీకరించిరి ఇటీవల కరీంనగరు జిల్లాలో దొరికిన మొదటి సాతవాహన, సాతకర్ణి, సిముకుడి నాణెములనుబట్టికూడ తెలంగాణము ఆంధ్రజాతీయుల మొట్టమొదటి స్థావరమను విషయము రూఢియగుచున్నది.[3a] రెండవ పులుమావియొక్క శాసన మొకటి ఆదోని ప్రాంతపు మేకదొని గ్రామములో లభించెను. అందా ప్రాంతము సాతవాహనిహారమని బేర్కొనబడెను.[3b] అట్లే నందికోట్కూరు తాలూకాలో సాతానికోట (సాతవాహనకోట)యను నొక ప్రాచీన స్థలము సాతవాహనుల కోటను తెలుపుచున్నది. ఇంకను కుంతల స్వాతికర్ణుడను పేరుగల సాతవాహన రాజొకడు పురాణములందును, వాత్స్యాయన కామసూత్రము అందును చెప్పబడియుండుటచే నారాజు కుంతల దేశముతో నధిక సంబంధము కలవాడై యుండునని పలువురు విద్వాంసుల యభిప్రాయము. పర్యవసానముగ తేలిన విషయ మేమన సాతవాహన రాజులలో కొందరైనను కర్నూలు, బళ్ళారి, రాయచూరు, గదగు, బిజాపూరు,ధార్వారుజిల్లాలున్న ప్రదేశమునుగూడ నేలుచుండెడివారని. గౌతమీపుత్రసాతకర్ణి, యజ్ఞశ్రీసాతకర్ణి, వాసిష్ఠీపుత్రసాతకర్ణి, శివసాతకర్ణి, చండసాతకర్ణి, మున్నగు 'కర్ణి' పదము తుదియందున్న సాతకర్ణిరాజులు

పాలించిన క్రొత్తరాజ్య భాగముగుట వలన ముఖ్యముగ కర్నూలులోని శ్రీశైల ప్రాంతమునకు 'కర్ణినాడు' 'కర్నాడు' 'కన్నాడు' అను పేర్లు వచ్చి యుండునని చెప్పవీలగుచున్నది. అశోకునిశాసనములలో ఈ దేశ విభాగము ప్రత్యేకించి యేపేరుతోను జెప్పబడక పోవుటయేగాక, ప్రస్తుత కర్నాటకము కడపటిసాతవాహనుల నాడు కుంతలమనియే గాని కర్నాటకమని పిలువబడకుండుట పై యభిప్రాయమునకు ప్రోద్బలకములు. అనగా అశోకుని నాటి ఆంధ్రభాగములో నంత ర్భాగమైన శ్రీశైల దక్షిణప్రాంతము సాతవాహనులు లేక సాతకర్ణి రాజుల మూలమున కర్నాడు లేక కన్నాడు అని వ్యవహరింపబడుచు వచ్చెను. ఇదంతయు తెలుగు కాని కన్నడముకాని వాడుక భాషలుగా రూపొందని నాటి విషయము.

సాతవాహనుల పతనానంతరము వారి సామ్రాజ్యమంతయు సామంతుల పరమై చిన్న రాజ్యములనేకము పుట్టెను. అప్పుడీ కర్నూలు, బళ్ళారి ప్రాంతములో సామంతులైయున్న చుటుకులము నకు చెందిన చుటుకులానందసాతకర్ణి, అతని సంతతివారు సాత వాహనులకు బంధువులు సామంతులు నైయుండి వనవాసి ప్రాంత ములో స్వతంత్రులైరి. వీరితోబాటు కర్నాడు దేశనామము కూడ పడుమటికి వ్యాపించెను. పల్లవ శివస్కందవర్మయొక్క నాలుగవ శతాబ్దమునాటి హిరహడగల్లి తామ్రపట్టికలో కర్నూలు, బళ్లారి ప్రాంతములు సాతాహనిరట్టము, (సాతవాహనరాష్ట్రము) అని పేర్కొనబడెను.[4] అనగా పల్లవుల రాజ్యవిభాగములో నీ ప్రదేశము సాతవాహనరాష్ట్రమనబడినను జనులవాడుకలో కన్నాడనియే పిలువ బడెడిది. ఆ కాలపు ప్రాచీన పల్లవుల శాసనాల్లో మరికొన్ని దేశ విభాగాలు పేర్కొనబడియున్నవి. శివస్కందవర్మయొక్క మైద వోలు శాసనములో ఆంధ్ర పథము దానిముఖ్య నగరము ధనకటకము (ధరణి కోట)[5]; యువ మహారాజు విష్ణుగోపవర్మయొక్క మాంగలూరు శాసనములో వెంగోరాష్ట్రము (వేంగిరాష్ట్రము నానుకొనియున్న దక్షిణదేశమని గోపాలాచార్యులుగారుచెప్పిరి);[6] ఆ రాజుయొక్క ఉరువపల్లి శాసనములో ముండరాష్ట్రము[7] (నెల్లూరు మండలములో కొంతభాగము) పేర్కొనబడెను. అంటే యిప్పటికి గాని పరిపాలనా విభాగాలు కొన్ని తెలియవచ్చుటలేదు. ఇక్ష్వాకుల జగ్గయ్యపేట శాసనములో కమ్మరాష్ట్రము చెప్పబడు తుంది[8] పల్లవుల శాసనాల్లో కనుపించే రాష్ట్రవిభాగములన్ని ఆంధ్రజాతి ప్రజలు నివసించే భూమియని చెప్పజాలము.

తెలుగుభాష కృష్ణకు దక్షిణము వైపుననే మొదట ప్రారంభమయ్యెననియు అది ఆంధ్రుల సంపర్కమువలన ఉత్తరము నకు వ్యాపించియుండుననియు నీ మధ్య శ్రీ వేదము వెంకటరాయ శాస్త్రిగారు తెలుగు పదెనరు" అను పరిశోధకవ్యాసములో కొంత చర్చించి సయుక్తికముగ నిరూపించిరి. వారిమతానుసారముగ ఆంధ్రులు తెలుగును వాడుక భాషగా స్వీకరించినది కారణముగ ఆ భాషకు ఆంధ్రము, తెలుగు అనురెండు పేర్లేర్పడెననియు, దానిని బట్టి ఆ భాష మాట్లాడేవారున్న దేశమునకు కూడ ఆరెండుపేర్లు వచ్చెననియు చెప్పవలెను. అంటే తెలుగు మాట్లాడే దేశంలో కళింగము, మార్జవాడి, పొత్తపినాడు, రేనాడు, తొండమండలము మొదటినుండి ఆంధ్రములో చేరినవికావని తెలియుచున్నది. కర్నాడు: తెలుగుభాషకాని కన్నడ భాషగాని వాడుకభాషకానప్పుడే కర్నూలు మండలమును సాతకర్ణిరాజులను బట్టి కర్నాడు లేక కన్నాడని పిలి చెడి వారని తెలిసికొంటిమి ఇది సాతవాహనరాష్ట్రములోనిదని పల్లవులుచెప్పిరి. క్రీ. శ. 5వ శతాబ్దిలో కన్నడము వాడుక భాష కాజొచ్చెను. దానికాపేరు కూడ సాతకర్ణిరాజులు, చుటుకుల సాతకర్ణులు యేలినదేశములోని భాష కనుకనే వచ్చియుండును. కన్నడ శబ్దము భాషావాచకముగ కడుప్రాచీనముకాదని విద్వాంసులు చెప్పుదురు. కర్నూలు బళ్లారి మండలములలో గూడ నా భాషయే మొదట యుండెను. నూరు, నూటేబది సంవత్సరముల తరువాత తెలుగు కూడ నొక ప్రాంతీయభాషగ రూపొందుట మొదలయ్యెను. అప్పటికే యీ ప్రాంతములో స్థిరపడిన తెలుగు – కన్నడ లిపి రెండుభాషలకు సమానమయ్యెను. కొద్ది భేదముతో రెండుభాషలు వాడుకలోనికి వచ్చెను. కర్నాడు దేశములో వాడుకయైన ఈ రెండు భాషలకు ఒకటే పేరువచ్చెను. ఆ ప్రజలకు కూడ కర్నాటి వారనే వాడుకయయ్యెను. అంటే పూర్వము మహారాష్ట్రీ ప్రాకృతమును మాట్లాడే ప్రజలుండే దేశంలో ఇప్పుడు మాట్లాడే మరాఠి భాషకు కూడ ఆ పేరేవచ్చినట్లు కర్నాడులో మాట్లాడు రెండు భాషలకు కర్నాట భాషయని పేరువచ్చియుండును. ఈ విధంగా అక్కడ మాట్లాడే తెలుగుకు కూడ కర్నాటభాషయను వాడుకయేర్పడి యుండును.

శాసనాల్లో కర్నాడ లేక కన్నాడను పదము ఏ ప్రదేశమునకు వాడబడుచుండెనో పరిశీలించెదము. (1) బాదామిచాళుక్యరాజగు మొదటి విక్రమాదిత్యుని (క్రీ.శ 655-681) హైదరాబాదు తామ్రపట్టికలు కణ్ణనాడులోని చింతకుంటయను గ్రామమును దానము చేసినట్లు తెలుపుచున్నది. ఈ గ్రామము ఇప్పటి మార్కా పురంతాలూకాలోనిదిగా గుర్తించబడెను[9] కళ్యాణిచాళుక్యుల శాస నాలు సుమారు పదిదాక ఈ కన్నెనాడును పేర్కొను చున్నవి. చాళుక్యభువనైక మల్లుడి శాసనము క్రీ. శ. 1074 నాటిది బిజ్జ చోళ మహారాజు కన్నెనాడు మూడు నూరుల మండలమునేలు చున్నట్లు చెప్పుచున్నది.[1] డా గయ్‌గారు దీనిని ప్రచురించుచు కన్నెనాడు ప్రస్తుత నంది కొట్కూరు తాలూకాలోనున్నట్లు చెప్పిరి. అందువారు త్రైలోక్య మల్లసోమేశ్వరుని క్రీ శ. 1057 నాటి శాసనములో కూడనట్లే యున్నదని చెప్పిరి.[11] అలంపురములో సుమారు ఆరుశాసనాల్లో కన్నెను న్నూరు అనునాడులో కొన్ని గ్రామ ముల దానము చెప్పబడుచున్నది. ఇవి అన్నియు శ్రీశైలము క్రింద కృష్ణ వెంబడి యెగువగా మున్నవి.[12] క్రీ. శ. 1313 నాటి

కాకతి ప్రతాపరుద్రుని శ్రీశైలశాసనము అచటి అరిసిమరము, యడమఠములకు కర్నాటిసీమలో 17 గ్రామముల దానమును మరి కొన్ని సీమలలోని దానములను ధ్రువపరచుచు వ్రాయించబడెను.[13] వీటిలో కర్నాటములో జెప్పబడిన 17 గ్రామాలు కర్నూలుజిల్లాలోని నంది కోట్కూరు తాలూకాలోను, నంద్యాల తాలూకాలోను గుర్తించబడినవి. కాకతిప్రతాపరుద్రుని సామంతుడు చెరకు మహేశ్వరరెడ్డి వేల్పునూరులో శాసనమువేయించుచు తాను కన్నాడును పాలించుచున్నట్లు వ్రాసుకొనెను. ఇది నందికొట్కూరు తాలూకాలోనిది.[14] విజయనగర చక్రవర్తియైన సదాశివరాయల సామంతుడు అనంతరాజు నరసరాజు క్రీ. శ. 1563లో కర్నాట సీమలోని మిడుతూరు గ్రామమును దానము చేసినట్లు చెప్పబడెను.[15] ఈ మిడుతూరు నందికొట్కూరుతాలూకాలో నున్నది. కృష్ణ, తుంగభద్రలు కలియుచోట నున్న సంగమేశ్వర క్షేత్రములో శకవర్షము 1107 నాటి (క్రీ. శ. 1185) శాసన మొకదానిలో కన్నాటి గోకర్ణ దేవమహారాజు పేర్కొనబడును.[16] ఇతను కందూరు గోకర్ణ చోడరాజు కాడు. ప్రక్కనే యున్న కర్నాటినేలు వేరొకరాజు. ఇట్టి శాసనాధారములను బట్టి కర్నాడు, కన్నాడు, కన్నె–మున్నూరు, కర్నాటిసీమ అనుపేర్లన్నియు ప్రాచీన కాలము నుండి కన్నడను, తెలుగు వాడుక భాషలుగా రూపొందని. నాటి నుండి మార్కాపురము తాలూకా, గిద్దలూరు తాలూకా, నందికొట్కూరు, నంద్యాల తాలూకాలలో వ్యాప్తమైయున్న భూభాగములో కొద్ది మార్పులు చెందుతూ కొంత భాగమునైనా తెలుపుచు వచ్చుచుండెను. గిద్దలూరు తాలూకాలో తురుమర విషయమనే విభాగమొకటి మొదటి విక్రమాదిత్యుని తురుమెళ్ళ శాసనంలో కనుపిస్తుంది. ఆ ప్రాంతానికే యేఱువ విషయమనే పేరు తరువాత ప్రసిద్ధమైయున్నది. కనుక మార్కాపురం, గిద్దలూరు తాలూకాలు కర్నాడులో చేరి యుండుట కొంతకాలమే కావచ్చును. శ్రీశైలము క్రింద దక్షిణ–పశ్చిమముగ నంద్యాల, నందికొట్కూరు తాలూకాలు మాత్రమెల్లప్పుడు కర్నాటిసీమగనే శాసనములలో చెప్పబడుచుండెను.

చారిత్రకముగా ఆంధ్ర–కర్నాట సరిహద్దుగా జెప్పబడిన ప్రదేశమంతయు అశోకుని కాలములో, సాతవాహనుల కాలములోను, కదంబులకాలములోను, బాదామిచాళుక్యుల కాలములోను, రాష్ట్రకూటులకాలములోను, కల్యాణిచాళుక్యుల కాలములోను క్రీ. శ. సుమారు 1200 వరకు తూర్పుకోస్తాలో రాజ్యము చేసినతూర్పు చాళుక్యుల యధీనములోగాక ప్రస్తుత కర్నాటరాష్ట్రములో వర్ధిలినపై రాజవంశముల యధీనములోనే యుండెను. కర్నాటసీమ మొదటిసారిగ కాకతీయులు, హొయ్సలలు, దేవగిరి యాదవరాజుల కాలములో క్రీ. 1200 తరువాత తెలుగు ప్రాంతము, కన్నడ ప్రాంతము నుండి వేరుచేయబడెను. సుమారు 125 సంవత్సరములు జరిగిన పిదప క్రీ. శ. 1335లో విజయనగర రాజ్యస్థాపనయూ ప్రాచీన కర్నాటము ప్రక్కనే విజయనగరములో జరిగెను. అప్పటి నుండి మరల కృష్ణకుదక్షిణమునగల తెలుగుదేశమంతయు కర్నాటరాజ్యమయ్యెను. ఒంగోలు తాలూకాలో ఇమ్మడిదేవరాయల శాసన మొకటి క్రీ. శ. 1442 నాటిది ఉదయగిరి దుర్గము కర్నాట రాజ్యములో చేరియున్నట్లు చెప్పబడెను. ఆ రాజులను తెలుగు కవులు కర్నాటరాజులనే చెప్పిరి. వారి రాజ్యమును కన్నడ రాజ్యలక్ష్మియని పొగడిరి. కవి సార్వభౌముడైన శ్రీనాథ మహాకవి తన కవిత్వమును గూర్చి భీమేశ్వర పురాణములో [ఆ. 1] ఈ విధముగ జెప్పుకొనెను.

గీ॥ ప్రౌఢి పరికింప సంస్కృత భాషయంద్రు,
పలుకు నుడికారమున నాంధ్రభాషయంద్రు,
ఎవ్వరేమన్న నంద్రుగాకేమి కొరంత
నా కవిత్వంబు నిజము కర్ణాట భాష.

ఈ పద్యమును బట్టి తెలుగు వారు విస్తుపోతారు.[17] నిజమున కంత ఆశ్చర్యపడవలసిన పనిలేదని పిస్తుంది. ఇప్పటివరకు తెలిసిన చరిత్రలో కాకతీయులనాడొక నూటపాతికేండ్లు తప్ప మరి యేకాలములోను పైజెప్పిన కర్నూలు మండలములోని కర్నాటి సీమ కోస్తాప్రాంతపురాజ్యములో కలిసిలేదు. తుదకు బ్రిటిషు వారి హయాములో కూడ అది బళ్ళారిజిల్లాతో కలిసియేయుండెను. చరిత్రలో మరొక విచిత్రము జరిగెను. విజయనగరరాజులు కన్నడమునకు తెలుగునకు సమానమైన ఆదరణము చూపుటవలనను, రాజధానియగు విజయనగరము తెలుగు మాట్లాడు దేశ సరిహద్దులో నుండుట వలనను అది వరకు తెలుగు మాట్లాడే దేశములో చేరనట్టి అనంతపురము, బళ్ళారి జిల్లాలలోని పశ్చిమ భాగమంతయు హొస్పేటదాక తెలుగు మాట్లాడే ప్రాంతంగా మారింది. ఈ ప్రాంతములో తెలుగు శాసనాలు అంతకుముందువి కనుపించవు. ఈ మార్పు రాయల కాలములో వచ్చినదే. అతి ప్రాచీనమైన తెలుగు శాసనాలున్న రేనాడు కూడ నిచటనే కలదు. కడప, కర్నూలు, అనంతపురం, బళ్ళారి, చిత్తూరులో కొంత భాగం కలిసిన కర్నాటసీమ, రాయలసీమగా ప్రసిద్ధమైంది. తెలుగు మాట్లాడే యింత పెద్దభూభాగం విజయనగర రాజధానినగరము ప్రక్కనే యుండి ఆ రాజుల ఆదరాభిమానాలకు నెలవైయున్న కారణంచేత చక్కని తెలుగు అచట పెంపొందింది. కోస్తావారు తెలుగును ఆంధ్రమని వ్యవహరించినట్లు రాయలసీమవారు అచటి తెలుగును కర్ణాటభాషయని చెప్పుకొనేవారు. దీనికింకొక కారణం కూడ కలదు. ఇచటి ప్రజలలో నధికభాగము కన్నడమును కూడ బాగుగ మాట్లాడువారు. నిజమునకు రెండుభాషలకు అక్షరములు ఒక్కటే, సంస్కృత తద్భవములు సమానము, లిపి యొకటే, రెండు భాషలను మాట్లాడు వారొకరే, రాజకీయముగ నొకే ప్రాంతములో నున్నారు, సాంస్కృతికముగ నొకే ఆచారము, పండుగలు, వివాహాది సంబంధాలు, ఆహారాదులు అన్నియు సమంగా

నున్న ఈ ప్రాంతము వారి తెలుగును ఆనాడు కర్నాటి తెలుగని వ్యవహరించేవారు. కన్నడము నుండి మొట్టమొదట విడిపోయి వాడుకభాషగా తెలుగు రూపొందింది కూడ ఈ పొడవైన తెలుగు కన్నడ సరిహద్దులోనే ఈ రెండు భాషలు ద్రవిడభాషాకుటుంబము నకు చెందినవైనా రెంటికి సంస్కృత, ప్రాకృత సంబంధాలు సమంగా సాతవాహనరాజుల కాలం నుండి లభిస్తూవచ్చినవి. కన్నడం ముందు పుట్టిన భాషకావటం చేత ముందుగా 'కన్నాడు' అనే దేశవాచకమైన పేరు దానికి చెల్లుచుండియుండును. తరువాత పుట్టిన తెలుగు కూడ చాలాకాలం అదేపేరు కలిగియుండెడిదని తోస్తుంది. కనీసమీ కర్నూలు ప్రాంతములోను మరికొంత సరిహద్దుప్రాంతంలోను దానికి 'కర్నాట' లేక 'కన్నాడ' అనే పేరుండెడిది. ఈ సందర్భమున గమనించవలసిన విషయ మొకటి కలదు. భాషాపరముగ 'తెలుగు' అనుపదను క్రీ.త. పదవ శతాబ్దము తరువాతనే వాడుకలోనికి వచ్చెనని పలువురంగీకరించిన విషయము దాని వ్యుత్పత్తిని గూర్చి సర్వసమ్మతమైన వివరణ మింకను జరుగ లేదు 'కన్నాడు' పదమట్లుగాక సాతవాహనులనుండైనా దేశవాచక పదంగా చెప్పటానికి వీలగుచున్నది. 10వ శతాబ్దం దాక తెలుగు పదమనేదే అమృగ్యంగా ఉంటే అంతకు నాలుగువందలేండ్లకు ముందు రూపొందిన మన (తెలుగు) భాషనేమని పిలిచేవారను ప్రశ్న తప్పక పుడుతుంది. అంత దీర్ఘకాలమేపేరు లేకుండా అనామకంగానే యున్నదనలేము. పైన జెప్పిన సామ్యములనుబట్టి, దేశమునుబట్టి యీ క్రొత్తగాపుట్టినభాషను కూడ కర్నాటము లేక కన్నడము అనే పిలిచేవారనుకొనుట సయుక్తికముగ తోచుచున్నది. ఈ సందర్భమున బిషపు కాల్డ్వెలు వ్రాసిన పంక్తులు చూడదగియున్నవి. According to some writers Karnata or Karnataka is a generic term applicable originally to both Telugu and canarese people and their languages, through it is admitted that it usually denoted the latter alone and though it is to the latter the abbreviated form Kannada has been appropriated. 18 (కొందరు గ్రంథరచయితల అభిప్రాయము ననుసరించి 'కర్నాట' లేక 'కర్నాటక' యనునది మొదట తెలుగు, కన్నడ ప్రజలకు ఇద్దరకు, వారి భాషలకు చెల్లుచు వచ్చెడి సామాన్య పదము. అయినను అది కన్నడ ప్రజను, భాషను మాత్రమే తెలుపు చున్నది. దాని రూపమే యగు కన్నడ పదమును కన్నడిగులే తమను తమ భాషను తెలుపుట కుపయోగించుచుండిరి) వాస్తవానికి భాషాపరంగా కర్నాట పదము కన్నడములో కూడ నంత ప్రాచీనమైనది కాదని కొందరు చెప్పుదురు. శ్రీనాథుని నాటికి రాయలసీమలోనుండు ప్రాంతీయ తెలుగు 'కర్నాట' మనబడెడిదనుటలో విప్రతిపత్తిమెమియు తోచదు. కాల్డ్వెలుకంటె సుమారు నాలుగు వందలేండ్లముందువాడు శ్రీనాథుడు. పూర్వం ప్రాకృతాల్లో కూడ అర్ధ మాగధి, సౌరసేని భాషలమధ్య తారతమ్యం చాలా సూక్ష్మంగా కనుపించేది. అట్లాగే మహారాష్ట్రి, పైశాచి భాషలు. శాసనాల్లో కనుపించే ప్రాకృతం ప్రాంతీయంగా వీటితో భేదించియుంటుంది. కోస్తా ప్రాంతంలోని తెలుగుకంటె కర్నాట తెలుగు స్వల్ప వైషమ్యాన్ని కలిగియుండవచ్చును. అందుచేత తనది నిజముగా కర్నాట (తెలుగు) భాషయని పృథక్కరించి చెప్పుకొన్నాడు. పాల్కురికి సోమనాథుడి భాషకు నితర తెలుగు కవుల భాషకు సర్వసాధారణంగా కొంతభేదం కనుపిస్తూ వుంటుంది. అయినప్పటికి సోమనాథుడు తన భాషలో నట్టిభేదం కలదని చెప్పలేదు కనుక మనం కూడ పేరుపెట్టి విమర్శించము. శ్రీనాథుడు స్పష్టంగా కర్నాటభాష యన్నాడు గనుక ఇన్ని విమర్శలకు తావేర్పడింది.

వాఙ్మయమును గూర్చిన చర్చ ప్రసిద్ధ కవులను గూర్చి చెప్పినగాని ముగియదు. కన్నడ తెలుగు వాఙ్మయములలో ప్రసిద్ధి గాంచిన పంపకవి, నాగవర్మ, పొన్న, నన్నయ, నారాయణభట్టు, పాల్కురికి సోమనాథుడు, మరికొందరు శివకవులు పేర్కొనదగి యుండిరి. ఈ విషయమును పలువురు విద్వాంసులు సాకల్యముగ జర్చించియుండిరి గాన నిచట జెప్పుటలేదు.

ఆంధ్ర–కర్నాటకములమధ్య చిరకాలమునుండి వచ్చుచున్న సాంస్కృతిక సంబంధము మిక్కిలి సన్నిహితమైంది. తెలంగాణము, రాయలసీమ భాగములు చాలకాలము కర్ణాటకమునుండి పాలించిన రాజులయధికారములో నుండుటవలన ఆర్థిక విధానములో ననేకమైన పోలికలు కనుపించును. పశ్చిమ చాళుక్యులనాటి విధానాన్నే కాకతీయులు కొద్ది మార్పులతో అనుసరించిరి· దేవాలయ వాస్తువు శిల్ప కళాసంప్రదాయములు కోలారు-చిత్తూరులనుండి పైన బోదన వరకు ఈ సరిహద్దు ప్రాంతమంతయు నించుమించు గనేకరీతిగ కనుపించును. చిత్తూరులో కొన్ని స్థలములలో చోళ సంప్రదాయమున్నను మిగిలిన ప్రాంతములో పశ్చిమ చాళుక్య సంప్రదాయము స్పష్టముగ తెలియుచుండును. చాలవరకు ఆ విధానమునే కాకతీయులనుకరించిరి .

వర్తక వ్యాపారాలవల్ల కూడ సాంస్కృతిక సంబంధాలు పెంపొందును. ఈ సంబంధం ఆంధ్ర – కర్ణాటకాలమధ్య దృఢతరంగా కొన్ని శతాబ్దాలనుండి యేర్పడియున్నవి· దానికి సుదీర్ఘమైన సరిహద్దులో 12 లేక 13 జిల్లాలు చేరియుండుట, ఒకే ప్రభుత్వములో చిరకాలముండుట ముఖ్యకారణములు. అయ్యావళి–అయినూర్వురు, ముమ్మురిదండవర్తకసంఘము, పరదేశివర్తకసంఘము వీరబణంజులుమొదలగు వర్తకసంఘములు ఆంధ్ర–కర్ణాటక దేశములలోనివాణిజ్య వ్యవహారమునంతయు నిర్వహించెడివారు. ఈ సంఘములలో కన్నడ దేశములోని వర్తకులేగాక తెలుగుదేశములోని వారుకూడ పలువురు పేర్కొనబడుచుండుట శాసనములందు తరచు కను

పించును. వీరి మూలమున రెండు రాష్ట్రములు ఏకరాష్ట్రముగ ఆర్థికాభివృద్ధి నొందుచుండెడివి. రాజకీయ ప్రతిబంధకములు లేవు గనుక వస్తువినిమయము స్వేచ్ఛగ జరుగుచుండెడిది. గద్యాణము వంటి ప్రధాన నాణెముల విలువ చాలకాలము స్థిరముగనుండి యిరు వైపుల ఆర్థిక సమైక్యతకు తోడ్పడెడిది. అంతకన్న ముఖ్యముగ నీ వర్తక సంఘముల మూలమున కొన్ని కొన్ని సాంఘికాచారములు, మర్యాదలు, భాషలలోని సామెతలు ఒకచోటునుండి మరొక చోటుకు సులభముగ జేరవేయబడుచుండెడివి. శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు తమపై జెప్పిన గ్రంథములో తెలుగు-కన్నడములలో నేకార్థములో వాడబడుసామెతల ననేకము అనుబంధముగ కూర్చిరి. అవి చదువు తుంటే ఒకేమాట ఒకే వాడుక అనిపిస్తుంది

తుదకు చెప్పవలసినది మతమునుగూర్చి. ఆసేతు హిమాచలము భారతదేశమునంతను సమైక్యముగ నిలబెట్టినది వైదిక ధర్మమనక తప్పదు. రాజ్యము లనేకము పుట్టినవి. రాజుల బలముకొద్ది యెక్కువ తక్కువగ రాజ్యము లభివృద్ధి చెందినవి, క్షీణించినవి. కాని భారత సమైక్యతను కాపాడింది ప్రభుత్వములుకాదు. ధర్మ ప్రవర్తనయే యను విషయము అందరు గుర్తెరిగినదియే. అట్టి ధర్మసంస్థలు ఆంధ్ర కర్ణాటకములలో శైవమునకు శ్రీశైలము, వైష్ణవమునకు తిరుమల, అహోబిలము; ద్వైతమునకు ఉడిపి, మంత్రాలయము; శాంకరమతమునకు శృంగేరి; జైనమునకు శ్రావణ బెళ్గొళ, కొనకొండ్ల యావద్భారత దేశములోని ఆయా మతాను యాయులకు ముఖ్యకేంద్రములుగ నుండుటయేగాక, విశేషించి ఆంధ్ర కర్ణాటకుల నొకటిగా నిరూపించుచుండును. ఆయా మఠములలో కొన్ని శతాబ్దులనుండి అధిష్ఠించుచు వచ్చిన ఆచార్య పరంపరను, వారిచే నుద్బోధితమైన శిష్యవర్గమును, సమాజమును చారిత్రకదృష్టితో పరిశీలించిన యెడల రాజ్యములేలిన రాజులకంటె ఈ మఠాచార్యులు ముఖ్యముగ ఆంధ్రులను కర్ణాటకులను, ఆయా మతధర్మములో క్రమబద్ధులజేసి జనసామాన్యమును సత్ప్రవర్తనలో తరతరములు నడిపించగలిగిరి. అందుచే నీ రెండు ప్రాంతములలోని జ సామాన్యము ఆయా సంప్రదాయములో నొకే ఆచార వ్యవహారముల ననుసరించుచుండెడివారు. సమైక్యత కిదియొక బయటికి కనుపించని ప్రబల హేతువు.

## ముగింపు :

ప్రాంతీయాభిమానాలు ప్రబలిన యీనాటి మనము అదే సూత్రములేని ఆనాటి చరిత్రను కడు జాగరూకతతో పరిశీలించ వలసియుండెను. శ్రీ కృష్ణదేవరాయలు ఆంధ్రుడా, కర్ణాటకుడా అను విషయమును చర్చించుటకంటె అతని రాజ్యములోని ప్రజలాయనను గురించి యెట్టిభావము కలిగియుండెడివారో తెలుసు కొనట ముఖ్యము అట్లే విద్యారణ్యుడు, ఇతర మహావ్యక్తులు, ఆంధ్ర కర్ణాటక సరిహద్దు మీదనున్న 12, 13 జిల్లాలలోని సామాన్యజనము ఆయా హిందూ రాజుల ప్రభుత్వములలో పక్షపాతమునకు గురియైనట్లు చరిత్రాధారములలో కానరాదు. ప్రస్తుతము రెండు రాష్ట్రములలో సుమారు 40 జిల్లాలు కలవు. వాటిలో 12 లేక 13 జిల్లాలు, అనగా సుమారు మూడవవంతు సరిహద్దు ప్రాంతమై యున్నది. ఇందలి చరిత్ర, సంస్కృతి నిష్పాక్షికముగ పరిశోధించినయెడల కొన్ని ముఖ్యాంశములు తెలియగలవు. మేము ఆదోని తాలూకావరకే హద్దుగా పరిశోధిస్తామని ఆంధ్రులు, హంపి మాకు కలిస్తే కర్ణాటకుల ఘనత పెరుగుతుందని వారు అనుకోకూడదు. హంపిని గూర్చి చెప్పేటప్పుడు ప్రక్కనున్న కర్ణాట భాగాన్ని, రాయలసీమను వారు మరువకూడదు. అట్లే శ్రీశైల ఘనతను చెప్పేటపుడు కర్ణాటకమునుండి వేలసంఖ్యలుగ వచ్చే శైవ యాత్రికుల నాంధ్రరచయిత మరువరాదు. అట్లే మహానంది, అలంపూరు దేవాలయాల వాస్తువును విడిచి పట్టదకల్లు, అయిహోలు దేవాలయాల వాస్తువు పరిపూర్ణముకాదు. మహానంది దగ్గరున్న కడమల కాల్వలో చక్కని శివనందీశ్వరాలయము బాదామి చాళుక్య వాస్తువు ననుసరించి కట్టబడియున్నది. అచట సత్యాశ్రయభటారుని పేరు కూడ కలదు. అంటే ఆ బిరుదుగల వారెవరను విషయమును పరిశోధించునపుడు, విష్ణుకుండినులలో ఇంద్రభట్టారకవర్మ,

బాదామి చాళుక్యులలో మొదటి పులకేశి, రెండవ పులకేసి తెలియ వస్తున్నారు. ఈ ముగ్గురిలో నీ గుడి యెవరికాలమునాటిది. ఉన్న ఆ కాస్త శాసనము ప్రాచీన కన్నడములో నున్నది పైగా సులభముగ నర్థమగుటలేదు కూడ. ఇప్పటి రెండు భాషలు కాని యొక ప్రాచీన కర్ణాటభాష ఆ కర్నాటిసీమలో నున్నదను విషయమును గుర్తించు కొని ఆ యాలయ కాలమును, వాస్తువును పరిశోధించవలసి యుండును. అట్లాగంటిదే గిద్దలూరు దగ్గరున్న సత్యవోలులోని రామలింగేశ్వరస్వామిగుడి కూడ. అనంతపురము, చిత్తూరు, కోలారు జిల్లాలలో మరికొన్ని క్లిష్టసమస్యలు గలవు. రేనాటిచోళులు, బాణ రాజులు, వైదుంబరాజులు, పల్లవులు, చోళులు, నోలంబపల్లవులు, గాంగరాజులు, ప్రాచీన చాళుక్యులు, రాష్ట్రకూటులు మొదలైన వంశముల రాజులందరు అక్కడ అనేకమార్లు యుద్ధములందు తారసిల్లారు. సాంస్కృతికముగ కూడ కోలారు జిల్లాయొక కూడలి. ఆ ప్రాంత చరిత్ర పరిశోధన యెంతక్లిష్టమో అంత ఉత్సాహజనకంగా ఉంటుంది. అష్టదిగ్గజములలో ప్రసిద్ధికాంచిన ముక్కుతిమ్మన ఆ జిల్లాలోని వాడని యీమధ్య 1972లో శ్రీయుతులు కె. ఎస్. కోదండరామయ్యగారు (హోసూరు) ఆసక్తికరమైన పరిశోధనా పుస్తకమును రచించిరి. అల్లసాని పెద్దనకు కూడ కోలారు జిల్లాతో సంబంధమున్నది. శ్రీనాథుని గూర్చి కొంత లోగడ చెప్పియుంటిమిగదా. నన్నయభట్టు–నారాయణభట్టు లను గూర్చి కూడ వారు కర్నాటకు లనుకొనేవారున్నారు. ఇందులో సంశయింప బనిలేదు. మన కవులలో చాలమంది సంస్కృతముతో బాటు తెలుగు, కన్నడములలో గూడ సహజ పాండిత్యముగలవారే. మనకు కావలసింది వారి కవితా స్రవంతియే.

ముసల్మానుల పాలనలో చేరియున్న ఉత్తర సరిహద్దు జిల్లాలలో ఆ కాలమునాటి సాంస్కృతిక చరిత్ర మిగత భాగములందువలె మరుగుపడియున్నది. తగిన పరిశోధన కూడ జరిగియుండలేదని పిస్తుంది. తెలుగు – కన్నడము, ఉర్దూ బాగుగ నేర్చిన విద్వాంసు లిందుకు పూనుకొనవలసియున్నది.

# అధోజ్ఞాపికలు

1 ఆంధ్రచారిత్రక పరిశోధక మండలి పత్రిక (JAHRS) X పుటలు 99 నుండి

2 ఆంధ్ర కర్నాట సారస్వతములు – పరస్పర ప్రభావము, 1962.

3 Karnataka-Andhra Relations, (Kannada Research Institute Dharwar–1974)

3a భారతి 1978 జూన్, సెప్టెంబరు సంచికలు.

3b Ep. Ind. XIV–P. 155.

4 Ep. Ind. I, p. 5,9

5 „ VI, P. 86

6 Early Hist. of Andhra Country–P. 2,182.

7 „ „ P. 195.

8 Ind. Ant. XI

9 Ind. Ant. VI. P.76.

10 Eq. Ind. XXXVI, P.71.

11 SII. IX-1, 119

12 తెలంగాణాశాసనములు–2, 12, 18, 19, 20, 23

13 SII. X. 504.

14 అప్రకటితము

15 SII. XVI.

16 తెలంగాణ శాసనములు–2, పుట 171.

17 దీనిని గూర్చిన సారస్వత చర్చ శ్రీ నిడుదవోలు వారిపై జెప్పిన గ్రంథములో చూడదగును.

18 Caldwell, The comparative Grammar, పుటలు 30–31.

[1979 మార్చి 19వ తేదీన కర్ణాటక విశ్వవిద్యాలయంలో జరిగిన ప్రాంతీయ చరిత్రను గూర్చిన సెమినార్‌లో ఈ రచయిత చదివిన ఆంగ్ల వ్యాసమునకు అనుకరణము]



# పల్లెపథంలో ప్రగతి రథం

ప్రగతి రథం ఇప్పుడు పల్లెపథంలో పయనిస్తోంది.

పల్లె ప్రజల అభ్యున్నతి కోసం ఎన్నో ప్రణాళికలు తయారుచేస్తున్నారు.

నిర్దిష్ట కాల పరిమితిగల కార్యక్రమాలెన్నో చేపడుతున్నారు. అభివృద్ధి ప్రణాళికల, కార్యక్రమాల ఫలితాలు పేద ప్రజలకు అందేలా చేయడానికే కనీసావసరాల కార్యక్రమాన్ని చేపట్టారు.

ప్రగతి రథం కదలాలంటే చక్రాలలోని ఆకులన్నీ సమంగా, బలంగా వుండాలి.

గ్రామవిద్యుదీకరణ, ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల ఏర్పాటు, మంచినీటి సౌకర్యాల కల్పన, మురికివాడల పరిశుభ్రం, మంచి బాటలు నిర్మించడం, ఇవన్నీ రథచక్రాల్లో ఆకుల్లాంటివే. అందుకే వీటన్నిటికీ అధిక ప్రాముఖ్యత నిస్తున్నారు.

ఇందుకోసం ....

ఐదవ ప్రణాళికా పెట్టుబడిలో ఉద్దేశించిన రు **50.50** కోట్లలోనూ రు. **43 40** కోట్లు ఇప్పటికే ఖర్చు చేశారు.

*సమాచార, పౌరసంబంధశాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం హైదరాబాదు.*

40/78-79



డా. టి. వి. జి. శాస్త్రి

# క్రైస్తవ మతవ్యాప్తి - రోమన్ బ్రాహ్మణ సన్యాసి, ఫాదర్, రాబర్ట్ డి. నోబిలి

క్రీస్తు పుట్టిన 1500 సంవత్సరముల వరకు క్రైస్తవ మతం హిందూదేశంలో వ్యాపించలేదంటే హిందువులకు తమ మతము నందున్న అభిమానమని కొంతవరకు చెప్పుకొనవచ్చును. కాని నిజానికి కేరళలో నాటుకొని పోయిన క్రైస్తవ మతం బాగా పురాతనమైనదనే చెప్పాలి.[1] ఇది హిందూదేశమునకు ఎట్లు సంక్రమించెను అన్న ప్రశ్నకు చారిత్రికంగా దక్షిణదేశపు తీరప్రాంతమునకు అనేక విదేశములతో వ్యాపార సంబంధము లుండెడివని గోచరించెను. తద్వారా మొట్టమొదట క్రైస్తవమతం కేరళలో ప్రవేశించెనని పూహించవచ్చును.

నిజానికి, యూరప్ మధ్యధరా తీర దేశముల నుండి, ఆఫ్రికా దేశమును చుట్టి, సముద్ర ప్రయాణము చేసినచో, హిందూదేశము చేరుటకు కొన్ని సంవత్సరములు పట్టునని అంచనా వేయవచ్చును. ఏలనన, అవి కనీసం మూడువేల మైళ్ళుండునని అంచనా వేసినచో మామూలుగా ఆ రోజులలో చిన్న చిన్న పడవలలో తుఫానులను, వర్షములను, శీతల పవనములను దేశాంతరములు, ఖండాంతరములు చుట్టి వచ్చుట, కొంత అసాధ్యముగా యుండెడిది. అయినప్పటికీ, హిందూదేశమునకు, ఈజిప్టు, గ్రీసు మొదలగు దేశములతో క్రీస్తు పూర్వమే వ్యాపారరీత్యా సంబంధము లుండెడివని, చారిత్రకంగా తెలియుచున్నది. అయితే క్రీస్తు జీవించుయుండు రోజులకె 'హిప్పాలస్' ఋతుపవన గమనములను కనుగొనుటవలన, ఖండాంతర ప్రయాణములను సాహసించెడివారు.

"స్ట్రాబో"[2] అను గ్రీకు చరిత్రకారుడు, 'మయోస్ – హెర్మోస్' అను ఓడ రేవు నుండి, ఒక బృందం 120 పడవలలో బయల్దేరి వ్యాపార నిమిత్తమై హిందూదేశములోని మలబారు ప్రాంతమును చేరినట్లుగా వ్రాసెను. 'ఇరాటా – స్టీను'[3] తన హిందూదేశపు ప్రయాణ విశేషములెన్నియో వ్రాసెను. కాగా 'ప్లిని' 'పెరిప్లస్'[4] మొదలగు చరిత్రకారుల వర్ణనలు మన చరిత్రకు ఇప్పటికినీ ప్రమాణ గ్రంథములు. అయితే వీటిఎన్నిటినీ తిరగవేసి చూచినచో క్రైస్తవ మతవ్యాప్తిని గురించి కొన్ని విషయములను సేకరించవచ్చును.

కేరళలోని క్రీస్తుమత వ్యాప్తిని గురించి 'ప్లిని' వ్రాతలలో కొంత కనిపించును. ఇతడు గ్రీస్ నుండి అరబ్బీ దేశముల మీదుగా ఎఱ్ఱ సముద్రము తీరము వరకునూ భూప్రయాణమును వర్ణించెను. తరువాత ఎఱ్ఱ సముద్రమునందున్న 'ఓక్లిస్' రేవులో మజిలీ చేసి అచట నుండి 'హిప్పాలస్ పవనముల' (monsoon winds) కోసం కొన్ని దినములు నిరీక్షించెడివారుట. సముద్ర ప్రయాణము కేరళలోని 'ముజిరస్' చేరుటకు 40 రోజులు పట్టెనట.[5] దీనినిబట్టి, 'ముజిరస్' రేవు పశ్చిమ ప్రాంత దేశముల నుండి భూ సముద్ర యానములకు ముఖ్య కేంద్రముగా కన్పించుచున్నది. వ్యాపారమునకున్న ప్రాధాన్యత, మత వ్యాప్తికి యుండెడిదికాదు. వ్యాపారముతో పాటు, కొంతమంది క్రీస్తు మత ప్రబోధకులు 'ముజిరస్' చేరియుండవచ్చునని చరిత్రకారులు నిర్ధారణచేసిరి[6] పురాతత్వరీత్యా, హిందూదేశపు తూర్పు ప్రాంతమున, క్రీస్తు పుట్టిన రెండవ శతాబ్దమునాటికే, రోమ్, గ్రీస్ మొదలగు దేశములతో సంబంధముండెనని తెలియుచున్నది. ఆంధ్రదేశములోని కోస్తా ప్రాంతమునందు రోమన్ అవశేషములు దొరుకుచున్నవి. నాగార్జునకొండ, ఘంటశాల, అమరావతి, గుడివాడ, నందిగామకు సమీపమునన్నున్న అల్లూరునందు రోమన్ క్రైస్తవ రాజుల బంగారు నాణెములు దొరికెను.[7] ఈ ఆధారములనుబట్టి, వ్యాపార రీత్యా, కొంత క్రైస్తవ మతవ్యాప్తి రెండు – మూడు శతాబ్దములలో జరిగియుండెడిదని తెలుసుకొనవచ్చును.

క్రీ. శ. 1000 సంవత్సరముల తరువాత, హిందూదేశమునకు ముస్లిం దండయాత్రలు ఎక్కువాయెను. ఇది కేవలము హిందూమత నిర్మూలనకు, ఇస్లాం మత వ్యాప్తికి ఉద్దేశింపబడినవి. వీటితోబాటు పశ్చిమ అరబ్బీ దేశములతో వ్యాపార స్థాయి కూడా ఎక్కువాయెను. కేరళ ప్రాంతము నుండి విరివిగా మిరియాలు, లవంగములు, మొదలగు మసాలా దినుసులు, సుగంధ ద్రవ్యములు యూరప్ దేశమునకు అరబ్బీ దేశముల మీదుగా ఎగుమతి అగుచుండెడివి.



ఈ నోబిలీ బొమ్మని ఆయన సమకాలికుడు
ఫ్రయర్ బాల్తజార్ థా కోస్టా వేశారు.
(ఇది బిబ్లియోథెకా నెసియెనాల్ పనీవ్ః లోనిది.)

అరబ్బుల రేవు పట్టణం ఇరాక్‌లోని 'హోర్ముజ్' పోర్చుగీసు వారు హిందూదేశమునకు రాకముందు, కొచ్చిన్, కాలికట్, గోవా[8] మొదలగు వోడ రేవుల నుండి ముస్లిం వ్యాపారస్తులు హోర్ముజ్ చేరి, అచట వారి సరుకును అరబ్బులకు అమ్మి, తిరిగి వస్తూండే వారు. హిందూదేశము నుండి పోవు సరకు ఎక్కువగా యూరప్ దేశములలో, గిరాకీ యుండుటవలన అచట అమ్ముడు పోయెడిది. కాని యూరప్ దేశ వ్యాపారస్తులకు మాత్రము అరబ్ దేశముల మీదుగా వచ్చి వ్యాపారము చేసికొనుటకు కొన్ని ఆంక్షలుండెడివి. దీనితో యూరోపియన్ వ్యాపారస్తులకు గత్యంతరము లేక హిందూ దేశముతో సరాసరి వ్యాపారమును చేపట్టుటెట్లని చూచుచుండిరి.

ఈ సమయములో, అనేక మంది నావికులు, హిప్పాలస్ గాలుల సహాయమున, సముద్రయానముచేసి, హిందూదేశమును కను గొనవలెనని, ప్రయత్నము చేయుచుండిరి. ఇట్లు సాహసించినవారిలో ముఖ్యులు వాస్కోడగామా, కొలంబస్[9] వైకింగ్, మెగిలన్, ప్రభృతులు.

వాస్కోడగామా 1497 జూలై 8వ తారీఖున పోర్చుగల్ దేశమును వదలి, ఆఫ్రికా దేశమును చుట్టి, ''మెలింది'', అను ద్వీపమును చేరెను. మెలింది రాజు వారికి స్వాగతమిచ్చెను. హిందూ దేశమునకు పోవుమార్గమును చూపుటకు ఒక ముస్లిం వ్యాపారిని జతపర్చి పంపెను. వాని సహాయమున పశ్చిమతీరముననున్న కాలికట్ రేవును 1498 మే 17వ తారీఖున చేరెను.[10]

1510 పోర్చుగీసు వారు గోవాను పరిపాలించుచున్న ఆదిక్ – షా – హి రాజును వోడించి, అచట నుండి, అరబ్బీ దేశమునకు పోవు వ్యాపారమునంతయు చేబట్టిరి.

పోర్చుగీసువారు గోవాలో స్థిరపడిపోగా 'క్రైస్తవ మత శాఖ లెన్నియో యూరప్‌నుండి తరలివచ్చెను.[11] క్రమేపి దక్షిణ హిందూ దేశమందంతయూ ప్రబోధములు సలిపి, మతమును మార్చుటకు ముఖ్య ప్రదేశములలో వారి వారి నిలయములను ఏర్పరిచిరి.

క్రైస్తవ మత ప్రచారమునకై హిందూదేశమునకు వచ్చిన మతప్రబోధకులలో అగ్రగణ్యుడు 'సెంట్ ఫ్రాన్సిస్ క్జేవియర్'. ఇతడు మేధావి. లాటిన్ గ్రీకు భాషలలో పండితుడు. ఫ్రాన్సులో చదువుకుంటున్నప్పుడే 'జెసూయిస్టు' సంస్థ అధినేత 'ఇగ్నేషస్ లయోలా' ప్రేమపాత్రుడైనాడు. 'లయోలా' వీని భాషా పరిణామ పాండిత్యమునకు (Evolution of Languages) ముగ్ధుడై క్రైస్తవ మత వ్యాప్తికి సరియైన 'వ్యక్తి' అని గ్రహించి, పోర్చుగల్ రాజును మత ప్రచారకునిగా, హిందూదేశమునకు పంపమని అర్ధించెను. ఇది పురస్కరించుకొని అతడు 1545లో 'వెల్హాగోవా' జెసూయిస్టు సంస్థ నిర్వహించు 'సెంట్‌పాక్' కళాశాలకు అధిపతిగా పంపబడెను.[12]

కొద్ది రోజులకే, కొచ్చిన్, కాలికట్, టుటికురన్, మొదలగు ప్రాంతములను పర్యటించి, మలయాళం, తమిళం, మొదలగు భాషలలో ఉపన్యాసము నిచ్చు ధోరణిని సునాయాసముగ అలవర్చుకొనెను. ప్రాంతీయ బెస్తలందరూ, వీనిని 'దేవదూత'గ పరిగణించి, క్రైస్తవమతమును స్వీకరించిరి. తరువాత క్జేవియర్ కీర్తి మలాకా, చైనా, జపాన్ మొదలగు దేశములలో వ్యాపించెను. తద్వారా ఈ దేశములను పర్యటించి, అచట క్రైస్తవ మతస్థాపకుడయ్యెను.

క్జేవియర్ అనేక మహిమలు చూపించెడివాడుట. చనిపోయిరనుకొన్నవారిని కొందరిని బ్రతికించెను. తనవద్ద డబ్బు లేకపోయినను, నాణెములను సృష్టించి దానమిచ్చెడివాడు. పక్షవాతముచే బాధపడుచున్న వారిని, తన కరముచే స్పృశించి, జబ్బు నయము చేసెడివాడు.

ఈతని ప్రచారములు, మహిమలు, హిందూదేశమునకు వచ్చిన పది సంవత్సరములలోనే క్రైస్తవ ప్రపంచమునందు, ఒక మహాపురుష స్థానమును సంపాదించెను.[14]

రెండవసారి జపాన్ దేశ ప్రచారమునకై వెళ్ళి, తిరిగి వచ్చుచుండగా మలాకా ద్వీపమునందు మరణించెను. అచట వాని దేహమును భూస్థాపితము చేసిరి ఒక సంవత్సరము తరువాత సైనికుడొకడు ఇచట తిరిగి త్రవ్వగా, జీవించియున్నవాని శరీరమువలె కనుపించెనట.

ప్రస్తుతము క్జేవియర్ అవశేషముల వెల్హా గోవాలోని, "బాంజేసస్ బేసిలికా"లో భద్రపరచబడియున్నవి. ఇది హిందూ దేశపు క్రైస్తవులకే కాక ప్రపంచ క్రైస్తవ మతస్తులందరికీ పుణ్యక్షేత్రముగ పరిగణింపబడుచున్నది.

తరువాత మత ప్రచారములకై "జెసూయిస్టు సంస్థ తరుపున రోమునుండి ఇండియాకు వలస వచ్చినవారిలో 'ఫాదర్ రాబర్టో డి నొబిలి'మరొకడు. ఇతడు అంతర్దేశీయ ముఖ్య మఠాధిపతియైన 'మూడవ జూలియస్' 'రెండవ మార్సిలస్' పోపులకు బంధువు.[15] 1577లో ఇటలీలోని 'మాంటెపుల్సియానో' అను గ్రామమునందు పుట్టెను.[16] వీని పినతండ్రి పది సంవత్సరములకే లాటిన్, గ్రీక్ భాషలలో అశేష ప్రతిభను చూపి, పదునెనిమిదవ సంవత్సరమునకే 'కార్డినల్' పదవిని నిర్వహించుచూ, మృతినొందెను.[17]

పినతండ్రివలె ఫా.నొబిలి కూడా భాషాజ్ఞానం సంపాదించవలెనని చిన్నతనముననే అభిలాష చూపించెను. తన బంధువులైన పోపుల క్రింద పనిచేయుటకు ఇష్టములేక 19వ ఏట 'నాపిరా' అను పట్టణమునకు వెళ్ళి జీసెస్‌సంస్థలో చేరి 'ఫా.నికొలావొ ఆర్మెండిని' క్రింద శిష్యరికము చేసెను.[18] నాలుగు సంవత్సరములైన తరువాత ఇండియాలోని జీసెస్ సంస్థ తరపున ప్రచారములలో పాత్రవహించు అవకాశము కల్పింపమని తన గురువు నర్థించెను. ఆ కోరిక 1604లో ఈడేరినది.

ఫా నొబిలి సముద్రయానము చేసి 1605, సెప్టెంబరులో గోవా చేరెను. కొద్ది రోజులకే కొచ్చిన్‌లోని ఆధ్యాత్మవాదుల (Theologists) కళాశాలలో చేరి ఒక సంవత్సరము మత ప్రబోధములలో ఉత్తీర్ణుడయ్యెను. దక్షిణ హిందూదేశమున పనిచేయు 'జసూయిస్టు' నిలయములన్నియూ కొచ్చిన్ మఠాధిపతియైన 'ఫా గస్పలో ఫర్నాండిస్' ఆధ్వర్యంలో వుంటూ వుండేవి. మధుర, మద్రాస్‌ఎద్ద 'శాన్థోమ్', చంద్రగిరి మొదలగుచోట్ల స్థాపింపబడిన నిలయములను ఇతడే నిర్వహించెడివాడు.[19]

మధురలోని జెసూయిస్టు క్రైస్తవ నిలయము మందకొడిగా యుండెనని, అచటకు గట్టి ప్రబోధకుని పంపవలెనని ఫా. ఫర్నాండిస్ చూచుచుండెను. ఫా. నొబిలిలోని కుతూహలమును గ్రహించి, వానిని 'ఫా. తెరిజియో' వెంట పంపెను. వీరిద్దరూ 1606 సంవత్సరము మధ్యలో మధుర పట్టణమును చేరిరి.[20]

మధుర క్రైస్తవ కేంద్రమునందు ఎక్కువగా సముద్రపు ముత్యములను పట్టితెచ్చు బెస్తలు ఎక్కువగా వుండెడివారు. వీరు వ్యాపారమునకై 'టుటికురన్'నుండి పేరుగాంచిన మధుర పట్టణమునకు వచ్చుచుండెడివారు. టుటికురన్‌రాజునకు 'పరవరులకు' సుంకము కట్టువిషయములో పేచీవచ్చి పోర్చుగీసువారి సహాయము నర్థించిరి. వారు ఆ రాజు పీడనుండి తప్పింపగా వారియందు గురి కుదిరెను. తరువాత 'పరవరుల'నందరినీ పోర్చుగీసు క్రైస్తవమత ప్రబోధకులు వారి మతమునకు మార్చిరి.[21] మధుర క్రైస్తవ కేంద్రము నందున్నవారందరూ టుటికురన్ ప్రాంతమునుండి వచ్చినవారే వీరి, ఆరోగ్యము, విద్య మొదలగు సంక్షేమ కార్యములన్నియూ ఆ నిలయము నిర్వహించెడిది.

ఇక ఫా. నొబిలి మధురలోని జీవిత విశేషములను తెలుసుకొనుటకుముందు, మధురలోని రాజకీయ, సాంఘిక విద్యావిషయములను తెలుసుకొనుట అవసరము.

రాజకీయదృష్ట్యా మధురను పరిపాలించు 'రెండవ కృష్ణప్పనాయకుడు' 1601లో చనిపోయెను.[22] ఈతని కొడుకు ఇతడుండగనే మృతినొందుటవలన తన అన్నగారి కొడుకైన ముత్తు కృష్ణప్ప నాయకుడు రాజ్యమునకు వచ్చెను. ఇతడు పినతండ్రివలె సౌమ్యుడు కాదు, ధూర్తుడు. మధుర నాయకులు విజయనగర సామ్రాజ్యాధీశ్వరుడైన 'రెండవ వెంకటపతిరాయుని' సామంతులు. మహారాజు కప్పమును చెల్లించుటకు 'పరవరుల' విషయములో, అతి క్రూరముగా ప్రవర్తించెడివాడు.[23] శ్రీకృష్ణదేవరాయలుకాలము నుండి పోర్చుగీసువారికి, విజయనగర రాజులకు, రాజకీయ, వ్యాపార రీత్యా పరస్పరముగా మైత్రి యుండెడిది.[24] తద్వారా మధుర, తంజావూరు, టుటికురన్, శాంథోమ్,[25] మొదలగుచోట్ల, పోర్చుగీసువారు కోరికపై, మతకేంద్రములను ఏర్పరచిరి. క్రీస్తు మత స్వీకారము చేసిన వారిని ఈ కేంద్రములయందుంచి, తగు శిక్షణను ఇస్తూ వుండేవారు వీరి సంక్షేమమునకు ఆసుపత్రులు, స్కూళ్ళు మొదలగునవి, ఈ కేంద్రములే నడుపుచుండెడివి.[26] కాని వీటిలో పనిచేయుటకు గాని, శిక్షణను పొందుటకు గాని పెద్ద కులముల వారెవ్వరు వచ్చుచుండెడువారుకారు. మతవ్యాప్తి విషయములో, ఈ కేంద్రములకు చాలా నిరుత్సాహముగా యుండెడిది. అందువలన కొంతమంది చదువుకొన్న బ్రాహ్మణులకు ఎక్కువ జీతము ఇచ్చెదమని ఎరపెట్టి, వారిని ఉపాధ్యాయులుగా చేర్చుకొని, తద్వారా, పెద్ద కులములవారి పిల్లలను చేర్చవలెనని ప్రయత్నములు చేసిరి.

కాగా మధురలో పోర్చుగీసు వారన్నను, క్రైస్తవ మతస్తులన్నను పెద్ద కుటుంబములలో, కొంత హేయభావముండెడిది. చంద్రగిరి కేంద్రమునకు చెందిన ఫా. 'ఆన్టోనియో రుబినొ' మత ప్రచార అవరోధములను పేర్కొనచు రోమునకు ఈ విధముగ తెలియజేసెను[27] "ఇచట మాంసాదులు తినుట కంటికి ఇంపుగా వుండని నల్లని 'ఫాదరీ' దుస్తులు, దేవుని సాయుజ్యమును చేర్చు

టలో ఏ మాత్రము తోడ్పడవన్న భావన వీరిలో నాటుకొని పోయి నది. అందువలన ఇచటికి వచ్చు మత ప్రబోధకులు, ఈ విషయము లను గ్రహించి ప్రవర్తించవలెను.''

మరియు మధురలోవిదేశీయులను క్రైస్తవులను, ప్రాంగులు అను పదముచే పిల్చుచుండెడివారు. ఇది పోర్చుగీసు వారు రాక ముందు, ప.రష్యానుండి వ్యాపారమునకై తరలివచ్చి మధురలో కొంత మంది యుండెడివారు. వారికి ఈ పదము వర్తించును. కాని [28] ఫా. నొబిలి, దానికి ఇట్లు వ్యాఖ్య రాసెను — ''అడివి జంతువువలె నడవడి గలిగి, సిగ్గు, సంస్కృతిలేనివారు.'' యిట్టి పరిస్థితులలో ఫా. నొబిలి తను వొచ్చిన పని ఎట్లు నెరవేరునా యని దిగులు పడుచుండెడువాడు. ఈతని ముఖ్య కర్తవ్యం పెద్దకులముల వారిని చేరదీసి కొంతమందిని క్రైస్తవులుగ మార్చినచో తన పని కొంత నెరవేరునని ఎంచి మధుర కేంద్రమునందున్న సంస్కృత—తెలుగు ఉపాధ్యాయుని వద్ద శిష్యరికము చేయనిశ్చయించుకొనెను.[29] ఆ ఉపాధ్యాయుడును కూడ వానికి హిందూమతమును గురించి చెప్పి హిందువుగ మార్చవచ్చునని లోలోపల సంతసించెను. ఈ విధముగ వారిద్దరికీ అనుబంధమెక్కువాయెను.

ఫా. నొబిలిని బ్రాహ్మణవాడకు తీసుకొని వెళ్లుట కష్టమని గ్రహించి తనగురువుగారు, వానిని కొన్నాళ్లు వూరివారికి సంబంధము లేక యుంచవలెనని నిశ్చయించెను. అతడు రహస్యముగ శిష్యుని వద్దకు వచ్చి పాఠములతోబాటు, ఆచార వ్యవహారములు, హిందూ మతము, వేదాంతము మొదలగు వాటిని గురించి, తెలియజెప్పెను. ఇట్లు అజ్ఞాత వాసములో నుండి తెలుసుకొనుట సమంజసమేనని 'నొబిలి' గ్రహించెను.

తరువాత అతడు ఒక సంవత్సరము ఏకాంత సేవచేసెను. ఈ సంవత్సరములో, అతడు ''రోమ్‌దేశమున రోమ్ నగరవాసివలె యుండవలెను'' సామెత ప్రమాణముగ తీసుకొని, మధుర బ్రాహ్మణులెట్లు యుందురో అట్లు తన జీవితమునందు కఠోర పరీక్షకు గురియాయెను.[30]

1607వ సంవత్సరమున రోమ్‌లోని కార్డనల్ 'బెల్లర్ మినో'కి వ్రాసిన రహస్య ఉత్తరములో ఈ విధముగ యుండెను. [31]

''ఈ మధ్య నా జీవితపద్ధతిని మార్చివేశాను. నేను ఇప్పుడు ఉన్న కుటీరము మట్టితో నిర్మించాను. ఇది నాకు అచట వున్న గొప్ప గొప్ప మేడలకన్న, హాయిగానున్నది. క్రీస్తుప్రేమకై, క్రీస్తు పడ్డ కష్టములన్నిటికోసం, ఈ విధంగా వుండుటకు నిశ్చయించు కున్నాను. కాని ఈ కష్టములు తల్చుకున్నప్పుడు, కొంతబాధపడ్తా. నిజానికి 'దావీదు' రాజు చెప్పినట్లు భగవంతునికై మనస్సు లగ్నము చేసినచో భయమంతయూ పటాపంచలగును'' అన్న మాటలు జ్ఞాపకము వచ్చును.

ఇట్లు నేను గుడిసెలో ఏకాంతముగ కాలముగడుపుచున్నాను. ఎవ్వరూ లేనప్పుడు వీరి మూఢ నమ్మకములను ఎట్లు పోగొట్టు దును, అని ఆలోచించుదును. నేను తిను భోజనమునందు చేపలు గుడ్లు లేకపోవుట వలన, నాకు కొంత అనారోగ్యముగ యున్నది. అన్నము, ఫలములు, కందములవలన వాంతులు ఎక్కువగాయున్నవి. అయితే, అవితినుట ఇప్పుడు నేనీ విధముగ చేయనిచో దేవుని దృష్టిలో ఎట్లుండునో కాని, ఈ వూరి వారి దృష్టిలో మటుకు, మతబోధచేయుటకు అర్హుడను కాను. ఇక్కడ బ్రాహ్మలు కొంత మంది నిరాహార దీక్షలో యుందురు. [32]

ఒక సందర్భమున 'ముత్తు వీరప్పనాయకుడు', వీని తాపస వృత్తి సంగతి తెలుసుకొని, పోర్చుగీసు సన్యాసిని తన వద్దకు తీసుకురమ్మనమని ఆజ్ఞాపించెను.[33] అప్పుడు తాను బయటికి వచ్చి నచో స్త్రీల నెందరినో చూడవలసి వచ్చును, స్త్రీలను చూచినచో మనస్సు చలించును. తన తపస్సుకు భంగం కలుగకుండయుండు టకు, వానినే రమ్మని కబురు చేసెను.

'నొబిలి' సాయంత్రం 4 గంటలకు భోజనము చేసి, అప్పు డప్పుడు ప్రకృతిని తిలకించుటకు ఒక పల్లకిలో వెళ్తూ వుండెడి వాడు. ఎప్పుడైన 'స్త్రీ' అగుపించినచో అపచారం, అపచారం, అనెడువాడు.

ప్రజలు తనని చూచుటకు వచ్చినపుడు, తను వచ్చిన పని కొనసాగిందను కొనెడివాడు. కాని తన పొరుగు బ్రాహ్మణ వాడలో సహింతురా అని అనుమానము కలిగెను దానికి, తన గురువుగారి సలహా పాటించి, బ్రాహ్మణ వాడకి, పోర్చుగీసు సన్యాసి వచ్చునని వదంతి లేవదీయించెను. ఇంత 'నిష్ఠ'తో నున్నవాడు వచ్చిన ఏమి అని తెలుగువాడలోని బ్రాహ్మణులు, అచట ఒక బస ఏర్పాటు చేసిరి.

బడగవాడలో (తెలుగువారివీధి) తన జీవితము నందు మరొక మలుపు వచ్చెను. ఇచట జంధ్యమును తీసివైచి కాషాయ దుస్తులను ధరించి, ఒక దండమును చేతబట్టి, బయట కని పించుటచే, వూరిలో వానికి గౌరవము ఎక్కువాయెను.[34] (పటము చూడుడు.)

ఇట్లు మార్పు జీవితమునందేకాక, మానసికముగ కూడ కొంత మార్పు తెచ్చుకొనెను. పాశ్చాత్య పద్ధతులను విడనాడి, ప్రాచ్య పద్ధతులు అలవాటు బడుటచే, తన ప్రబోధనులు కూడ ప్రాచ్య సంప్రదాయమునకు అలవాటు బడెను రోమన్ సన్యాసిని చూచుటకు, చర్చించుటకు, పామరులేకాక ప్రాజ్ఞులు వచ్చి చర్చలు జరుపుతువుండెడివారు. 'బడగవాడ'కు వచ్చిన తరువాత, నొబిలి వేదాంత ధోరణిలో చర్చించుటచే వారికి 'తత్వబోధకస్వామి' అని పేరిడిరి. [35]

ఇక నొబిలి పాండిత్యమును గురించి ముచ్చటింతుము. లాటిన్ గ్రీకుభాషలో బాగా చదువుకున్న వాడగుటచే సంస్కృతము నేర్చుకొనుట సులభమయ్యెను. తద్వారా తెలుగులో చర్చించుట, వ్రాయుట మొదలగునవి తాను మధురకు వచ్చిన 5, 6 నెలల్లో తెలుసుకొనెను. ఇక పరవరజనముతో సంభాషించుటచే,మళయాళ-తమిళమును బాగుగ తెలుసుకొనెను. తన మనస్సునందున్న మాట, ప్రబోధకులకు ఎట్లు చెప్పిన వచ్చునోయని ఆరంభమునందు కొంత తడుముకొనెడు వాడు కాని క్రమేపి, తను మధుర పట్టణము నందున్న పండితుల కన్న వినసొంపుగ, చర్చలు జరుపుచుండెడివాడు. తెలుగు తమిళ భాషలలో ఈతడు తానే క్రీస్తు పైన వ్రాసిన పద్యములతోను, దేవారములతోను, మొదలిడి వాటిని విడమర్చి చెప్పెడువాడు. తన చర్చలయందు ఉదాహరణము సామెతలు, పిట్ట కథలు మొదలగునవి నేర్చి, తన చర్చలలో ఉపయోగించుచుండెడి వాడు. [36]

బడగవాడలో, పండర, అని రామానుజమతమునకు చెందిన ఒక వేదాంతి యుండెవాడు. ఒకనాడతడు నొబిలి గురువును వెంట బెట్టుకొని, పరీక్ష చేయుటకు వచ్చెను. వారి చర్చ ఇట్లు జరిగెను.

పం : భగవత్ స్వరూపము మనస్సు, ఆత్మ అను రెండు విధము లుగా యుండును, మీరు ఒప్పుకొందురా?

నొ : ఒప్పుకొనను, అయితే మనస్సు గొప్పా, ఆత్మ గొప్పా?

పం : మనస్సునకు ఆధిక్యత ఇవ్వక తప్పదు.

నొ : అయితే కొద్ది దేవుడు, గొప్పదేవుడుండునా? ఇది అసంభ వము గదా?

పం : భగవత్ సృష్టి, శూన్యమునుండి ఆవిర్భూతమైనదని మేమందుము. మీరేమనెదరు?

నొ : ఏ పదార్థమైనను, తననుండి గాని, లేదా ఇంకొకరు ఇచ్చుటవలన గాని సృష్టి జరుగుచున్నది అనగా

ఒక పశువు, మరొక పశువు వలనగాని, భగవంతుని వలన గాని ఉద్భవించుచున్నది.

పం : పశువును భగవంతుడు ప్రసాదించలేదు.

నొ : కాబట్టి తన్ను తానే సృష్టిచేసుకుందన్నమాట.

తరువాత అన్నిటినీ చేర్చి యీ విధముగా, విశదీకరించెను.

భగవంతుడు, శూన్యమునుండి, సర్వసృష్టిని ఉద్భవింప జెయ్యనిచో, వాటికన్న అతడు అతీతుడుకాలేదు. అతడు భూసృష్టి కన్న కూడ, విశేషమైన సృష్టి చేయగలిగినవాడు. భూమిపై నుండు చెట్లు, వాటి బీజములచే ఉత్పత్తి యగుచున్నవి. ఈ విధముగనే పశువులు, చేపలు. వడ్రంగివలె భగవంతుడు చెట్టు చెక్కనుండి అనేకములైన రూపములు చేయును. చెట్టులేనిచో, చెక్కతో రూపములు చేయలేడుగదా. అతడే, మొదట చెట్టును సృష్టిచేసి, చెక్కలతో అనేక రూపములు చేయుచున్నాడు. ఇందు వలన భగవంతుడు ఈ మహాత్మ్యసృష్ట సృష్టికి కారణము [37]

మరొక సందర్భమున, కొచ్చిన్‌లోని జెసూయిస్టు సంస్థకు ఏప్రిల్ 22, 1609లో, ఒక ఉత్తరమునందు, తాను మధురలో నేర్చిన విద్యను గురించి ముచ్చటించెను.[38] "నా బ్రాహ్మణ గురువు నకు నేనెంతో ఋణపడి వున్నాను. అతడు కేవలం తెలుగు సంస్కృత భాషలేకాక, వేదమునందు పరిచయము కలుగజేసెను. బ్రాహ్మణేతరులు వేదమను మాట తలపకూడదు. అయినప్పటికీ, నా గురువు, నా ఆసక్తిని గ్రహించి, పూరి వారు తనను వెలి వేయుదురని భయమున్ననూ, నాకు తెలియజెప్పెను. వేదమనునది వ్రాయకూడదట. కాని నాకు దానియందుండు సూక్తములన్నియూ వ్రాసి యిచ్చెను. అదే పద్ధతిని నేనొక వేదమును వ్రాసితిని. నాకు నా గురువునకు జరుగుచున్న కార్యక్రమము పూరియందు తెలిసినచో పూరిలోని బ్రాహ్మణ్యము, నా గురువు గుడ్లు పీకించుదురు."

తరువాత 'నొబిలి' ఎంతమంది పెద్ద కులమువారిని క్రైస్త వులుగ మార్చెను అను ప్రశ్నకు, మరికొన్ని ఉత్తరములలో ఆధార ములు గలవు. 'గువెట్టిరో' జెసూయిస్టు సంస్థకు వ్రాసిన ఉత్తర ములో, 'నొబిలి' వేదాంత ధోరణి ఎందరో బ్రాహ్మణులను ముగ్ధు లను చేసెను. ప్రప్రథమముగ, క్రైస్తవమతం స్వీకరించినవాడు, తన గురువుగారేనని వ్రాసెను. సందర్భమును ఈ విధముగ వర్ణిం చెను. జూన్ 7వ తేదీ 1609న పవిత్ర భూత సమారాధన (Feast of the Holy Ghost) రోజున నిర్ణయం ప్రకారము పవిత్ర జలమును అభిషేకించి 'అల్బర్టు' అను నామకరణము చేసితిని.

"ఆ రోజు నాకెంతో గర్వముగనున్నది. ఈ క్రైస్తవ బ్రాహ్మణుడు తన స్వజనము నెందరినో క్రైస్తవులుగ మార్చుటకు, శక్తిగల సమర్థుడు."

ఫా. బెస్చెవద్ద కొన్ని ఉత్తరములు గలవు. అవి నొబిలి వ్రాసినవి. వాటిలో క్రైస్తవమత వ్యాప్తిని గురించి వివరములు గలవు.

'అలిక్కు నాయకుడు', నమ్మకమైన మతాభిమాని. విని సోదరుడు విహుద నాయకుడు. నాయకుని ఆస్థానమునందు ఒక ముఖ్యవ్యక్తి. ఈతడు అలిప్పు నాయకుని ప్రబోధమును విని, విభూతి ధరింపకయే, ఆస్థానమునకు వచ్చెను. వారక్కడ హేళన చేయగా, తన పదవికి రాజీనామానిచ్చి, క్రైస్తవ మతవ్యాప్తికి పూనుకొనెను.

ఒక తురుక వాని భార్యకు దయ్యము ఆవహింపగా, ఆల్బర్టు (నొబిలి గురువు) దేవుని ధ్యానించి, శిలువను ఆ స్త్రీ నెత్తిపై

నుంచెను. భార్యాభర్తలమధ్య ఆల్బర్టు సమక్షమున ఈ సంభాషణ జరిగినది.

భా : ఈతడెవరోగాని, వాని ఆయుధము చూచిన భయమగు చున్నది. నేను వెళ్లిపోతున్నాను.

భ : ఆ ఆయుధమేమో నీకుతెలియునా, వానికి దానిని ఎవరిచ్చిరి.

భా : అది భగవంతుని ఆయుధము. మనిద్దరిని ఎవరు సృష్టి చేసిరో వాడే ఇచ్చినాడు.

## ఆ ధా ర ము లు

ఈ వ్యాసమునందున్న మొదటి భాగములోని ఆధారము లన్నియూ, మన చరిత్రకు సంబంధించిన గ్రంథములలో దొరుకును. కాని రెండవభాగమునందు ఫా. రాబర్ట్ డి. నోబిలిని గురించిన కథన మంతయూ పోర్చుగీసు, ఫ్రెంచి, ఇటాలియన్ మొదలగు భాషలలోగలవు. ముఖ్యముగా పంజిం-గోవాలోని ఆర్కియివ్స్‌లో మానోకోన్ దొ రెయినో అని కొన్ని సంపుటములు గలవు. వీటియందు గోవాలోని గవర్నర్లకు, పోర్చుగల్ రాజులకు మధ్య నడిచిన ఉత్తర ప్రత్యుత్తరములు గలవు. ఇవియన్నియూ పోర్చుగీసు భాషలో యున్నవి. కొన్నిటికి ఇంగ్లీషు తర్జుమా యుండుటవలన ఈ వ్యాసము వ్రాయుటకు సందర్భమైనది.

రోమ్‌లో జీసెస్ సంస్థ నిర్వహించు చిత్రాలలో హిందూ దేశములోని మతకేంద్రనిర్వాహకులు వ్రాసిన వుత్తరములు వాటికి సమాధానములు గలవు. కాగా, మధుర, కొచ్చిన్, శాంథోమ్,చంద్ర గిరి మొదలగు ప్రదేశములలో క్రైస్తవ కేంద్రములను నిర్వహించు వారి మధ్యన జరిగిన ఉత్తరములలో, నొబిలిని గురించి అనేక విష యములు గలవు.

ఇవిగాక, బర్జస్, సివెల్, కృష్ణశాస్త్రి, రంగాచార్య, ఫ్లీట్ హేరాస్, కృష్ణమాచార్యులు, యాజ్దాని, వెంకయ్య మొదలగు వారు వ్రాసిన, విజయనగర సామ్రాజ్య చరిత్ర గ్రంథములు, ఈ వ్యాసము వ్రాయుటకు తోడ్పడెను.

ఇకపోతే, మరికొన్ని విషయములు హిందూదేశమును చూచి, యధాతథంగా కొందరు వారి వారి డైరీలలో వ్రాసుకొనిరి. అవి అనేక భాషలలో ప్రచురితములైనవి. ప్రచురితములైన గ్రంథ ములు :—

1. Fo-ter : EARLY TRAVELS IN INDIA (En lish)
2. ANGELO De GUBERNALI (Ita ian)
3. IE IN BATUTA (translated by Samuel Lee) London 1829 (Eng ish)
4. DAVID LOPES Lisboa - Chronica Das Resis De Besnaga - 1897 (Portugese)
5. VOYAGES AND TRAVELS OF J ALBERTO De MANDELSLO, London, 1669 (English)

## జ్ఞా పి క లు

1 కేరళలోని సెంట్‌థామస్ అమయాయి అందరకునూ సిరియా క్రైస్తవులను పేరు గలదు. వీరు ప్రప్రథమముగ హిందూదేశమునందు మతమును స్వీకరించిరి.

2 Age of Imperial Unity - Vol. II (Bharatiya Vidhya Bhavan) Page 603 - see.

3 Panikkar K. M. Malabar and the Portugese.

4 Periplus of the Erythrean Sea, - అనునది ఎవరు వ్రాసిన గ్రంథమోగాని, దీని గ్రంథకర్త ఒక 'యవన' దేశపు వ్యాపారస్తుడు. ఇది హిందూదేశపు చరిత్రకు కూడ ప్రమాణ గ్రంథము.

5 The legend that the Apostle Thomas visited the court of an Indian ruler cannot be traced earlier than 3rd century A. D. But it may be admitted that Christian Missioneries visited India from Syria and small Christian communities were established before the end of 2nd century A. D.

Age of Imperial Unity OP. Cit. P. 628.

6 Journal of Royal Asiatic Society : (1898) P. 2723.

7 ఈ ప్రదేశములయందు క్రైస్తవ రోమన్ సామ్రాజ్యాధిపతులైన హేడ్రియన్, అగస్టస్, కాన్‌స్టంటైన్ మొదలగు వారు వేయించిన బంగారు నాణెములెన్నియో దొరికెను.

8 Pyrand de Laval in his appreciation of Goa writes "whoever has been in Goa, may say that he has seen the choicest varieties of India for it was the most famous and celebarated city, on account of its commercial inter-course with the people of all nationalities who bring their products of merchandise and other commodities in abundance. Every year more than 1000 ships touch there laden with Cargo."

9 కొలంబస్ హిందూదేశమునకు మార్గమును కనుగొనవలెనని పోర్చుగల్ నుండి నూటిగా పశ్చిమ దిక్కున ప్రయాణము

చేసి, అట్లాంటిక్ సముద్రమును దాటి, కొన్ని ద్వీపములను చూచి వాటికి 'వెస్టిండీస్' అను పేరిడెను.

10 Panikkar K. M. Op. Cit. P. 21.

11 Several missionaries of different Schools of Roman Catholic religion have settled at Velha Goa. They include Fransiscans, Dominicans, Dom Bosconians, Jesuists, etc.

12 Saldanha. A short History of Goa – P. 63.

13 క్జేవియర్ అవశేషములుగల పేటిక చుట్టున్నూ, వెండి పళ్లెములపై పొదగబడిన దృశ్యములలో ఈ మహిమ లన్నియూ కన్పించును.

14 గుంటూరు ప్రాంతమునందు క్రైస్తవులలో 'శౌరయ్య' అను పేరు వినుచుందుము. ఇది జెసూయిస్టు మహా పురుషుడు క్జేవియర్, జ్ఞాపకార్థం అయివుండవచ్చును.

15 Castets – History of Popes : XIII P. 176 – 7.

16 Catholic Encyclopedia IX : P. 558.

17 Heras - Aravidu Dynasty of Vijayanagara. 1927. P. 365

18 Heras - Op. Cit. 366.

19 Sewell – The Forgotten Empire. P. 230.

20 From Fr.A. Laerzio to Fr.C. Aquaviva.Cochin No. 20. 1607.

21 La Mission de Madure : P. 409 – 110.
వీరు క్జేవియర్‌చే క్రైస్తవులుగ మార్చబడిరి.

22 Satyanatha Aiyar : History of the Nayaks of Madura P. 87.

23 Heras : Op. Cit. P. 351.

24 Danvers Report : P. 4.

25 శాంథోంలోని మత కేంద్రము చాలా పురాతనమైనది. పోర్చుగీసువారు రాకముందే, ఇది క్రైస్తవ మత కేంద్రమని ఎన్నో గాథలుగలవు. ఇచట సెంట్‌థామస్ సమాధి,యుండెనని పోర్చుగీసు మిషనరీలు పుకారు పుట్టించిరి Mendelslo : Voyages and Travels P. 94.

26 History of Catholic Church – II P. 31.

27 From Fr. A. Rubino to Fr A. C. Aquaviva Vellore Sept. 30th 1609. A. P. C. No XXVII.

28 La Mission de Madure. II P. 151.

This word in Sanskrit Pitangin and Persian Prangui, was the name given by the muslims first to the Franks (French) and then to all the Europeans in general (Heras Op. Cit. P. 369 – n).

29 Max Muller – The Science of Languages – I. P. 143.

30 'A Sanyasi from the West', Light of the East, July, 1924 P. 6.

31 From Fr R. De Nobili to Card. R. Bellara - mino, Madura Dec. 1st 1607.

32 Guerreiro : Relacam – Annal ... an anno de 606 & 607 P. 113.

33 Juvenlio: Epitome. P. 76

34 Letter from Fr. Ros. to Fr. Aquaviva. P. 29.

35 I have conversed with Fr. Roberto, says he "about the languages and manners of these people and I was so much impressed by his knowledge, that I who may however be said to know something of the languages are ready to swear everytime that I am allowed to do it that this father cannot have acquired the know - ledge and he possesses, through natural means any more than he can, without the special help of God, lead the austre life he leads.

From Father Roys to Fr. Aquaviva Cochin Nov. 19, 1613.

36 Heras : Op. Cit. 361.

37 La Mission Du Madura : P. 367.

38 Letter to Fr. Ganslavs Fernandez.



# కలగూరగంప

## ‘అశ్వత్థామపై అభాండము’

ఈమధ్య ‘పూర్వ గాధాలహరి’ చూస్తూవుండగా అశ్వత్థామను గురించి క్రింది వాక్యాలు కనిపించాయి. ‘‘అశ్వత్థామ పాండవ శిబిరమును బ్రవేశించెను. నిద్రపోవుచుండిన ధృష్టద్యుమ్నుని, శిఖండిని ఖండించి, యుపపాండవులను నిద్రించు వారిని జంపి, వారి శిరములు దుర్యోధనునకుఁ జూపుటకై తెచ్చెను.’’ అని. ఇది నిజానికి లోకంలో ప్రచారంగా వున్న విషయమే! కాని, ఇంతమంది వీరులున్న శిబిరంలో ప్రవేశించడం అశ్వత్థామ కెలా సాధ్యమైంది? ఒకవేళ సాధ్యమైనా, ఆ వీరులను చంపే సమయంలో అక్కడి రక్షకులవల్లా, ఇతరులవల్లా కొంతైనా కలకలం యేర్పడి వుండదా? అని తిక్కన భారతం చూశాను. తరువాత వ్యాసభారతమూ, తెలుగు భాగవతమూ, సంస్కృతమూలమూ పరిశీలించవలసి వచ్చింది. లోక ప్రవాదానికి విరుద్ధమైన కొన్ని ‘సత్యాలు’ వాటిలో వుండడం నా కాశ్చర్యాన్ని కలిగించి, ఈ వ్రాతకు ప్రేరేపించాయి!

తెలుగు భారతంలో — ఆ రాత్రి అశ్వత్థామ చేసిన మారణహోమాన్ని గూర్చి, ధృష్టద్యుమ్నుని సారధి ధర్మజునితో ఇలా వివరించాడు :

‘‘నరవర మనవీడు నడిరేయి కృతవర్మ
యును గృపాచార్యుండుఁ దనకుఁ దోడు
గా వచ్చి జనులు నిద్రా వివశాత్ములై యుండ
నశ్వత్థామ యొకడు సొచ్చి
తొలుత ధృష్టద్యుమ్నుఁ ద్రుంచి తత్సోదర
తనయాది పాంచాల తతుల ముట్టి
యన్యాయ విధిని నింద్యంబైన విక్రమ
లీలాతిశయమున నేలఁగలిపి

చేది బలమునెల్లఁ జెండి, మాత్స్య ప్రభ
ద్రకులు మేలుకాంచి ద్రౌపదేయు
లను శిఖండిఁ గూర్చికొని తన్నుఁ దాఁకిన
బెట్టు చంపె నంతవట్టు వారి.’’

(—సౌప్తిక–2 ఆ–3 )

ఇది సారధి చెప్పిన సంక్షిప్త విషయం. ఈ సంఘటన సౌప్తిక పర్వ ప్రథమాశ్వాసంలో విపులంగా వుంది.

‘‘అశ్వత్థామ మొదట ధృష్టద్యుమ్నుని శిబిరంలో ప్రవేశించి, అతనిని కాలితాపుతో మేల్కొలిపి, అల్లె త్రాటితో అతని కంఠాన కురి బిగించి, సమయించినాడట. ఆ కలకలానికి చుట్టు ప్రక్కలనున్న రాజులు మేల్కొన్నారు. అతనిని చుట్టుముట్టినారు. వారిలో యుధామన్యునీ, ఉత్తమౌజునీ సైతం ఆ విధంగానే దారుణంగా హతమార్చినాఁ డశ్వత్థామ. తన కెదురు వచ్చిన చతురంగ బలాన్ని కొద్ది క్షణాల్లో పీనుగు పెంటగా మార్చివేసినాడు. ఇంత కోలాహలం జరగడంతో శిబిరమంతా పూర్తిగా మేల్కొన్నది. ఈ వార్త కర్ణాకర్ణిగా పాండవేయులకూ, శిఖండికీ తెలిసింది. వాళ్ళు ససైన్యంగా అతనిని యెదుర్కొన్నారు. శస్త్రాస్త్రచయములతో అతనిని ముంచెత్తినారు. కాని, అశ్వత్థామ కిది యేమాత్రం భారం కాలేదు. అతడవలీలగా ప్రతివింధ్యునీ, శ్రుతసోమునీ, శతానీకునీ, శ్రుతసేనునీ, శ్రుతకీర్తినీ, అనంతరం శిఖండినీ వరుసగా సంహరించినాడు. తరువాత పాండవ శిబిరంనుండి వెడలి, కృప కృతవర్మలతో గూడి, దుర్యోధనుని దర్శించి, తాను చేసిన ‘కార్యాన్ని’ వినిపించి, తృప్తిపఱచినాడు.’’ — ఇలా సాగింది తిక్కనగారి భారతగాధ.

దీనికి మూలం కూడా కథా విషయంలో మార్పేమీ లేకుండా ఇలాగే వుంది. దీన్నిబట్టి వెల్లడి ఔతున్న విశేషాలను క్రిందివిధంగా లెక్కించుకోవచ్చు.

(1) అశ్వత్థామ ధృష్టద్యుమ్నుని నిద్రిస్తూ వుండగా సంహరింపలేదు. అతనిని మేల్కొలిపి, మెడ కురి బిగించి సంహరించాడు.

(2) శిఖండినిగానీ, ఉప పాండవులను గానీ నిద్రిస్తున్న వారిని ఖండించలేదు. వారు మేల్కొని ఉండడమే కాకుండా, సర్వసైన్య సన్నద్ధులై, శస్త్రాస్త్రములతో యెదుర్కొన్నారు అప్పుడు వారిని సంహరించడం జరిగింది.

(3) వారి శిరంబులు దుర్యోధనుఁడు చూచుటకై అతడు తేవడం జరుగలేదు. అవి యుద్ధరంగంలోనే విడువబడినాయి. అంతే కాదు, ధర్మరాజు ఈ విషయం విన్న తర్వాత అక్కడికివచ్చి, వారికి అగ్ని కార్యాది విధులను కూడా ఆచరించాడు.

భారతంలో ఇంత స్పష్టంగా ఇలా వర్ణింపబడి వుండగా, మరి, ‘పూర్వగాధాలహరి’లో దీనికివిరుద్ధంగా వివరింపబడివుండటం ఆశ్చర్యకరం గదా! పైగా దీనికి ‘ఆకరం’ ‘భారతమే’అని సూచింపబడటం మరింత వింతగా వుంది. ఏమైనా, అశ్వత్థామ పాత్రకు ఈవిధంగా అన్యాయం జరిగిందని చెప్పకతప్పదు. అతడు రాత్రి సమయంలో రహస్యంగా శిబిర ప్రవేశం చెయ్యటాన్ని యెవరూ సమర్థింపగోరరు కాని చెయ్యని నేరాన్ని అతనిపై మోపడంమాత్రం అసమంజసం గదా !

అశ్వత్థామను గురించిన ఈ అపవాదు కేవలం పూర్వగాథాలహరిదే అనలేము. లోకంలో ప్రసిద్ధికూడా అలాగే వుంది అయితే, ఈ దుష్ప్రసిద్ధి రావడానికి కారణం యేమిటి? దీని ప్రశంస మరెక్కడైనా వుందా? అనే ఆలోచన ఈదశలో రావడం సహజం! ఆలోచిస్తే భాగవతం స్ఫురించింది. అందులో ఈ ప్రస్తావన స్పష్టంగా ఉండడమేగాక, పై ‘పూర్వగాధాలహరి’ వ్రాతకు ప్రోద్బలకంగా కూడా కనిపించింది, చూడండి.

"భీము గదా ఘాతంబున దుర్యోధనుండు దొడలు విటిఁగి కూలిన నశ్వత్థామ దుర్యోధనునకుం బ్రియంబు సేయువాఁడై నిదురవోవు ద్రౌపదీ పుత్రుల శిరంబులు ఖండించి తెచ్చి సమర్పించె." (1 - 140)

ద్రౌపది బంధితుడైన అశ్వత్థామను చూచి, పల్కిన పలుకులలో కూడ ఇదే భావమే మరింత స్పష్టీకరింపబడింది. ఆ పలుకులివి —

"ఉద్రేకంబున రారు శస్త్రధరులై యుద్ధావనిన్ లేరు కించి ద్రోహంబును నీకుఁజేయరు బలోత్సేకంబుతోఁ జీకటిన్
భద్రాకారులఁ బిన్న పాపల రణప్రౌఢ క్రియాహీనులన్
నిద్రాసక్తుల సంహరింప నకటా నీ చేతు లెట్లాడెనో!" (1–161)

ఈ పద్యంలో వారు శస్త్రధరులై రాలేదనీ, నిద్రాసక్తులై ఉన్నారనీ వెల్లడి ఔతుండగా, పై వచనంలో నిదురవోవు ద్రౌపదీ పుత్రుల శిరంబులు ఖండించి తెచ్చి సమర్పించినట్లు విదితమౌతున్నది. కాబట్టి పూర్వగాథాలహరి వ్రాతకు ఇదే ఆధారమై ఉండవచ్చునని భావింపవచ్చు.

'చదవేస్తే ఉన్నమతి పోయిం'దన్నట్లు, ఈ చర్చవల్ల, సుప్రసిద్ధమైన భారత భాగవత ఇతి వృత్తాలకే వైరుధ్యంయేర్పడి, ఎటూ తోచని సందిగ్ధస్థితి యేర్పడింది.

"కర్ణ పరం పరాప్తగతమున సన్నాహగాఢమై యెక్కడెక్కడ యని కడఁగి
శిఖండి, ద్రౌపదేయులును దానుఁబన్ని యుద్వృత్త శౌర్య
మానతుంగ ప్రభద్రక మాత్స్యతతులుఁ
దోడ బలువిడిఁ దఱుమంగ ద్రోణ తనయు
ముట్టి శస్త్రాస్త్రచయముల ముంచుటయును."

అని వారు శస్త్రధారులైనట్లు భారతం ఘోషిస్తూ వుంటే, భాగవతం "ఉద్రేకంబున రారు శస్త్రధరులై" అని ఉద్ఘోషిస్తూవుంది. వీటిలో ఏది నిజం ?

తెలుగు భారత భాగవతాలకు వేర్వేరుగా తిక్కన్న పోతన్నలు కర్తలైనా, సంస్కృతమూలానికి మాత్రం వ్యాసు డొక్కడే కర్తగావడంవల్ల పై ప్రశ్నకు సమాధానం లభింపవచ్చునన్న ఆశ కలిగి సంస్కృత భాగవతం చూడగా, అందులో ఇలా వుంది.

"వృకోదరావిద్ధ గదాభిమర్శ భగ్నోరుదండే ధృతరాష్ట్రపుత్రే।
భర్తుః ప్రియం ద్రౌణి రితి స్మ పశ్యన్ కృష్ణాసుతానాం స్వపతాం శిరాంసి॥
ఉపాహరత్ విప్రియమేవతస్య జుగుప్సితం కర్మవిగర్హయన్తి."

ఈ వాక్యాల్లో వ్యాసుడు కూడ "స్వపతాం శిరాంసి ఉపాహరత్" అనే అన్నాడు పోతన ఈవాక్యాలనే అనువదించాడు యథాతథంగా! అయితే, వ్యాసుడే పరస్పర విరుద్ధంగా రచించాడనుకుందామా? — కాని, ఈ అనుకునేముందు కొంచెం నిదానించడం అవసరమని తోచుతోంది.

భారతంలో చెప్పబడింది విపులమైన సౌప్తికపర్వం. భాగవతంలో చెప్పబడుతున్నది మూడు మాటల స్థూలకధనం. పైగా, ఇక్కడ "శిరాంసిఉపాహరత్" అంటే "శిరములను సంహరించెను" అనే వ్యాసుని తాత్పర్యం· కాని పోతన మాత్రం దాన్ని కొంత పొడిగించి — "శిరంబులు ఖండించి, తెచ్చి సమర్పించె" అన్నాడు. ఈ తెచ్చి సమర్పించడం పోతన స్వకపోల కల్పితం అనుకోవాలి!

అయితే, ఇక్కడ"స్వపతాం" (నిద్రించుచున్న వారియొక్క) అని వ్యాసుడే అన్నాడు గదా! అని ప్రశ్నించవచ్చు నిజంగా ద్రౌపదేయులు నిద్రించడంలేదు, శిరస్సులు ఖండింపబడే సమయంలో. మరి దీనికి సమన్వయం ఎలా ?

ఇక్కడ రసనిష్ఠమైన కవి హృదయాన్ని సహృదయతతో అవగాహన చేసుకోవడం అవసరం. వారు చెప్పదలచింది సౌప్తికపర్వమంతటి విస్తార విషయాన్ని. భాగవతంలో ఉన్న అవకాశం రెండు మూడు వాక్యాలు మాత్రమే! అందువల్ల — "అశ్వత్థామ ధృష్టద్యుమ్నుని మేల్కొల్పి హతమార్చడం, ఆ కలకలంతో ద్రౌపదేయులు ఎదుర్కొనడం" మొదలైన వివరమంతా వ్రాయకుండా, అశ్వత్థామ క్రూరత్వాన్ని ధ్వనింపజేస్తూ "స్వపతాం శిరాంసి" అని స్థూలంగా, వారు చెప్పినట్లు భాసిస్తోంది. అంతేగాక, నిజంగా కూడా, ద్రౌపదేయులు అప్పుడప్పుడే నిద్ర నుండి మేల్కొని ఆ తొందరలో వచ్చినారనే భావాన్ని కూడా ఇక్కడ అనుసంధించుకుంటే, ఆ 'స్వపతాం' అనే మాట రసనిర్భరం, సార్థక మనక తప్పదు.

కాని, 'ఉద్రేకంబున రారు శస్త్రధరులై' అని ద్రౌపది పల్కడం సమంజసమా ? అని మూలంచూస్తే, అసలీ పద్యభావమే అందులో లేదు. అంతేకాదు, తెలుగు భాగవతంలోవలె ద్రౌపది అశ్వత్థామను అధిక్షేపించడం కూడ మూలంలో లేదు. దానికి బదులుబంధితుఁడై వున్న ద్రౌణినిచూచి, ఆమె కరుణాపూర్ణయై, నమస్కరించి, "ముచ్యతాం ముచ్యతా మేష బ్రాహ్మణో నితరాం గురుః"

ఇత్యాదిగా ఆవేదన చెందినట్లు వర్ణితమై వుంది. అందువల్ల భారత కధనమే నిజమైందని నిర్ధరించవచ్చు.

ఏతావతా, 'పూర్వగాథాలహరి' అశ్వత్థామపై వేసిన అభాండానికి ఆధారంగా తెలుగు భాగవతమైతే నిల్చిందికాని, ఆ భాగవతానికి మూలాధారం మాత్రం సరిగా లేక పోవడంతో, దీని బాధ్యత అంతా పోతన్నగారిపైనే పడుతోంది. ఆయనకు భక్తి పుట్టినా, బాధ కలిగినా, అన్నీ అతిశయాలే! కనుక అశ్వత్థామ ద్రౌపదేయుల శిరంబులు తెచ్చి సమర్పించడం, వారేమో నిద్రాసక్తులై వుండి శస్త్రధరులే కాకపోవడం మొదలైనవన్నీ పోతన్నగారి అతిశయోక్తి విన్యాసాలని భావించడం సమంజసం గదా!

**శ్రీ వింజమూరి విశ్వనాధమయ్య**

# నందిదుర్గ శాసనకాలము

కర్ణాటక రాష్ట్రములో కోలారుజిల్లాలో వేసవి విశ్రాంతి కేంద్రముగా ప్రసిద్ధమైన నందికొండ కలదు. ఆ కొండ మొదట నందిగ్రామము కలదు. ఆ గ్రామమందలి సోమేశ్వరాలయమందు సంస్కృత శ్లోకాత్మకమైన శాసనమొకటి కలదు. శ్రీ టి. యల్. నరసింహారావుగారిచే పరిష్కృతమైన ఈ శాసనము మద్రాసు ఓరియంటల్ మాన్యుస్క్రిప్టు లైబ్రరీవారు 1949లో ప్రచురించి యున్నారు. (**Bulletin of the Govt. Oriental Manuscript Library, Madras. Vol. II No. 2. Page 41**) ఈ శాసనమందు 'కృష్ణరాజు' అను ప్రభువుయొక్క ప్రశంస కలదు. 'యస్యాష్ట కవి దిగ్గజాః పృధుయశో భారా జగచ్ఛ్రీభవాః' అని ఆ కృష్ణరాజు ప్రశంసింపబడియున్నాడు. (శ్లో. 18) అష్ట దిగ్గజ కవుల ప్రశంసయుండుటచే ఇందు ప్రశంసింపబడిన కృష్ణరాజు విద్యానగర ప్రభువును, ఆంధ్ర భోజ బిరుదాంచితుడును తుళువ వంశీయుడును అగు శ్రీకృష్ణదేవరాయలే అని కొందరు భావించుచున్నారు.

కాని ఇచ్చట ఒక చిన్న చిక్కు వచ్చినది. ఈ శాసనపు 11వ శ్లోకములో శాసనకాలము పేర్కొనబడినది. దానిని పరిశోధకులు 'కల్యాంర్త్వ భాగము గుణేష్వబ్దేషు' అని పఠించిరి. ఇందు సాంకేతికముగ పేర్కొనబడినది కలిశకము 3486, అనగా క్రీ. శ. 385 అగుచున్నది. ఇది మన శ్రీకృష్ణదేవరాయలకు సుమారు 1150 సంవత్సరముల పూర్వపుదగుచున్నది అందుచేతనే శాసన పాఠ పరిష్కర్తలైన శ్రీ టి. యల్. నరసింహారావుగారిట్లభిప్రాయపడిరి.

**"The 11th verse gives the date of the construction of the temple as 3486 Kali year. However, it doesnot really correspond to the cyclic year Vikrithi, which falls in the year 4631 Kali, the year in which the death of Krishnadevaraya has been established. Though the date of the inscription appears to be spurious, it has got its own value in describing the architecture of Indian Temples."**

శాసనమందు చెప్పబడిన కాలము సరియైనది కాదని శ్రీ నరసింహారావుగారి అభిప్రాయము. "కృష్ణదేవరాయలవారి కాలమునకు ఇది సరిపడుటలేదు. కావున నిందు పేర్కొనబడిన కృష్ణరాజు మరియొకడై యుండవచ్చును" అని కూడ వారభిప్రాయపడిరి.

ఇట్లుండగా పరిశోధన పరమేశ్వరులైన నిడుదవోలు వేంకటరావుగారు శాసన కాలమును శ్రీకృష్ణదేవరాయల పరిపాలనా కాలముతో సరిపుచ్చుచు ఒక సరిక్రొత్త వివరణము నిచ్చిరి.

"కల్యాంర్త్వ భాగమ గుణేషు" అను శ్లోకభాగమున సంఖ్యాపరిగణమును ఆయా సాంకేతికార్థములలో నొకదాని ననుసరించి చేయుటవలన శాసనకాల నిర్ణయము తప్పినది.

ఋతు=6; విభా=8; ఆగమ=4; గుణ=3
=3486 అని ప్రకటనకర్తల పరిగణన. కాని
ఋతు=6; విభా=4; ఆగమ=5; గుణ=3

అని పరగణించిన, ఈ కాలము, కలిశకము 3546 అగును.



ప్రస్తుత కలిశకము 5073. కావున

5073
3546
శాసన కాలము— 1527 అగును.

క్రీ. శ. 1527లో రాయలు తిప్పలూరును అష్టదిగ్గజ కవీశ్వరులకు సర్వాగ్రహారముగా నిచ్చెను. ఆ సంవత్సరముననే, అష్టదిగ్గజ కవుల ప్రశంస మైసూరు రాష్ట్రమందుగల నందిదుర్గ క్షేత్రమున సోమశంకరదేవునకు భూ దానము చేసిన సమయమున కృష్ణరాయలు ప్రత్యేకముగా నుట్టంకింపజేసెను. కాబట్టి నందిదుర్గాలయ శాసనకాలము క్రీ. శ. 1527 అని నిర్ణయమగును.

ఈ సంఖ్యా పరిగణవమునకు సమర్ధన.

విభా అనగా దిక్కులు దిక్కులను అష్టదిక్కులుగాను(8) చతుర్దిక్కులుగాను (4) పరిగణన **ము**న్నది. అష్టదిక్కులకన్న చతుర్దిశలు విశేష ప్రచారములో నున్నవి.

ఆగమములు, వేదములు '4' అని పరిగణనయున్నది. కాని, రాయలు విశిష్టాద్వైత సంప్రదాయము ననుసరించిన వైష్ణవ శిఖామణి. వైష్ణవులకు పాంచ రాత్రాగమము ప్రధానము. కాబట్టి ఆగమ సంఖ్య '5'గా మనము గ్రహింపవలెను. ఇట్లు శాసన పాఠము నేమాత్రము మార్పుచేయకయే శాసన కాలము క్రీ. శ. 1527తో సరిపోవుచున్నది." (శ్రీ కె. ఎస్. కోదండరామయ్యగారు రచించిన 'అష్టదిగ్గజ కవి సమాజములో రాయల నాశ్రయించిన తొలి కవి ఎవరు?' అను గ్రంథమున కొసంగిన అనుబంధము; పుట 80).

శ్రీ వేంకటరావుగారెట్లో శాసన కాలమును కృష్ణరాయల కాలముతో సరిపెట్ట గలిగితిమని సంతృప్తిచెందినారు. కాని పరిశీలింపగా వారు చేసిన వివరణ అనేకములగు అవకతవకలతో కూడియున్నదిగా కనుపించుచున్నది.

1. **మొ**దటికి 'కల్యాంర్త్వ భాగమగుణేషు' అను పాఠము సరియైనదికాదు. అది 'కల్యృత్వి భాగమగుణేషు' అని యుండదగును. 'కలి + ఋతు=కల్యృతు' అని యణాదేశము**తో** రూపమేర్పడగలదు. 'కల్యాంర్త్వభా' అనుచో పద విభాగము చేయుటెట్లో తెలియదు. మరియు శ్రీ వేంకటరావుగారు చేసిన 'ఋతు + విభా' అను విభజన దుష్టము. ఋతు + విభా='ఋతు విభా' అనియే అగును గాని 'ఋత్విభా' అని ఏర్పడదు. ఋతు +

ఇభ='ఋత్విభ' అని యణాదేశముతో రూపమేర్పడగలదు. కనుక ఋతు+ఇభ+ఆగమ+గుణ అనియే పదవిభజన చేయవలెను. శ్రీ టి. యల్. నరసింహారావుగారు ఇట్లే విభజించుకొనియే 3486 అను సంఖ్యను చెప్పిరి.

2. 'విభా' అను పదమునకు కాంతి మొదలగు అర్థము లున్నవి గాని దిక్కు అని ఏ నిఘంటుకారుడును అర్థమీయలేదు.

3. ఆగమములు అయిదుగా చెప్పుట సంప్రదాయముకాదు. పాంచరాత్రాగమపరులైనను ఆగమములు అయిదని చెప్పినట్లు ఇతరాధారములు మృగ్యములు. ఆయుర్వేదము, ధనుర్వేదము, నాట్య వేదము, గాంధర్వవేదము, ఇట్లు అనేక విద్యలు వేదసంజ్ఞతో చెప్పబడుచున్నవి. అసలు పంచమ వేదమను ప్రఖ్యాతి వడసిన భారతమే ఉన్నది. ఐనను నిరుప పదముగా వేదములు అనినచో నాలుగనియే ప్రసిద్ధి. లేదా అధర్వణవేదమును పరిగణింపక మిగిలిన వానికి 'త్రయి' అనియు ప్రసిద్ధముగ వ్యవహారము కలదు. ఆగమములకు పంచసంఖ్యా పరిగణనము సంప్రదాయ విరుద్ధము.

4. అన్నింటిని మించిన అవకతవక శాసనకాలమును నిర్ణయించుటకు శ్రీ వేంకటరావుగా రనుసరించిన విధానము మిక్కిలి హాస్యాస్పదముగ నున్నది. వారు కలిశకము 5073 అనగా క్రీ. శ. 1972లో ఈ కాలనిర్ణయము చేసిరి. నాటి కలిశక సంవత్సరసంఖ్య 5073లో శాసన కలిశక సంవత్సర సంఖ్య యగు 3486ను తీసి వేయగా 1527 శేషము వచ్చినది. ఈ సంఖ్య శాసనము రచింపబడిన నాటినుండి లెక్కవేసెడి నాటికి గడచిన సంవత్సరముల సంఖ్య యగునని ప్రాథమిక పాఠశాల విద్యార్థికూడ చెప్పగలడు. శ్రీ వేంకటరావుగారు దీనిని క్రీస్తుశకపు సంవత్సరముగా చెప్పుచున్నారు. కలియుగ సంవత్సర సంఖ్యలో 3101 తీసివేసినచో క్రీస్తుశక సంఖ్య రాగలదు. కలి 3486కు సరియగుక్రీస్తుశక సంఖ్య 385 కాగలదు.

శ్రీ వేంకటరావుగారి పరిగణనలోని దోషమును మరియొక విధముగ కూడ నిరూపింపవచ్చును. ప్రస్తుత కలిశక సంఖ్య 5079. శ్రీ వేంకటరావుగారి పద్ధతి ననుసరించి 5079 నుండి 3486ను తీసివేసినచో 1533 వచ్చును. శాసన కాలము క్రీ. శ. 1533 అగును. నేటినుండి మరొక 20 ఏండ్ల తరువాత ఇట్టి లెక్కకే పూనుకొన్నచో నాటి కలిశక సంఖ్య 6000లో 3486 తీసివేయగా 1554 లభింపగలదు. వీనిలో ఏది సరియైనది?

శ్రీ వేంకటరావుగారి పరిగణన పద్ధతి దోషభూయిష్ట మనుట స్పష్టము.

శాసన పాఠము తప్పుగా చదువబడి యుండవలెను. లేదా శాసనమందు చెప్పబడిన కృష్ణరాజు మన కృష్ణదేవరాయలుగాక మరొకడై యుండవలెను.

ఇది ఇంకను పరిశీలింపవలసిన విషయము.

*డా చర్ల గణపతిరావు*

## కప్పర్ల శిలాశాసనం

ఆదిలాబాదు జిల్లా ఆదిలాబాదు నగరానికి సుమారు 10కి. మీ.ల దూరంలోని చిన్న గ్రామం 'కప్పర్ల' దీనిని 'ఖప్పర్ల' అని కూడా పిలవడం కద్దు. నిజాం కాలంలో ఉర్దూలో 'ఖప్పర్ల' అనే వ్రాసేవారు. ఆ రోజుల్లో ఇది జాగీరు గ్రామం. రాయరాయాన్ బహద్దూరువారు జాగీర్దారు. అప్పుడిది "అమానత్‌మత్ జాగీర్దార్ ఖప్పర్ల" అని పిలువబడేది. జాగీర్దారు వ్యవస్థ రద్దుతో జాగీరు కవిలనంతా ఆనాటి యువరాజా శ్యామ్‌రాజ్ బహద్దూరువారు తహశీలు కార్యాలయంలో అప్పగించారట. ఐతే ఇప్పుడా కవిల కాగితాలు కార్యాలయంలో లభించడం కష్టం.

ఇప్పటికి ఐదారు సంవత్సరాలకు పూర్వం ఈ గ్రామంలో శ్రీ ఉప్పలంచి సాంబన్న గుప్తగారు తమ పొలం దున్నించుతుండగా కొన్ని శిలాఫలకాలు, ప్రసక్తమైన శాసన స్తంభ భాగం బయటపడ్డాయి. ఇవేకాకుండా కొన్ని ఇటుకలు కూడా వెలువడ్డాయి. శిలాఫలకాలు దేవాలయ నిర్మాణానికి ఉపయోగింపబడ్డవిగా ఉన్నాయి. ప్రస్తుతం ఇవి శ్రీ సాంబన్నగారి పశువులకొట్టం మెట్లుగా ఉపయోగపడుతున్నాయి. ఇటుకలు తేలికగానూ దృఢంగానూ ఉన్నాయి. వీటిని తమ పెద్దబావి గోడ కుపయోగించారు శ్రీ సాంబన్నగారు.

శాసనం చెక్కబడిఉన్న శిల ఒక స్తంభంయొక్క భాగం. ఎత్తు 83 సెం.మీ.లు. వెడల్పు 27 సెం. మీ. లు. మందం 14 సెం. మీ.లు. వెడల్పాటి రెండువైపులా కొన్ని బొమ్మ లున్నాయి. ఈ రెండువైపులూ మూడేసి భాగాలుగా విభజింపబడ్డాయి. ఒకవైపు శాసనం చెక్కబడింది. నాలుగోవైపు ఖాళీగా ఉంది.

### మొదటిప్రక్క

పై భాగంలో నాట్యంచేస్తున్న స్త్రీ, మధ్యన బుద్ధుడిని పోలిన తపస్వి బొమ్మలు.

మధ్యభాగంలో ఎడమప్రక్క నంది. మధ్యన ఆదిశేషుడిలా ఉన్న బొమ్మ ఉన్నాయి. ఇది సరిగా గుర్తు తెలియడంలేదు.

చివర నాట్యం చేస్తున్న స్త్రీ, తపస్వీ బొమ్మలున్నాయి. పై భాగంలోని తపస్వికి ఈతనికి ఒక ముఖ్యమైన భేదం ఈతడి తల వెనకాల ధర్మచక్రం చెక్కబడి ఉండడం.

ఈ మూడు భాగాలలోనూ కుడివైపున కూడా బొమ్మ లున్నాయి. కాని అవి స్పష్టంగా తెలియరావడంలేదు.

### వెనుకప్రక్క

పై భాగంలో నాలుగు మూర్తులున్నాయి.

మధ్యన పై మూర్తుల పాదాలక్రింద పడుకొని ఉన్నట్లుగా ఒక స్త్రీమూర్తి చెక్కబడి ఉంది.

అడుగు భాగంలో ఇద్దరు వీరుల ద్వంద్వయుద్ధం చెక్కబడి ఉంది. వీరిలో ఒకరు అశ్వారూఢుడు. మరొకరు పాదచారి.

## రెండవ ప్రక్క

ఇందులోనే శాసనం చెక్కబడి ఉంది. మొత్తం 17 పంక్తులు. ఇది అసంపూర్తిగా కనబడుతున్నది. కారణం లభించిన శిల స్తంభంయొక్క కొంతభాగం కావడమే. త్రవ్వకాలు కొన సాగిస్తే పూర్తి భాగం బయటపడవచ్చు. లిపి దేవనాగరి. భాష దేవనాగరి లేక మహారాష్ట్రం కావచ్చు.

## నాలుగవ ప్రక్క

ఏమీలేదు.

ఈ వ్యాసకర్తకు శాసన పరనాది కాలలో ఏమాత్రం అను భవం లేనందున ఈ శాసనంయొక్క ప్రాముఖ్యత ఏమిటో ఇద మిత్థంగా చెప్పలేకపోతున్నాడు

పెద్ద లెవరైనా పూనుకొని ఈ విషయంలో పరిశ్రమించా లని ప్రార్థన. ప్రభుత్వ పురాతత్త్వ శాఖవారు ఈ ప్రాంతంలో త్రవ్వకాలు చేస్తే ఇక్కడ దేవాలయం బయటపడే అవకాశం ఉంది. శాసనం పూర్తిభాగం లభించవచ్చు.

దీనివల్ల ఈ ప్రాంతపు చరిత్రలో ఏ కొద్ది విశేషం తెలివిడి అయినా చరిత్రవేదులు ఆ పెద్దలకు కృతజ్ఞులు కాగలరు. పెద్ద లెవరైనా కోరితే శాసన పాఠాన్ని పంపగలను.

*శ్రీ ముదిగొండ ఈశ్వరచరణ్*

## కళ్లువిప్పి చూడండి మహాప్రభో !

శ్రీ మరుపూరు కోదండరామిరెడ్డిగారు డిసెంబరు '78 'భారతి'లో చేసిన 'చైత్రవంది' సమీక్ష చదివినాక యీ ముక్కలు మూడూ వ్రాయక తప్పడంలేదు! అంతా బాగానే వుందట గాని నేను దారినబొయ్యే తగువును కొని నెత్తికి దెచ్చుకున్నానట. అందు చేత యిది వ్రాస్తున్నాను.

అసలు విషయమే అస్తవ్యస్తంగా మొదలుపెట్టి పైగా అనేక అపోహలకు దురూహలకు తావిస్తూ నేను పీఠికలో వ్రాసిన మాటల్ని వక్రంగా చిత్రించారు కోదండరామిరెడ్డిగారు. కృష్ణ శాస్త్రి వేదుల తర్వాత కవులు ఆంధ్రదేశంలో అరుదయిపోయా రనేంతటి మూర్ఖత్వమూ, వారిద్దరి తర్వాత ఆంధ్రసాహిత్యలక్ష్మి వొట్టిపోయిందనే దుస్సాహసమూ నాకింకా పట్టుబడలేదు. నేను వ్రాసిన మాటల్ని పాఠకుల సౌకర్యార్థం ఈ క్రింద పొందుపరు స్తున్నాను :

"కృష్ణశాస్త్రి కృష్ణపక్షమూ, వేదుల దీపావళి తర్వాత అంతటి భావనిర్భరత, చారిమ, సొబగులున్న భావకవితా సంపుటులు ఆంధ్రదేశంలో అరుదయిపోయినాయి. మళ్లీ యింతకాలానికీ 'చైత్రవంది'! కృష్ణశాస్త్రి మృదుమధుర మనోజ్ఞభావ సంచ యమూ, వేదుల కుసుమ నవపేశల భాషాసౌరభమూ సంతరించు కొని వారి సంప్రదాయాన్ని అక్షరాలా పాటించి అందని లోతులకూ అగకుండా మరెవ్వో ఎత్తులకూ వెళిపోయారు — నరసింహస్వామి గారు."

పై మాటల్లో ఎక్కడన్నా కవులు అరుదయిపోయారనీ, కృష్ణశాస్త్రి, వేదుల మరల యీకవి పుట్టినాడనీ అర్థంస్ఫురిస్తున్న దేమో రెడ్డిగారే తెలియజేయాలి.

ఆంధ్రదేశంలో భావకవిత్వపు ధోరణుల్లో, సంప్రదాయాల్లో కొన్ని రకాలున్నాయి. వాటిలో కృష్ణశాస్త్రి, వేదుల సం పదాయం ఒకటి. కవికొండల, బసవరాజు, నండూరి వీరి సంప్రదాయం మరొకటి — అది ఆశు సంప్రదాయం స్ఫూర్తిగా గొన్నది. అందు చేత శ. నరసింహస్వామిగారు మొదటి సంప్రదాయాన్ని అక్షరాలా పాటించారని ఘంటాపథంగా చెప్పగలుగుతున్నాను.

మరొక విషయమేమిటంటే శ్రీమాన్ రెడ్డిగారు ఒకపెద్ద పట్టీ యిచ్చి వీరంతా భావుకులు కదా అని ప్రశ్నిస్తున్నారు. కాదన్న వారెవరు ? కాని ప్రస్తుత విషయం — భావకవిత్వం — భావుకత్వం కాదు. భావకవికి— భావుకుడికీ వుండే fundamental difference రెడ్డిగారికి ఎందుకు తట్టలేదో నాకర్థం కావడం లేదు. ఆ మాట కొస్తే కవులు మాత్రమే భావుకులా ? ఎంతమంది కథారచయితలూ, నవలాకారులు భావుకులు లేరు — చలం, బుచ్చిబాబు, పెద్దిభొట్ల సుబ్బరామయ్య, శ్రీపాద, మల్లాది వీరంతా వచనమే వ్రాసినా వారిలో భావుకత్వానికి లోటేమి వచ్చింది.

రాయప్రోలు భావకవితోద్యమాద్యుడే ఆయన తర్వాతి వచ్చినవాళ్లే కృష్ణశాస్త్రి—వేదుల. అందుచేత రాయప్రోలును గమ నించక పోవడమనే ప్రసక్తిలేదు. ఇక శ్రీశ్రీ — నా కళ్లకు కనిపిం చక పోవడమేమిటి ? శ్రీశ్రీ మహాప్రస్థానంలో, ఖడ్గసృష్టిలో అద్భుతంగా కనిపిస్తాడు. కాని 'ప్రభవ'లో కాదు. ఆయనే వ్రాసు కున్నట్టు అందులో చాలావాటికి భాషాతీవ్రత, శయ్యా సౌభాగ్యమూ వున్నా అన్వయ క్లిష్టత చాలా వున్నది. అందుచేత భావ కవిగా — శ్రీశ్రీని - శ్రీశ్రీయే ఒప్పుకోడు. ఇకపోగా జాషువాను భావకవి అనడం హాస్యాస్పదంగా వున్నది. ఆయన ఛందోబద్ధంగా వ్రాసినా, ఆయన వ్రాసిన దంతా పచ్చి 'అభ్యుదయ కవిత్వం'. ఇక నాయని, దువ్వూరి రామిరెడ్డి మొదలయిన కవులు నిశ్శంకగా భావకవులే. అందుకే నేను 'అరుదు' అనే మాట వాడాను.

పై విషయాలు దృష్టిలోకి తీసుకొని రెడ్డిగారు తమ విమర్శను ఉపసంహరించుకోవలసిందని విజ్ఞాపన చేస్తున్నాను.

మంచి కవిత్వాన్ని ఎవరూ పరిచయం చేయనక్కరలేదు. ఎవ్వరూ స్తుతించనక్కరలేదు. మిత్రులైనంత మాత్రాన — పొగిడినంతమాత్రాన ఆ కవిత్వానికి గొప్పదనము రానూరాదు. కవిత్వం తనంతట తానుగా పాఠకుడికి సమర్పించుకుంటుంది. మంచి కవిత్వమయితే వాళ్ల హృదయాల్లో పదికాలాలపాటు భద్రంగా వుంటుంది.

*శ్రీ ముళ్లపూడి శ్రీనివాస ప్రసాద్*

## ప్రజాకవి ఎవరు?

1978 డిసెంబరు 'భారతి'లో శ్రీ పులిచెర్ల సాంబశివరావు చిరుమామిళ్ళ సుబ్బదాసుగారిని ప్రజాకవిగా ప్రశంసించారు.

ప్రజాకవి అంటే కేవలం భర్మహర్మాల్లో కూర్చొని పేదవారి కష్టాల్ని గూర్చి ఆలోచించి, వారిపట్ల జాలిని ప్రదర్శిస్తూ కవిత లల్లేవాడా? లేక వారిమధ్యనే జీవిస్తూ, వారి సమస్యల్లో భాగం పంచుకొని, వారినా కష్టాల నుండి గట్టెక్కించడానికి కృషిచేసే రచనలు చేసేవాడా? ఎవరు ప్రజాకవి?

ఆధునిక కవియైనా, పూర్వకవియైనా తన రచనలు ద్వారా ప్రజల్లో అలుముకొన్న అజ్ఞానాన్ని పారద్రోలడానికి ప్రయత్నించ గలగాలి.

పూర్వ కవుల్లో ప్రజాకవిగా గుర్తించ గలిగేందుకు అర్హత వున్నవాడు వేమన. అలాగే ఇటీవలి కాలంలో గురుజాడ అప్పారావు.

వేమన తన చాటువుల్లో ప్రజల సమస్యలు తీసుకొని, వాటిని పరిష్కరించుకొనే మార్గాలు చూపాడు. ప్రజల్లో అలుముకొన్న అజ్ఞానాంధకారాన్ని తొలగించే ప్రయత్నం చేశాడు.

'రాళ్ళు దేవుళ్ళయిన రాసులు మింగాలా' అంటూరాతిని దేవుడిగా పూజించే వారికి కళ్ళు తెరిపించాడు. సంఘాన్ని సంస్కరించే ప్రయత్నం చేశాడు.

ఇక గురుజాడవారు తమ సమకాలీన సమస్యలను తీసుకొని వాటిని పరిష్కరించడానికి తమ రచనలద్వారా కృషి చేశారు.

దేశమంటే మట్టికాదని విప్పిచెప్పారు. బాల్యవివాహాలవల్ల కలిగే అనర్థాల్ని వివరించారు.

కానీ దాసుగారు ప్రజాకవిగా చేసిందేమిటో చూడాలి.

''చిలుక పల్కులు జెప్పి యా చిల్క
పల్కుల కాపేక్షపడు దొరమాడ్కి...
........................
.................. మీ పాద సరోజ
భక్తుడనై మీరు పలికించునట్టి
యుక్తులు బలికెద యొప్పగా వినుము''

అంటూ కృష్ణుడితో చెప్పారట.

తర్వాత శ్రీ పులిచెర్ల సాంబశివరావు ''ఆయన (దాసుగారు) భక్త్యావేశంతో గోపాలునిమీద శతకాలకు శతకాలే రాశారు'' అని, ''దాసుగారు పనిపాట్లు చేసుకుంటూ గూడా భగవన్నామస్మరణ చేస్తూవుండే వార''ని రాశారు.

ఇక పల్నాడులో రోగాలెక్కువయ్యాయట అప్పుడు మందులు మాకులు లేవని, అందువల్ల దాసుగారు అడుగొప్పుల, పప్పిచెర్ల గ్రామాల్లో సంచరించి, ప్రజలకు ధైర్యం చెప్పారట. ఆవరకు ఏదోవిధంగా ఆయన్ని సమర్థించవచ్చు. ''ఆంజనేయోపాసనతో అంటువ్యాధుల్ని తుదముట్టించారు'' అనడం పులిచెర్లగారి అమాయకత్వానికి జాలిచెందాలో, వారి ఈ సమర్థింపుకు కోపం తెచ్చుకోవాలో అర్థంకాదు.

రోగాలకు మందులు ఈనాటివికావు పురాణకాలంనుండి రోగాలు మందులుతోనే నయం చేయబడుతున్నాయి. ఈనాటిలాగా అల్లోపతిమందులు, ఇంజెక్షన్లు లేకపోవచ్చుకానీ, ఆయుర్వేద మందులు, మూలికలు భారతదేశంలో 19వ శతాబ్దంలో లేవనడం నిజాన్ని చాచడంగా భావించాలి.

ప్రజల్లో అంటువ్యాధుల్ని మందులతోకాక ఆంజనేయోపాసనతో నయం చేయబూనడం, ప్రజల్ని అజ్ఞానాంధకారంలోకి తోయడమే కాగలదు. ఈ అంటురోగాల పాలైన వారిలో దాసుగారి మూర్ఖత్వం నమ్ముకొని ప్రాణాలు పోగొట్టుకొన్నవారెందరో ఆరాతీసి, రాసుంటే శ్రీ పులిచెర్లవారు కొంత న్యాయం చేసిన వారై వుండేవారు.

అమ్మవారు తాకిడి ఎక్కువైతే దాసుగారు ఆయాగ్రామాల్లో పోలేరమ్మ కీర్తనలు పాడుతూ సంచరించారట.

దాసుగారు 1800 నుండి 1881 వరకు జీవించినట్లు వ్యాసకర్త రాశారు. అమ్మవారు వ్యాక్సిన్ 1798 ప్రాంతాల్లో కనుగొనబడింది. బహుశః వీరి జీవిత కాలంలోనే ఆ వ్యాక్సిన్ మన ప్రాంతాల్లో ప్రయోగించి వుండొచ్చు. కనీసం ఆ వ్యాక్సిన్ గురించి దాసుగారికి తెలిసి వుండవచ్చు. కానీ వారు ప్రజలకు దానిని గూర్చి తెలుపక, పోలేరమ్మను గురించి కీర్తనలు పాడుతూ తిరిగారు.

శ్రీ పులిచెర్ల తమ వ్యాసంలో చివరి ప్రయత్నంగా దాసుగారు తమ దుర్గపురాధీశ శతకంలో డబ్బున్నవాడిని తిట్టారని, కనీసం అందువల్లనైనా వారు ప్రజాకవి కాకపోతారా యని భావించి అటువంటి పద్యాలు రెంటిని వుదహరించారు.

డబ్బున్నవాడిని కేవలం తిట్టడంకాదు ప్రజాకవి చేయాల్సిన పని. ధనికుడిని తిట్టుతూ, శాపనార్థాలు పెట్టడంవల్ల కడుపు కక్కి గల కసి తీరుతుందేమో కాని, లేనివాడి ఆర్తి తీరదు

ఒకడు ధనికు డవడానికి, మరొకడు పేదవాడుగా మిగిలిపోవడానికి సామాజిక కారణాలను శాస్త్రీయంగా ప్రజలకు వివరించాలి ప్రజలకు తెలియజెప్పేముందు రచయిత తాను ఆ కారణాలను

తెలుసుకోవాలి. ప్రతి రచయితా యిలా చేస్తాడా అంటే అందరు రచయితలు, కవులు గురించి నే చెప్పడంలేదు. ప్రజాకవి అన్నవాడు ముఖ్యంగా చేయాల్సిందిది.

ప్రజాకవికి బాధ్యతలు ఎక్కువగా వుంటాయి. అతను అట్టడుగున వున్న ప్రజలతో తాదాత్మ్యం చెంది, వారితో జీవించాలి. వారి కష్టాలను దైవ ప్రేరితాలుగానో, పూర్వజన్మ ఫలితాలుగానో చిత్రించి, వారి కష్టాలకు విరుగుడుగా దైవనామ స్మరణను మార్గంగా నిర్దేశించకుండా, వారి సమస్యలకు కారణాల్ని కనుగొని, వాటిపై నిరంతరం పోరాడడానికి వారిలో తగిన చైతన్యాన్ని కలిగించే రచనలు చేయాలి.

వ్యాసకర్తకు దాసుగారిపైన భక్తి వుండొచ్చు. అటువంటప్పుడు వార్ని భగవద్భక్త కవిగా చిత్రిస్తే నా కభ్యంతరంలేదు. కానీ వారి ఈ రాతల్లో 'ప్రజాకవి' నిర్వచనాన్నే వక్రీకరించడానికి ప్రయత్నం స్పష్టంగా కన్పిస్తోంది.

పీడితుల్ని, తాడితుల్ని, బాధాసర్పదష్టుల్ని, నిరంతరం సమాజంలో దోపిడీకి గురౌతున్న నూటికి 90 మందిగా వున్న నిజమైన ప్రజను చీకటిమండి వెలుగులోకి తేవడానికి చిర నిద్రనుండి మేల్కొల్పడానికి తీవ్రంగా కృషిసల్పే కవి నిజంగా ప్రజాకవిగా గుర్తింపబడతాడు.

అటువంటి రచనలు ప్రజాకవితలుగా నిలుస్తాయి. మిగతావి కాలక్షేప కవితలుగా మాత్రమే మిగులుతాయి.

*శ్రీ ముదార్ వేణు*

## విమర్శా విధానం

ఫిబ్రవరి '79 'భారతి' సంచికలో కలగూరగంపలో శ్రీ నందిని సిధారెడ్డిగారి 'దుర్విమర్శ' చూచాను. 'స్టేజీలమీద దొర్లే మాటల్నుంచీ, పేజీలమీద మెరిసే వాక్యాల్నుంచి మేలుకో' మన్నారు వ్యాసం చివరలో. నిజంగా శ్రీ రెడ్డిగారు ఈ మాటల్ని 'ప్రాక్టికల్'గా నిరూపించారీ వ్యాసంలోనే. కేవలం 'బజారు మాటల్తో' నిండివుందీ వ్యాసం. సంపాదకులు కూడా ఇలాంటి వాటిని సాహిత్య విలువలు లేనివాటిని—సాహిత్య పత్రికైన దానిలో ప్రకటించటం ఆశ్చర్యకరం. 'కలగూరగంప'ను గుత్తకు తీసుకొన్నట్లని ఒకర్ని విమర్శించిన శ్రీ రెడ్డిగారు, పాఠకుల్నంగర్ని లేదా, 'భారతి'నే, గుత్తకు కొనినట్లుగా, ప్రత్యేకించి ఒక రచయిత్రినీ, ఒక పార్టీని అభిమాన పురస్సరంగా ఉద్దేశించటంలో ఔచిత్య మేమున్నది?

ప్రజలంటే యేమిటో రంగనాయకమ్మే తెలియజేయాల్సిన పన్లేదు. జనంలో చొచ్చుకుపోవటాన్ని ఇందిర హస్తమే నేర్పవలసిన పనిలేదు. ఉత్తరాదివారి నడిగితే వారూ చెబుతారుగా? సంకుచిత ధోరణిని విడనాడాలితప్ప, దుమ్మెత్తిపోస్తూ, తన రచన్ని ఘోరంగా విమర్శించాడే అన్న అక్కసును ప్రదర్శిస్తే అది విమర్శ కాదు; దానిని ప్రకటించటం సంపాదకులకు ఉచితమూ కాదు.

ఏది ఏమైనా 'డప్పు వాయించుకోగలవాడే' నేటి సమాజంలో కవీ, కళాకారుడూ ఇ. ఔతున్నాడనే 'చేదు నిజాన్ని' శ్రీ రెడ్డిగారు ఒప్పుకున్నారే! మానివా సరే! ఇదిమాత్రం నిజం!

ఇదే సంచికలో ''మనస్సిద్ధాంత ప్రేరకము''పై చెణకు విసరిన శ్రీ కె. అంజయ్యగారు రెండుమార్లు పొరబడుతూ, మొత్తం వ్యాసంమీద తమ 'దురభిప్రాయాల్నీ, అమాయికతనూ' ప్రదర్శించారు. వ్యాసం మొదలు పెట్టడమే 'నమస్కారం'తో. అక్కడే మొదట పొరబడ్డారు. 'నమస్కరించటం' దౌర్బల్యక్రియ అనిమాత్రమే గ్రహించిన 'మానసిక దౌర్బల్యం'లోనుంచి శ్రీ అంజయ్యగారు త్వరగా బైటపడాలి. 'నమస్క్రియ' విలువ అంతమటుకే అని తెలిసిన విమర్శకునకు 'నమస్కారం' గురించి ఎక్కువగా వివరించటం 'దౌర్బల్యమే' ఔతుంది.

రెండవది 'కర్మ'ను తీవ్రంగా విమర్శించిన విమర్శకుడు చివరకు వ్యాసాంతంలో ఆ కర్మనే ఉపయోగించి తమ చెప్పవలసిందానిని పూర్తిచేశాడు. ఇది స్వవచో వ్యాఘాత మనుకొన్నా, అది ఆయన కర్మ మనమేం చేస్తాం!

ఇక 'భగవద్గీత', వ్యాసరచయితకు అనేకానేక అనుమాన పరంపరనే అందించటం ఆయన ప్రకృతజన్మ కర్మే అనాలి. అంతే కాక 'వర్ణవ్యవస్థను' శ్రీకృష్ణుడు ప్రోత్సహించినట్లుగా భావించటం ఆతని 'పాండిత్యానికి' నిదర్శనం. తన పూరిగాధను చిత్రీకరించాడు బాగా. భాగవతంలో 'అజామిళుని'కథ లేదనుకున్నాడు కాబోలు! ఇవి కువిమర్శలు! 'భారతి' ఇలాంటి రచనలనెలా స్వీకరిస్తూందో నా కర్థం కావటంలేదు. 'స్థాయి' కాపాడుకోవాలని నా మనవి.

*దినకర్*

# లేఖలు

## కాకతి మైలాంబ బయ్యారం చెరువు శాసనము : శాసనకాల నిర్ణయము

క్రీ. శ. 1220–30 ప్రాంతమున రామదేవకవి శాసన కర్తగా గల కాకతి మైలాంబ బయ్యారం చెరువు శాసనమును శ్రీ పి. వి. పరబ్రహ్మశాస్త్రి మహోదయులు లోగడ 'భారతి' పత్రికలో ప్రకటించి, నావంటి శాసన విద్యార్థులకు చక్కని గ్రంథ బోధనమును వెలయించియున్నారు. శాసన పాఠమును నేను చదువు కొనుచుండగా చివరి శ్లోకమును పరిశీలించిన నాకు యీ విషయము కనబడినది. శాసనము డెబ్బదిశ్లోకముల పరిమాణము. డెబ్బది ఒకటవ శ్లోకము న చిత్తగించండి :-

శ్రీ ధర్మకీర్తియుత మైలసముద్ర నామ్నా
హేమ్నా తడాగ వరపీష కృతస్వభూమ్నా
ఆమ్నాయవేద్య విభవస్య, రమేశ్వరస్య
సామ్నాస్తుతస్య — శయనాబ్ధి సమస్సదాస్తు !!

—అనుటనుబట్టి చూడగా — "శయనాబ్ధి రమేశ్వరస్య, ఆమ్నాయవేద్య విభవము"—గల కాలము (శయన, రమేశ్వర, అబ్ధి,
౧ ౧ ౭
ఆమ్నాయ వేద్యవిభవము) ౧౧౭౪ (1174 శ. సం.) దీనికి సరి
౪
యగు క్రీస్తుశకము 1174+78=1252గా తేలుచున్నదిగదా! అప్పటికి మైలాంబ (మల్లికాంబ) "ధర్మకీర్తి" గలదియై తన డెబ్బది (70) యవ ఏట మైలమ బయ్యారం చెరువు (మైలమ సముద్రం) అను పేర త్రవ్వించెనుట సరిపోల్చదగినదని నా వూహ.

పూజ్యపాదులు శ్రీ పరబ్రహ్మశాస్త్రిగారు పరిశీలించి, దయతో తగు నిర్ణయమును ప్రకటింప ప్రార్థన. విజ్ఞులైన శాసన పరిశీలనా పఠనాసక్తులునూ యీ సూచనను గమనించ ప్రార్థన.

*శ్రీ ఇలపావులూరి శేషగిరిరావు*
*"గిరీంద్ర"*

# సమాధానము

పై లేఖయందు బయ్యారం చెఱువు శాసనములో ఆ శాసన కాలమును సూచించునట్టి శ్లోకము కలదని లేఖ రచయిత వ్రాయుచున్నారు. కాకతి గణపతి దేవుని సోదరియగు మైలాంబ చేత త్రవ్వించబడి గొప్పగా నిర్మించబడిన ఆ చెఱువునకు ఆమె బిరుద నామమగు ధర్మకీర్తిపదముతో గూడిన మైలసముద్రనామ మొసగబడెను. అనగా 'ధర్మకీర్తి మైలసముద్రము' అను సువర్ణాక్షరములతో నది చిరస్థాయిగ వర్ధిల్లుగాక యని ఆశాసించుచు శాసన కావ్యము మంగళాంతముగ ముగియుచున్నది. ఆ తడాగము వేదవేద్యమగు విభవము గలిగినట్టియు, సామవేదముతో స్తుతింపబడునట్టియు రమాదేవి పతియగు శ్రీ మహావిష్ణువు శయనించు సాగరమువలె సదా వర్ధిల్లుగాక యని శ్లోకములోని ద్వితీయార్ధము తెలుపుచున్నది. "ఆమ్నాయ వేద్య విభవస్య రమేశ్వరస్య, సామ్నాస్తుతస్య శయనాబ్ధి సమస్సదాస్తు" అని.

ఈ రెండవ వాక్యమును తెలుపు పదములలో శాసనకాలమిమిడియున్నదని వారు భావించిరి. 'శయనాబ్ధి, రమేశ్వరస్య, ఆమ్నాయవేద్య, విభవస్య' అను పదములలో శయన = 1; రమేశ్వరస్య = 1; అబ్ధి = 7; ఆమ్నాయ = 4 అని వారు తెలిపిరి. కాని 'శయన' పదము, 'రమేశ్వర' పదము ఒకటవ సంఖ్యను తెలుపునవిగా ప్రసిద్ధమైలేవు. కావున వాటిని ఆ సంఖ్యావాచకములుగా స్వీకరించుట కష్టము. అబ్ధిపదము చతుస్సముద్రములనుబట్టి 4సంఖ్యను తెలుపునుగాని వారు భావించినట్లు సప్త సముద్రములనుబట్టి 7 సంఖ్యను తెలుపునదిగా వాడుకలోలేదు. కనుక వారు సూచించిన 1174 శకవర్షము పైపదముల నుండి గ్రహింపబడదు. అదిగాక, 'అంకానాం వామతోగతిః' అను నియమమునుబట్టి మొదట ఒకట్ల స్థాన సంఖ్య, తరువాత పదుల స్థానములోని సంఖ్య, తరువాత వందల స్థానములోనిది, ఆ తరువాత వేల స్థాన సంఖ్య క్రమముగ వాక్యములోగాని శ్లోకములోగాని సాధారణముగా చెప్పబడుచుండును.

ఇచట ఆమ్నాయ వేద్య విభవస్య (=4); రమేశ్వరస్య (=వారనుకొన్నట్లు 1); సామ్నాస్తుతస్య (= వారికి నిరర్థకము); శయన (=వారనుకొన్నట్లు 1); అబ్ధి (=వారనుకొన్నట్లు 7) అనే క్రమంలో చెప్పబడినవి. దీనినిబట్టి శకము 7114 కావలెను. లేదా యథాతథముగా గ్రహించిన యెడల 4117 కావలెను. కాని 1147 లేక 1174 కాదు. తరువాత మూడవ అనుపపత్తి ఉన్న విభక్త్యంతములతో ప్రతి పదార్థము జెప్పుకొన్నచో వారూహించిన వాక్యార్థము కుదురదు. కొన్ని పదములు నిరర్థకము లగును. కనుక నీ తుది శ్లోకార్ధమునుండి సంఖ్యావాచక పదములు గ్రహించబడవు. అది విష్ణుపరముగ జెప్పబడిన మంగళాంతము మాత్రమే.

*శ్రీ పరబ్రహ్మశాస్త్రి*

డిసెంబరు 1978 'భారతి'లో శ్రీ కోడూరి శ్రీరామమూర్తిగారు 'మూడుదశాబ్దాల తెలుగు సాహిత్యంలో స్వీయచరిత్ర' అనే వ్యాసం చదివాక ఈ లేఖ వ్రాయాలనిపించింది.

శ్రీరామమూర్తిగారు తమవ్యాసంలో శ్రీ దువ్వూరి వేంకటరమణ శాస్త్రిగారి స్వీయ చరిత్రను పేర్కొనకపోవడం ఎంతో ఆశ్చర్యం కలిగించింది. శాస్త్రిగారు తమ జీవితకాలమంతా గ్రాంథిక భాషలోనే రచనలు చేసికూడ, చక్కని వ్యావహారిక భాషలో స్వీయ చరిత్ర రచించి ప్రకటించడం చెప్పుకోదగ్గ విశేషం. ఆచార్య యస్వీ. జోగారావుగారు శాస్త్రిగారి స్వీయ చరిత్ర ముద్రణ ప్రయత్నానికి నడుంకట్టి గుంటూరుజిల్లా రచయితల సహకార సంఘం ద్వారా ప్రకటింపజేయడం అభినందించ దగింది. స్వర్గీయ శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారి 'అనుభవాలూ — జ్ఞాపకాలూను'తో సాటి రాగల స్వీయచరిత్ర 'రమణీయ స్వీయ చరిత్ర'.

1976లో డా॥ అక్కిరాజు రమాపతిరావుగారు 'వెన్నెలకంటి సుబ్బారావు (1784–1839) జీవయాత్రా చరిత్ర' అనే స్వీయ చరిత్రను ఇంగ్లీషు నుంచి అనువదించి పుస్తక రూపాన ప్రకటించారు. నూట నలభై సంవత్సరాల క్రిందట దీనిని సుబ్బారావుగారు ఇంగ్లీషులో వ్రాశారు. ఇది మొదట 1873లో ప్రకటితం. ఒక తెలుగు మహాశయుడు వ్రాసిన మొట్ట మొదటి స్వీయచరిత్ర ఇది. ఇంగ్లీషులో తెలుగువాడు వ్రాసిన మొదటి గ్రంథంగా కూడ దీనిని పేర్కొనవచ్చును. ఈ విషయం కూడా శ్రీరామమూర్తిగారు తమ వ్యాసంలో ప్రస్తావించవలసింది.

శ్రీరామమూర్తిగారు తమ వ్యాసంలో బుచ్చిబాబు రచనను 'నా అంతరంగ మథనం'గా మూడుసార్లు పేర్కొన్నారు. బుచ్చి

బాబు వ్రాసిన పుస్తకంపేరు "నా అంతరంగ కథనం." "మథనం" కాదు.

— 'కనక ప్రవాసి'

## అంకెగారికి మరో సూచన

ఫిబ్రవరి సంచిక 'కలగూర గంప'లో సిధారెడ్డి 'అంకె'గారిని విమర్శిస్తూ 'అంకె' గారు చేసిన మరో ప్రధానమైన పొరపాటును పేర్కొనలేదు. శివారెడ్డిగారి కవిత 'దుఃఖాన్ని మాత్రం పిలవకు'లో పేర్కొన్నది ఎటువంటి దుఃఖమో ఆ కవిత మొత్తం చదివితే తెలుస్తుంది అది "నన్నని నాజూకైన నిస్సత్తువ వేళ్ళున్న ప్రేయసి"ని గూర్చిన దుఃఖం. భావ కవిత్వంపైన, భావ వాదాల పైన కవికున్న నిరసనను అది చూపిస్తుంది.

శ్రీ గుడిహాళం రఘునాథం

జయసింహసూరి మహాకవి (విక్రమశకం తొమ్మిది) ప్రణీత "ధర్మోప దేశమాలా – వివరణ"లో ఒక చక్కని శ్లోకము ఉదాహరించబడినది. చిరన్తన పద్యము కానోపు. కాని రెండవ పాదము లుప్తము. జిజ్ఞాసువులగు సాహితీ రసికులు లుప్త పాదమును తెలుప ప్రార్థితులు.

ఆ చిరన్తన శ్లోకము ఇది.

అప్రాతే రమతే నారీ
... ... ... ... ... ... ...।
నీచమాశ్రయతే లక్ష్మీః
ప్రాజ్ఞః ప్రాయేణ నిర్ధనః ॥

శ్రీ ఇ సాయిబాబా

## తెలుగులో మొట్టమొదటి పిహెచ్. డి పటము

తెలుగులో మొట్టమొదటి పిహెచ్. డి పట్టము కీ. శే. కళాప్రపూర్ణ డా. చిలుకూరి నారాయణరావుగారిదని జగమెరిగిన సత్యము. కాని ఆచార్య కాకర్ల వెంకటరామనరసింహంగారు తమ 'ఆంధ్రప్రబంధము—అవతరణ వికాసములు' అను పరిశోధిత గ్రంథమున కృతజ్ఞతలు తెలుపుచు ఇట్లు వ్రాసియున్నారు :

'నా పరిశోధన వ్యాసంగమునకు పర్యవేక్షణ వహించి, పరిశోధనకు వలయు సాధన సంపత్తి నేటివలె సమృద్ధిగాలేని యానాడు (1941 – 44) తమ ప్రతిభా ప్రాభవముతో జేయూతనిచ్చి, తెలుగులో మొట్టమొదటి పిహెచ్ డి పట్టము పొందజేసిన అస్మద్గురువర్యులు, ఆచార్య శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారికి......' అని తెలిపికొనియున్నారు. దీనిని బట్టి గమనించిన ఆచార్య కాకర్ల వెంకటరామనరసింహంగారే మొట్టమొదట పిహెచ్. డి పట్టము సంపాదించినవారని విదితమగుచున్నది. ఇది పెక్కు అపోహలకు దారితీయుచున్నది.

1. బహుశః వీరు ఆంధ్రవిశ్వవిద్యాలయములో మొట్టమొదటి పిహెచ్. డి కావచ్చును. 2 తెలుగు భాషలో వ్రాసిన మొదటి పిహెచ్. డి పట్టభద్రులు కావచ్చును.

డా. రావుగారు 1929లో 'పదునొకండవ శతాబ్దమునాటి తెలుగుభాష' అను విషయముపై పరిశోధక వ్యాసము వ్రాసి మద్రాసు విశ్వవిద్యాలయమునుండి పిహెచ్ డి డిగ్రీని పొందిరి. ఇది ఆంగ్లమున వ్రాయబడిన వ్యాసము. ఈ విషయమునే శ్రీ తంగిరాల వెంకటసుబ్బారావుగారు వ్రాయుచు "మొత్తము తెలుగు సాహిత్యములో మొట్టమొదటి పిహెచ్. డి పట్టమును గైకొన్న మహనీయులు కీ. శే చిలుకూరి నారాయణరావు పంతులుగారు. క్రీ. శ. 1929లో **'Telugu Language of the 11th Century'** అను విషయముపై పరిశోధక వ్యాసమును వ్రాసి మద్రాసు విశ్వవిద్యాలయము నుండి Ph. D డిగ్రీని పొందిరి ఈ వ్యాసమును ఆంగ్లమున వ్రాసిరి మద్రాసు విశ్వవిద్యాలయమున తెలుగు పరిశోధక వ్యాసములన్నియు ఆంగ్లముననే వ్రాయవలెనను నియమమున్నది... చిలుకూరి నారాయణరావుగారికి గిడుగు రామమూర్తి పంతులుగారు పర్యవేక్షకులట (Supervisor)." [చూ. స్రవంతి, ఫిబ్రవరి 1966, పుటలు 9–10].

ఇట్లే మరి కొందరి అభిప్రాయముల నుట్టంకించుట దోషముకాదు. 'గిడుగువారి అడుగు జాడలలో చిలుకూరి నారాయణరావుగారు, నన్నయ కాలమునాటి భాష (11వ శతాబ్ది తెలుగు భాష)ను గూర్చి విశేష పరిశ్రమ చేసి ఒక గ్రంథముగా రూపొందించి మద్రాసు విశ్వవిద్యాలయమున పట్టము బడసినారు' అని శ్రీ నిడదవోలు వెంకటరావుగారు వ్రాసినారు. [చూ భారతి, నవంబరు 1972, పుట 10] వారే అదే పుటలోని అధోజ్ఞాపికలో "చిలుకూరి వారే తెలుగు భాషలో మొదట 'పిహెచ్. డి' పట్టము పొందినవారు. ఇప్పుడున్న, కాబోవు 'పిహెచ్. డి'లందఱకు పితామహులు (1929)" అని వ్రాసియున్నారు.

అట్లే డాక్టరు పోణంగి శ్రీరామ అప్పారావుగారును 'తెలుగులో ప్రప్రథమముగా డాక్టరేట్ పట్టమును పొందినవారు నారాయణరావుగారు' అని తమ 'తెలుగు నాటక వికాసము' [చూ. పుట 419]లో చెప్పియున్నారు.

ఈ యభిప్రాయములను గమనించిన డా. రావుగారే తెలుగులో ప్రప్రథమ పిహెచ్ డి పట్టభద్రులని నిస్సందేహముగా నిర్ధరింపవచ్చును. అట్లయినప్పుడు ఆచార్య కాకర్ల వెంకటరామనరసింహంగారు తాము 'తెలుగులో మొట్టమొదటి పిహెచ్. డి పట్టము' పొందినవారు అని చెప్పికొనుట యందలి సామంజస్యమేమో బోధపడకున్నది. ఆచార్య వెంకటరామనరసింహంగారు తెలుగులో మొట్టమొదటి పిహెచ్. డి పట్టము పొందినవారు కారనుట సత్యము. వారి సిద్ధాంత వ్యాసము తెలుగులో వ్రాయబడిన మొట్టమొదటి పరిశోధక వ్యాసమని మాత్రము చెప్పవచ్చును.

''డా. కె. వి. ఆర్. నరసింహంగారి 'ఆంధ్రప్రబంధము'– ప్రబంధ వాఙ్మయమును సూక్ష్మ పరిశీలనదృష్టితో విమర్శించి నిగ్గు తేల్చిన యీ సిద్ధాంత వ్యాసము ఆంధ్ర విశ్వవిద్యాలయాంధ్ర శాఖలో పొటమరించిన తొలి విమర్శగ్రంథసుమ''మని మహతిలో చెప్పబడియున్నది (చూ. మహతి, శీర్షిక: పరిశీలనం–విమర్శ నాత్మక సారస్వత విలోకనం, పుట 231). కనుక ఇట్టి పొరపాట్లు ఒక్కొక్కమారు అసలు వ్యక్తులనే మరుగుపరచినట్లగును.

మరియొక విషయము. తెలుగు అకాడెమీవారు ప్రచురించిన 'తెలుగు పరిశోధన సంహిత'లో కాని, యువభారతి వారు ప్రచురించిన మహతిలో కాని డా. చిలుకూరి నారాయణరావుగారి పేరు పిహెచ్. డి పట్టములను పొందినవారి జాబితాలో లేకపోవుట కడు శోచనీయము. ఆంధ్రశారదను జీవితాంతము ఆరాధించి ఆంధ్ర భాషా సాహిత్యములకు ఎనలేని సేవయొనర్చిన మహనీయులను విస్మరించుట మిక్కిలి విచారకరము. గ్రంథముద్రణ సమయమునకు కావలసిన సమాచారము అందకపోవుటచే ఇట్లు జరిగినదని పుస్తక ప్రకాశకులు అనవచ్చును. కాని కనీసము వారి వివరముల నంతటిని పేర్కొనకపోయినప్పటికిని పేరైనను పేర్కొని యుండవలసినది కదా! ఇట్టి ప్రామాణిక గ్రంథములయందే పేర్కొననప్పుడు తెలుగు భాషాసాహిత్యములలో ఇట్టి మహనీయులకు స్థానమెక్కడయుండును? మరుగు పడిన మాణిక్యములను ఇంకను మరుగుపరచుట సమంజసమా ? భవిష్యత్తులో ఇట్టి పొరపాట్లు జరగకూడదని ఆశించుచున్నాను.

*డా. జి. యస్. మోహన్*

# తెలుగులో మొదటి తీసిస్

కళాప్రపూర్ణ, మహోపాధ్యాయ డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు 'పదనకొండవు శతాబ్దమునాటి తెనుంగుభాష' పై పదుమూడు సంవత్సరాలు పరిశోధన చేసి దానిని మొదట తెలుగులో రాసుకొని నన్నయ భారతంలోని ఆదిపర్వం ద్వితీయాశ్వాసం 1–120 పద్యాలుగల గరుడోపాఖ్యానం అనేక తాళప్రతులలో తైపారచేసి ప్రధాన గ్రంథానికి అనుబంధంగా జోడించారు. దాన్ని ఇంగ్లీషులో సిద్ధాంత గ్రంథంగా తయారుచేసి 1927లో మద్రాసు విశ్వవిద్యాలయానికి సమర్పించారు. వారికి ఆ విశ్వవిద్యాలయంవారు పిహెచ్.డి పట్టాన్ని ప్రసాదించారు.

డిగ్రీ రాగానే 1928లో వారి తెలుగు మూలకృతిని అచ్చువేశారు. దాని ముఖపత్రం :

పదనకొండవు శతాబ్దము
**నాటి**
తెనుంగు భాష
చిలుకూరి నారాయణరావు ఎమ్. ఎ.
డాక్టర్ ఆఫ్ ఫిలాసఫీ పిహెచ్. డి.
బిరుదమునకుంగాను
చెన్నపురి విశ్వవిద్యాలయంవారికి
సమర్పించినది.
1928
శ్రీ సాధన ముద్రాక్షరశాల,
అనంతపురం.

ఈ గ్రంథాన్నే 1937లో ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారు రెండు సంపుటాలుగా అచ్చువేసిన ఆంధ్రభాషాచరిత్రలో డాక్టరు రావుగారు రెండో సంపుటంలో 1328 పుటనుండి 1570వరకు ఒక అధ్యాయంగా చేర్చుకొన్నారు.

పిండితార్థం: డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు తెలుగులో డాక్టరేటు సంపాదించుకొన్న వారిలో ఆద్యులు.

సిద్ధాంత వ్యాసాన్ని తెలుగులో వ్రాసి అచ్చువేయించుకొన్న వారిలో కూడా డాక్టరు రావుగారే ఆద్యులు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో మొదటి పిహెచ్. డి. పట్టాన్ని పొందినవారు డాక్టరు కె. వి. ఆర్. నరసింహంగారు.

*(ఒ వి)*

1978 ఏప్రిల్ 'భారతి'లో శ్రీమల్లినాథ సూరిపై నేను వ్రాసిన శ్లోకములలో మత్తేభ వృత్తమని పడ్డది. ''అది 22 చందంలో తభయజసరనగ అను గణాలల్లో నడిచే వృత్తం మత్తేభము కానేకాదు. అనియు శ్రీ కాళిదాస కృతంగ దేవీప్రణవ శ్లోక అని 12 వృత్తాలున్నాయి. అవి యీ చంధస్సులోనే నడుస్తాయి.

శ్లో॥ చేటీ భవన్నిఖిల ఖేటీ కదంబ వన వాటీషు నాకి పటలీ।

అని నడిచే దీన్ని అశ్వధాటీ వృత్తమని చెప్తారు.'' అని డిసెంబరు 'భారతి' పత్రికలో శ్రీ బండి నాగరాజుగారు వ్రాసి ప్రకటించారు. నేను సంస్కృత ఛందో గ్రంథాలలో చూచాను. కాని అశ్వధాటి వృత్తము ఎక్కడా కనిపించలేదు. ఇకపోతే వృత్త రత్నాకర గ్రంథములో 22వ ఛందములో ''ఆకృత్యాస్'' అని శ్లో॥ తోభౌ య జౌ సరనగాః పంక్తి సూర్యయతి మత్తేభ మత కథితం। అను లక్షణ శ్లోకమున్నది. వ్యాఖ్యానంలో గూడా తభయజ సరనగ అను గణములతో మత్తేభ వృత్తమని వ్రాయబడ్డది. ఆ వృత్తరత్నాకర గ్రంథము 1898లో శ్రీ వావిళ్ల వెంకట రామస్వామిగారి వేదాంత రత్నాకర ముద్రాలయములో ముద్రింపబడినది. ఆ గ్రంథములో చూచి మత్తేభ వృత్తమని వ్రాసినాను. శ్రీ బండి నాగరాజుగారు యే గ్రంథాన్ని చూచి మత్తేభ వృత్తము కానే కాదని వ్రాసినారో నాకు వారు విస్పష్టంగా పత్రికాముఖంగా తెలియపరచగలరని కోరుచున్నట్లు తెలుపగలరు.

*శ్రీ ముత్యంపేట సాంబారాధ్యా శాస్త్రి*

# గ్రంథ విమర్శలు

## కాదంబరీ రసజ్ఞత

[రచన : శ్రీ పేరాల భరతశర్మ, సంస్కృతోపన్యాసకుఁ, పిఠాపురాధీశ ప్రభుత్వ కళాశాల, కాకినాడ. డెమ్మీసైజు 242 పుటలు. (60 పేజీలకు పైగాఉన్న పీఠిక అభిప్రాయాలు మొద లైనవి కాక) అట్టమీది చక్కని వర్ణచిత్రంతోసహా వెల 15 రూపా యిలు. ప్రకాశకులు, ప్రాప్తిస్థానం: శ్రీ పి. యస్. బాలకృష్ణ, బాలకృష్ణ పబ్లికేషన్సు, 7–3-17, ప్రకాశంవీధి, రామారావు పేట, కాకినాడ.]

సంస్కృత మహాకవులలో బాణునిస్థానం విశిష్టమైనది. అతని కాదంబరి. గద్యకావ్యాలలో ప్రథమశ్రేణిని మాత్రమేకాక ప్రథమస్థానాన్ని ఆక్రమించింది. ''బాణోచ్ఛిష్టంజగత్సర్వం ''అనే అభియుక్తోక్తిని అందరూ ఎరుగుదురు. అతడు తన కృతిలో వాడని సంస్కృతపదంలేదు. సమగ్రంగా వర్ణించని విషయంలేదు. ఇది కావ్యరూపంలో ఉన్న విజ్ఞాన సర్వస్వమనే చెప్పాలి. దీని అధ్య యనంవల్ల సంస్కృతంలో చక్కని పాండిత్యం అలవడగలదు.

తెలుగునాట సంస్కృతాంధ్రాలలో వివిధగ్రంథాలను గురించి అపూర్వపరిశీలనలు జరుగుతున్నా యిదివరలో ఈ కాదంబరీ వైశి ష్ట్యాన్ని పరిశీలించడానికి విద్వద్విమర్శకు లెవ్వరూ శ్రద్ధ చూపి నట్లు కానరాదు· కథా విషయంలోనేకాక కల్పనా విషయంలో కూడా తికమకలు పెట్టించే దీనిని పరిశోధించే ఓపిక ఎంతోమందికి ఉండదు. ఇదివరలో దీని సమగ్ర పరిశీలన వెలువడకపోవడానికి ఇది కారణమై ఉండవచ్చు ననుకుంటాను. ఇప్పటికయినా ఇట్టి పరి శీలనగ్రంథం వచ్చినందుకు వాఙ్మయాభిమానులు సంతోషించవలసి ఉన్నది.

ఈ కృతికర్త అయిన పేరాల భరతశర్మగారు సంస్కృ తాంధ్రాలలో సమర్థులైన విద్వాంసులు! కాదంబరిని విమర్శక దృష్టితో పరిశీలించి విద్వాంసులకున్నూ అచుంబితమైన అనేక విషయాలను ఇందు వెల్లడించారు. ఈ గ్రంథరచనకయి వైదిక, సంస్కృత, ఆంధ్రగ్రంథాల నెన్నింటినో పఠించారు. ఆ పట్టిక అను బంధంలో ఇయ్యబడింది. దీనినిబట్టి వీరి నిశిత పరిశీలన వెల్లడి అవుతున్నది.

రచయిత యీ పుస్తకంలో తొమ్మిది శీర్షికల్లో తమ పరి శోధనా ఫలితాలను వివరించారు. తన రచన సర్వజనామోదాన్ని పొంది పది కాలాలపాటు ఉండాలంటే రచయిత తన రచనలో లీన మయిపోవాలి. కృతికర్త అయిన బాణుడు తన రచన అయిన కాదం బరిలో ఎలా లీనమయినదీ మొదటి అధ్యాయంలో వివరించబడినది.

మన దురదృష్టంవల్ల బాణుని కాదంబరి, అతని హర్ష చరిత్ర—రెండూ కూడా అసమగ్రంగానే ఉండిపోయాయి. అయినా, కాదంబరినిమా తం ఆయన కుమారుడు పూర్తిచేశాడు. తండ్రి గట్టి పునాదులతో నిర్మించిన కావ్యసౌధానికి పులిందబాణుడు శిఖ రాన్ని నిర్మించి ఏ రీతిని సమగ్రతను కూర్చినదీ, గ్రంథం పూర్తిగా ఏక కర్తృతంగా ఎలా భాసిస్తున్నదీ 'కుమారబాణుడు—కాదంబరి' అనే రెండవ శీర్షికలో చక్కగా చూపబడింది.

మూడవ శీర్షిక అయిన 'కాదంబరీ సంకేతం'లో గ్రంథ నామౌచిత్యం, చంద్రాపీడాది పాత్రల నామౌచిత్యం, గ్రంథ కథా భాగపు అంతరార్థం మున్నగు విషయాలు వేద ప్రమాణ పూర్వ కంగా పరిశీలింపబడినవి.

తర్వాతి శీర్షిక ''అక్షరశిల్పం''లో గద్యలక్షణంతోపాటు గద్య భేదాలైన ముక్తక, వృత్తగంధి, ఉత్కలి కాప్రాయాదుల వివ రణ, అక్షర రమ్యత్వం, అలంకారాది చమత్కృతి చర్చించబడి ఉన్నవి.

మనకు నిత్యమూ అనుభవంలో ఉన్న విషయాలే రసం ప్రధానంగా ఉండే కావ్యంలో నూతనత్వాన్ని వహించి హృదయ ఫలకంపైని వివిధ వర్ణచిత్రాలను చిత్రిస్తూ ఉంటాయి. ఈ కావ్యంలో బాణుని శిల్పం ఎలా హృదయంగమంగా తయారయి నదీ అయిదవ శీర్షిక ''బాణుని వర్ణచిత్రము''లలో తెలుపబడింది.

తర్వాతి శీర్షిక ''కాదంబరీ కథాతత్త్వము''లో కాదంబరీ కథ ''కామకళావిలా''సాన్ననుసరించి శ్రీ విద్యాపరంగా సమన్వయించ బడింది. నిగూఢ తాత్త్విక రహస్యం వ్యక్తం చేయబడింది.

తర్వాతి శీర్షిక ''కాదంబరీ రసోల్లాసము''లో యీ గద్య కావ్యంలో శృంగార—కరుణ- శాంతరసాలు ప్రాధాన్యం వహించాయనీ, బీభత్స జుగుప్సాదులూ ఉన్నాయనీ ఉదాహరణలతో తెలుపబడింది. ఆ యా రసాలకు అనుగుణాలయిన అలంకారాల ప్రస్తావన కూడా ఉన్నది.

''బాణోచ్ఛిష్టం జగత్ సర్వం'' అన్నది ఎనిమిదవ శీర్షిక. కాదంబరీ కథానిర్వహణలో బాణమహాకవి స్పృశించని విషయంలేదని యీ శీర్షికలో సంగ్రహించబడింది ఆంధ్ర మహాకవులైన శ్రీనాథుడు, అల్లసాని పెద్దన, తెనాలి రామకృష్ణుడు, పింగళి సూరనలపై బాణుని ప్రభావం ఉన్నదని చెప్పబడింది. ప్రసిద్ధు లైన పూర్వకవుల ప్రభావం తర్వాతి కవులపై ఉండడం సహజమే! కథాకల్పనలో సూరన్న, బాణుని రచనను ఆదర్శంగా తీసుకున్నట్లు స్పష్టంగా తెలుస్తున్నది.

చివరి శీర్షికలో కాదంబరి — కథాసంగ్రహం ఇయ్యబడినది. ఇది లేకపోతే ఏతద్గ్రంథ రచయిత తెలిపిన విషయాలను అవగాహన చేసుకొనడం కష్టమే! మొదట ఈ కథాసంగ్రహాన్ని చదివి, కథను అవగాహన చేసుకుని తర్వాత తర్వాతి శీర్షికలను చదవడం మంచిది.

అనుబంధంలో బాణుని గ్రంథాంతరమైన హర్షచరిత్రను గురించి సంగ్రహంగా ఉన్నది. ఇది ఆయన రేడియో ప్రసంగం. గ్రంథమంతా గ్రాంథిక భాషలోనే నడిచినా, ఇది మాత్రం వ్యావహారికంగానే ఉన్నది, రేడియో ప్రసారానికి అనుకూలంగా ఉండవలెననే సంకల్పంతో కాబోలు!

రచయిత ఏ విషయం చెప్పినా,దానికి ప్రమాణం చూపుతూనే వచ్చారు. ఎంతో కృషిచేసిన వ్రాసిన గ్రంథం యిది! దీనికి తగిన ఆదరణ లభించగలదని ఆశిస్తున్నాను.

గ్రంథ ముద్రణవ్యయం భరించిన ఉదారులు మల్లాది వెంకటరామయ్యగారికి యిది కృతి యివ్వబడినది.

సుప్రసిద్ధ విద్వాంసులు వేదపరాల సూర్యనారాయణశాస్త్రి గారి విపులమైన సమీక్ష దీని విలువను తెలుపుతున్నది. మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు "స్వాదమాధురి"ని వివరించారు. జమ్మలమడక మాధవరామశర్మగారు 'భట్టారక భారతి'ని, స్ఫూర్తిశ్రీ 'బాణవాణి'ని వెల్లడించారు. మల్లంపల్లి శరభయ్యగారు, రచయిత తల్లి దీవన లిచ్చారు.

"నేను కాదంబరీ కావ్యమును గూర్చి తెలిసికొన్న కొంచెములో కొంచెము మాత్రమే యిందు ప్రకటింపగలిగితిని. ఈ నా కృషికి లభించు ప్రోత్సాహమునుబట్టి యీ కావ్యము నింకను అనుశీలించుటకు నాకు పూనిక కలిగినచో అది సహృదయుల అనుగ్రహ విశేషముగా భావింతును" అని రచయిత 'నివేదనము.' రచయిత కృషికి తగిన ప్రోత్సాహం లభించగలదనే భావించవచ్చును.

*శ్రీ బులుసు వెంకటరమణయ్య*

## 1. ఆవేదన

[కొడాలి దామోదరయ్య, క్రౌన్ 1/16 – 60 పేజీలు, వెల – ఒకటిన్నర రూపాయి; ప్రతులకు – విజ్ఞాన సమితి; విజయవాడ-2.]

నిజంగా ఇది ఆవేదనే! ఒక విద్యాధికుడు, జీవితంలో వివిధ ఉద్యోగాల బాగోగులు స్వయంగా ఎరిగి ఒక హేతువాదిగా ఒక వక్రోక్తి పండితుడుగా పాడిన ఆవేదన ఇది. నేటి లోకపు పోకడ చూచినాడు – రమ లచినాడు; గుండె గాయపడినది – ఎక్కువ ఆక్రోశంలో రోదించినది ఈ ఎత్తిపొడుపు కరకుదనం, నెత్తురు గాయం పడకుండా మోమతున్నది. భాషలో అనుప్రాస – వ్యక్తీకరణలో స్పష్టత కవిత్వానికి ప్రాణం పోస్తున్నవి.

ఇందు ఖండికలన్నీ విమర్శనాత్మక అవహేళనాలే. ప్రతిదానిలో విషయ గురుత్వమున్నది; తిట్టిన తిట్టులో నిజమున్నది. ఈ రచనకు ఉన్న సొంపంతా, తన అనుభవాలను మూతినాకుడు లేకుండా చెప్పడమే. ఈ వ్రాత నేర్పు చాలామంది వ్రాతగాండ్రకు అబ్బనిది.

సమస్యా పూరణంలో – గవర్నమెంటు, రాజకీయవాదులకు, కంట్రాక్టర్లకు, స్మగ్లర్లకు మాత్రమే ఉన్నదిగాని సామాన్య ప్రజలకు లేదంటాడు; ఘాటైన మాటే! మంచి మాటల మధ్య "గుర్రపులద్ది సాంబారు" అన్నది కొంతమొరటుగా ఉన్నది. తెనుగు సినిమా చిత్రాలపై ఒక చావుదెబ్బ! "ముప్పది ముడతల ముఖం" హీరోను పొగడీ "దినకూలి పత్రిక" ల భరతం పట్టినాడు. వీరికి తగిన ప్రేక్షక వర్గమే జతఅయినది. మునిసిపాలిటీల లోపలిబయటి కుళ్లను బయటబెట్టినాడు.

కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి స్వాతంత్ర్య భావ ప్రకటన ఆయన కీర్తిమూర్తి ప్రకటనకు తగి ఉన్నది. కోర్టులకు సంబంధించిన వివిధ అంగాలను ఏకివేసి, నిజమనిపించి ఆనందింపజేస్తున్నాడు. 35 మార్కులతో ప్యాసయ్యే విద్యార్థులలో మిగత 65 పాళ్ళ కల్తీ అజ్ఞానం అన్నది–మంచి గణితశాస్త్రపు ఎగతాళి. మంగలికత్తి వాదరవంటి పదునుగల పేనామ బాగానే తిప్పగలడు– కవి న్యాయవాది గదా!

## 2. ముత్యాల హారము

[ప్రాచీన తమిళ గాథలు–ముత్తొళ్ళాయిరంలో 68 దింటికి తెనుగు – ముదునూరు జగన్నాథరాజు; క్రౌన్ 1/16 – 64 పేజీలు; ధర – రు. 3/– విశ్వశాంతి పత్రిప్రగం; రాజపాళయం. (తమిళనాడు) 626 117.]

తమిళాంధ్ర కర్ణాటక భాషలు ఒకే భాషాదేవి బంగారు కాన్పని మరచిన మనకు – పరమటి దొరలు నిజంతెలిపి మరల భాషా భాషా సమైక్యతకు దారిచూపినారు. తెనుగు చేసిన సంస్కృత కావ్యాన్నే పదే పదే పలువురు ఆంధ్రీకరించినారు గాని, మన ఇరుగు పొరుగు భాషల జోలికిపోక, జాతి సమైక్యతకు తీరనిలోటు గూర్చినారు. మొదట పల్లవులు, తర్వాత తమిళులైన తెనుగు చాళుక్య చక్రవర్తుల కలగలుపువల్ల, రాజకీయంగా తమిళాంధ్రులుఒకటైనా భాషా విషయికంగా ఆదాన ప్రదానాలకు పూనుకొనర్వైరి. మన త్యాగరాజును వారు సొంతం చేసుకొన్నారు గాని వారి కవులు మన వారికి అంటరానివారుగానే ఉండినారు. వసుచరిత్ర తమిళానికి ఎక్కినది కన్నడ కవిత్రయం–పొన్నడు, పంపడు, కన్నడు ఆంధ్రులైనా కన్నడ కస్తూరి మన కంటలేదు నాయకరాజులు మధుర తంజావులలో ఏలి ఆంధ్ర సరస్వతీ పీఠాలను ఆ తమిళనాటి నడిబొడ్డున నెలకొల్పినా, తమిళం నుండి సాహిత్యం తెనుగులోకి అంతగా పారలేదు ఆధునిక కాలంలో పూతలపట్టు శ్రీ రాములురెడ్డి ఈ ఆంధ్రీకరణోద్యమానికి జనకు లనవచ్చును. కోదండరామయ్య (హోసూరు), సి. ఆర్. శర్మ, రామలింగాచార్య మొదలగువారు ఈ త్రోవవారు – అనవచ్చు.

తర్వాత – ఎప్పుడో తంజావూరు నాయక రాజుల కొలువులో ఇరుక్కుకుపోయిన ఆంధ్ర భాషావాహిని అంతర్వాహినై నడచి, మరల

ఇప్పుడు రాజపాళెయంలో పైకుబికి, జగన్నాథరాజు రూపాన ప్రవహిస్తున్నది. అందు వికసించిన కవితా రాజీవమే ఈ చిన్న కృతి. తెనుగు సౌరభం ఈ 68 పద్యాలలో సుడిబెట్టి వీస్తున్నది. రాజుగారు బహుభాషా పండితుడు; ఉభయ సాహిత్య సాగరాలలో మునిగి కలయ దిరిగినవాడు. పాండిత్యానికి తావు లిచ్చే పద లాలిత్య కమనీయత — భావ ప్రసన్నత — ధారతో చక్కటి తియ్యటి కవిత్వం చెప్పినాడు. ప్రతి పద్యానికి ముందు ఈయన వ్రాసిన వ్యాఖ్యానము పరిచయము నిగ్గయిన పాండిత్య ప్రకర్షకము; మంచి డొక్కశుద్ధి ఉంటేనే గాని ఈ వ్రాత అలవి అయ్యేదిగాదు. ఇదిగాక మున్నుడి దక్షిణ భారత చారిత్రిక భాషా వికాసాలను వర్ణించినది — విషయ పూర్ణమైన ఒక అమూల్య వ్యాసం. నన్నయ తమిళుడంటున్నాడు.

ప్రాచీన మూల సంకలనంలో తమిళ చక్రవర్తులు — చేర పాండ్య చోళ రాజులను గూర్చిన ముక్తకాలు—చాటువులు 270 ఉన్నవి. ఇందు ప్రాణవంతమైన వీరము, మధుర తమమైన శృంగారము చిప్పిల్లుతున్నది. జగన్నాథరాజు అరవై ఎనిమిదింటినిమాత్రం ఏరి ఆంధ్ర భారతికి కానుక బెట్టుతున్నాడు.

యుద్ధవర్ణనలు కొన్ని తిక్కన పోకడలలోఉన్నవి. శృంగారం పరిపాటిదైనా, ఊహలు ఉత్ప్రేక్షలు నవ్య రీతుల్లో శోభిల్లుతున్నవి. భావ గాంభీర్యము, జీవభాష అనే జాతి గుర్రంపై స్వారి చేస్తున్నది. అన్ని పద్యాలు పనస తొనలే. అంతదూరాన "అరవ మొత్తుకోళ్ల" మధ్య, ఈ ఆంధ్ర కవితా లత ఇట్లా గెంజిగురాకులు వేసి పూసి పరిమళించడం ఒకే భాషలో వీరవిహారం చేసే ఆంధ్రులు గుర్తించి ప్రశంసింపదగి ఉన్నది.

వాచవికి రెండు తునకలు :- రాజు మదపు టేనుగు రాకను వర్ణించడం నేటి దక్షిణాఫ్రికా అరణ్య చిత్రం (ఫిలిం) మాదిరి ఉన్నది. "కూడి రాబందు మొత్తముల్ గోలవెట్ట, గ్రద్దలను చరమై వచ్చి సద్దుచేయ, నక్క నలుదిక్కు పరుగిడ, నాట్యమాడి దయ్యములు చేర, తావచ్చు దంతి మిన్న." బీభత్సానికి చారుత గూర్చిన తిక్కన ఫక్కి :— "మకుట యుతమగు వెలి పున్క, మజ్జ నేయి ప్రేవు వత్తులం బెట్టించి ప్రీతితోడ దయ్యములు దీపముల నెత్తదనరు చేరరాజు పోరిన సంగ్రామ రంగభూమి."

శృంగారంలో సౌకుమార్యము మాధుర్యము ఉన్నవి:— "శూలపాణియౌ చోడుడు సొగసుగాను గుఱ్ఱమెక్కి వచ్చెను స్త్రీలు గూడి చూడ; జాలమునం దగుల్కొని త్రుళ్లు మీలంబోలి జాలకములందుం గన్నులు సంచలింప." దూరానుగత దృశ్యవర్ణన (Perspective) "రమణి మఱి కొంత వడిదాక రథముం జూచుం; దరుణి మఱి కొంతసేపు కేతనముం జూచుం; గొంత మఱి మీంద రథ పరాగంబుం జూచుం; బడతి మఱి యంతను వట్టి బయలు జూచు." ఇట్లే భిన్న దిక్కుగా సమీపించేదాని వర్ణన గూడ (49) అందంగా ఉన్నది.

అంతటా నుడికారం చవులూరిస్తున్నది.

## 3. జైజవాన్ జైకిసాన్ (కవితా సుమమాల)

[క్రిటిచినవెంకటరెడ్డి (అదృష్టహీనకర్ణ) క్రౌన్ 1/16 80 పొరటలు; వెల రు. 4/–; ప్రతులకు : అభ్యుదయ రచయితల సమాఖ్య; అనపర్తి; తూ. గో. 533342.]

రచయిత అదృష్టహీన కర్ణుడుగా ఊహించుకొన్నా జీవన ఆశాద్యోతకమైన శీర్షికనే తన పుస్తకానికి పెట్టినాడు; ఒకఉజ్జ్వల ఆదర్శ పతాకాన్ని ఎగ గట్టినాడు. కోడెప్రాయం వరకు భవిష్యత్తుపై గంపెడాశతో విద్యారంగంలో క్రీడారంగంలో ముందుకు సాగుచుండిన యువకుడు — ఈ క్రిటి వెంకటరెడ్డి — క్రూరవిధి వ్యాధిరూపేణ ఈ యువకోత్సాహిని వికలాంగుని చేసినది. కాని, విధినిగాని మానవజాతినిగాని తిట్టిపోయక, ధర్మ దీక్షతో ఆత్మానందమే పారితోషికంగా మానవ సేవకు కడంగినాడు. తన కుగ్రామ విజ్ఞాన సంపదను పెంచెను విద్యా సంస్థల నెలకొల్పి, ఆడుపుట్టువు లందరూ తనతోబుట్టువులుగా విద్యగరపి "విద్యార్థులు నాబిడ్డలు" అని ఉప్పొంగినాడు తాను ఎం.ఎ. వరకు నేర్చిన విద్యను పంచిపెట్టి, "ఆదర్శాచార్యు"డన్న బిరుదంతో ఆనందించినాడు. ఏటేటా తన గ్రామంలో పారితోషికాలిచ్చి కళాకారులను విద్యార్థులను ప్రోత్సహిస్తున్నాడు. ఒక రచయితల సంఘం స్థాపించినాడు. అనాసక్త కర్మయోగియై ప్రజాసేవచేస్తూ సంగీత సాహిత్యోపాసనలో "బ్రహ్మానందం నా పరం" అని తృప్తితో ఎలుగెత్తిచాటి, జ్యోతిర్మయపథగామియై దారిచూపుతున్నాడు – దురదృష్ట విశ్వవిద్యాలయంలో పట్టభద్రుడైన ఈయన. దానవీర దివ్య జ్యోతి — ఆ కర్ణునే ఆదర్శంగా పెట్టుకొని, "నీ గాథకు నా గాథకు బహు భేదంకానర్రాదు; ఆదినుండి అడుగడుగున శాపాలే నాకు మిగిలె" అని ఊరటపొంది, నరకక్రోధాన్ని మాని ధర్మదీక్షతో మానవుడై మనుతున్నాడు. ఈ ధన్యజీవి హృదయ కమలం వెదజిమ్మిన కవితా సుగంధాలే ఈ ఖండికలు!

కవితాభావ వైవిధ్యాన్ని "తళుక్కున తమాషా"గ వర్ణించి, కొన్నిభావాలు — "సిగ్గుతో కొత్తకోడలు వలె గుమ్మంలోనే నిలిచిపోతుంటాయి" అని చక్కగా కొత్త నుడికారంతో చెప్పినాడు. "అసత్యవాదుల కెందుకీనాడు ఈ మహావిజయం" అని ఆక్రోశపడుతాడు. మాతృమూర్తిని వర్ణిస్తున్నాడు :— "ప్రసవవేదన అనుభవించి బిడ్డమోము చూచినంతనే మురిపెముతో మురిసిపోవు ఆదిగురువై ఆమెయె!" ఒక తెలివితక్కువ విద్వాన్ "పుటిటి నొప్పులని నొక్కి చెపుతాడులేండి కర్ణుని భక్తితో మ్రొక్కి కీర్తిస్తాడు."

ఈ విధంగా భావాలు చేటగలిగి ఉన్నవిగాని, భాషకు రచనా విధానికి కావలసినంత పస ఇంకా కలుగలేదు. ఈయన చేసే సేవా యజ్ఞంలోనే, సాధనచేసి కవితా లక్ష్మికి ఇంకా మంచి సొమ్ము చేకూర్చగలదని ఆశపడుతున్నా.

## 4. వసంతోదయం (గేయ కావ్యం)

[వడ్డేపల్లి కృష్ణ, క్రౌన్ 1/11 - 80 పేజీలు; వెల రు 3/- ప్రతులకు:-యువసాహితీసమితి; సిరిసిల్ల-505301]

మన వాఙ్మయంలో అరుదైన గ్రామీణ కావ్య ప్రక్రియను చేపట్టిన చిన్న కల్పనాకృతి ఇది. భాష భావగౌరవం గురుతరమై ఉన్నవి ఈ నూతన యుగంలో కథను కవిత్వంగా చెప్పడం చాల తక్కువ - ఎందుకంటే - ఔచిత్య పోషకము, కథకచాతురి కవికి మెండుగా ఉండాల. ధీరోదాత్తుడో, ధీరలలితుడో కథానాయకులుగా ఉండాలన్న నియమం కృత్రిమమని, మానవ ప్రేమానురాగాలు సాంఘిక అంతస్తులను పాటించవని నిత్యసత్యం చెపుతున్నా, ఆ శాసనాలను ఉల్లంఘించను చాలామంది రచయితలు భయపడే టట్లున్నది.

ఒక పల్లెటూరు శ్రీమంతుని కొడుకు, పట్నంలో చదువు కొంటూ, సెలవులలో ఇంటికివచ్చి, సహజ సౌందర్యము గ్రామీణ రూపరేఖా విలాసంగలిగిన ఒకగొల్ల పడచు ప్రేమ వాగురులలో పడుతాడు. ప్రణయం ముదిరి ఆ శ్వేత కడుపున కాయ కాచినది. ఈ సందున దొరబిడ్డ చదువుకుపోయి ఒక దీర్ఘసంవత్సరానంతరం తిరిగి ఇంటికి వస్తాడు. ఇంకొక గొల్లభామను చూచి, ఆమెలో తన ప్రణయిని మొక్కట్లు గుర్తించి మరులు గొన్నాడు. ఈమె గడుసు దనం పాతపడుచుకాదనిపించినది. (ఇది మంచి చెణుకు) ఆమె, తన అక్కకు ఒక కొడుకు పుట్టి ఉన్నాడని చెప్పినది. దీనిచో, పాప పరిహారార్థమో అన్నట్లు ఆమెను పెండ్లాడుతాడు. ఈ కులం తక్కువ పెండ్లికి పెద్దలు ప్రతిఘటించినా, ఈ శుభ ప్రణయం ఆ నిరోధాలను లెక్కచెట్టలేదు. ఈ కల్తీలేని ప్రేమగాథ చుట్టూ కవి, మృదుమధుర భాషాతంతువులతో ఒక కమనీయ శిల్పచిత్రాన్ని అల్లినాడు.

భావాలు సాంప్రదాయికాలైనా, ప్రౌఢితో ఉన్నవి. ఉత్ప్రేక్షలు సహజరామణీయకాలు గ్రామీణ దృశ్య వర్ణన సొంపులు ఒలికిస్తున్నది. మానవ చిత్తవృత్తి బాగా వివరింపబడినది. వర్ణనలలో ఎత్తుగడలు మాండలిక పదజాలము మెరుగులు దేరి ఉన్నవి. ఆరు ఋతువుల వర్ణన ఆహ్లాదకరంగా ఉన్నది.

ఇంపైన నుడికారాలు కొన్ని రుచి చూడండి :- తరగెత్తే ఏటిపైన సంధ్యారుణ కిరణాలను సాచినాడు దివాకరుడు; సొగసు లెన్నో పండించే పగడమ్ములు అధరమ్ములు; ప్రొంతీయత యాస మలయ పవనమ్మను మరపించెను; వయసులోని వలపుతలపు పొంగి పైకి తొంగి చూచె; రేయిసగం గడచువరకు వేయిసార్లు నిదురలేచి (ఆ వేగం) పారవశ్యమున మునిగెను పైటకారినను గూడ పట్టించుయు లేకుండెను; కన్నియ అందాలన్ని కౌగిట బంధించి నాడు; ఇసుక తిన్నె శయ్యగాక ఇంటి సొగసు దోచుకొనెను; వేళ యాయినని తూర్పున వేగుజుక్క పొడిచి తెలిపె; పడుచుజంటల కౌగిలింతల బాపలేకయె రేయి పెరిగెను.

## 5. శ్రీ నవరసవాహిని

[చేబ్రోలు సుబ్రహ్మణ్యశర్మ, క్రౌన్ 1/16 - 48 పేజీలు; ధర రు. 2/- ప్రతులకు - గ్రంధకర్త, సరస్వతీ విహార్; 105 - హాస్పిటల్ రోడ్, తిరుపతి.]

ఒక మహాకవి వివిధ విషయాలపై అందులో సర్వ సాధారణ విషయాలపై (మానవుడు, మొనగాడు, పండితుడు, యోగి, సంఘం - మొదలైనవి) వాటి నిర్వచన రూపంగా వ్రాసిన వచన భాగాలు ఇవి. మామూలు భావాలకుతోడు, భాష చాలా పేలవంగా వార్తాపత్రికల భాష స్థాయిలో ఉన్నది. కవిగారి భావ సరణి ప్రాచీన ఆచార బద్ధమైనది; దీనివల్ల ఎవరికీ తగాదా ఉండ కూడదు; రచనగూడ ప్రాప్రక్రియలోనైనా ఉండవచ్చు. అయితే విషయ గౌరవము, భాష బిగువు సొంపు పొందెక కలిగి ఉంటేనే గదా రాణించేది—ఆకర్షించేది. ఇవి ఏవీ ఇందు లేవని వ్రాయను - అందులో ఒక "మహాకవి" వ్రాతలో - మనసు కష్టపడుతున్నది.

ఈ నవరసవాహిని నీరసంగా ప్రవహించిన విధంచూడండి:- అనుసరణ అనుకరణ అభినరణ సేకరణ వ్యాకరణ పారీణ నిపుణ వర్ణము (24 పొరట) అన్న మాటలపోగులో అర్థమేమిటో ? ఆంధ్రమహిమను చెపుతూ (31) ఐతరేయంలో వాణి శాతవాహనుల వాణి ఆంధ్ర మంటారు. వీరేగాదు తరువాత పల్లవులు గూడ ప్రాకృతానే వాడితిరే! కవిగారి ఆంధ్రాభిమానం ప్రశంసనీయం - అంతే !

## 6. రాగ విపంచి

[డాక్టర్ కోడూరి ప్రభాకరరెడ్డి, ఎం.డి., క్రౌన్1/16 - 32 పేజీలు; మూల్యం రు. 2.50. ప్రతులకు : కృష్ణరాయల సాహిత్య పరిషత్; ప్రొద్దుటూరు.]

ధన్వంతరిని కొలుస్తూ మధ్య మధ్య మనోల్లాసానికి కవితాసుందరిని ప్రేమిస్తూ, తెనుగు పళ్లెరంలో ఈ పద్యాల కానుకను సమర్పిస్తున్నారు - భావుకుడైన ఈ యువకకవి, ఏ పని మధ్య ఇరుక్కోని వున్నా కవితా ప్రవృత్తి ఊరుకో నిస్తుందా ? గాయకుడు కూన రాగాలైనా తీయకుండా ఉండ గలడా ? అట్టి భావోద్గారమే ఈ రచన. సరస్వతీ పుత్ర నారాయణాచార్యుల వారన్నట్లు - రాగ విపంచి - అన్న పేరులోనే భావ కవిత్వ వాసన ఉన్నది. పేశలమధుర భావుకత ఈ కవిసొమ్ము. దీనికి వన్నె గూర్చను రాగవిపంచి అనురాగాన్నే అలపించినది.

తనపాటికి తాను పాడుకొనే గండు కోయిల మాదిరి, రాజకీయాలు వదలి ఈ కవి మధుర ప్రేమను వర్ణించి, ఆత్మానందం పొందుతున్నాడు. పద్యానికి ఒయ్యారపునడక, భావంలో పరిమళము, భాషలో మాధుర్యం కలిగి, నుడికారం ఆమని లేజిగురు జిగితో పాఠకునికి ఆనందానుభవాన్ని పుట్టిస్తున్నవి.

సొంపైన భావాలను తొడిగిన వాక్యాలను పదాలను తిలకించండి :— వలపులన్నియు మాయును వయసుమీరి, కరిగిపోయిన ప్రాయమ్ము మిరిగిరాదు, తీర్చుకో రాద మగువ నీ తీపి కోర్కె— అన్నది "సంశయాంధ సంవృతము భవిష్యదర్థము, సతతమొక వర్తమానమే యవశ్య భోగ్యమగు సంపద" అనిన దువ్వూరు వారి పానశాల (ఒమర్‌ఖయ్యాం)పద్యం ప్రతిధ్వనిస్తున్నది. ప్రేమోన్మాది అయినా జీవిత నిష్ఠుర సత్యాలను గుర్తించగలిగే ఉన్నాడు— నా హృదయ దేహళి నీ పదపద్మముద్రకై వేచిన వేళ; కలలలోపల పూచిన కలువ; కజ్జలాంకిత నేత్రాలు కాంక్ష దెలుప; జీవితమ్మన పువ్వుల సెజ్జకాదు తీపి చేదులు కలసెను తెలిసికొనుము. సుఖ దుఃఖాలు ఓతప్రోతములు (పడుగు పేక) అన్న వేదాంతవాక్యం మదికెక్కిన ఈ భూతలజీవి, అదృష్టవంతుడు. కలలోవిరబూసిన కలువ కన్నె; ప్రేమ వికసించు శుభవేళ విరసమేల; అలక నీ చిన్ని మోమున కంద మగును.

## 7. బాలగేయ కథామాల (బాల సాహిత్యం)

[నీలకంఠం పాండురంగం, క్రౌన్ 1/16 – 24 పేజీలు; వెల : రు. 2/– ప్రతులకు : మెదక్ మండల సాహిత్య పరిషత్, సంగారెడ్డి.]

బాలబాలికలకు నీతులు బుద్ధులు గరపే ఈ గేయాలు ప్రాథమిక పాఠశాలలకు అవసర పఠనీయాలు. బాల్యప్రబోధం—దినచర్య — సోమరితనం — ఆరోగ్యం — మొదలైన విషయాలు చిన్న మాటలలో చక్కటి హితవులు పిల్లలకు చెప్పబడియున్నవి. ఇవి గేయాలు కావడంచేత విద్యార్థులు వీటిని నోటికి రాజేసుకొని జ్ఞప్తి పెట్టుకొని బాగుపడగిలరు.

ఒకటి రెండు కథలు నీతిని చెప్పేవి, చరిత్రాంశాలు గూడ ఉన్నవి. సుమతి శతకాలు వంటివి అమలులోలేని కొరతను ఇట్టి కొత్తధోరణి గ్రంథాలైనా కొంత తీర్చగలవు.

ఈ కవి ఉపాధ్యాయుడు కావడంచేత శిశుతత్వ్య మెరిగి అదనుకు తగిన సుద్దులు నేర్పగలుగుతున్నాడు.

శ్రీ ముదిపూడు కోదండరామరెడ్డి

## ప్రబంధగణపతి

[వివరణకర్త : నల్ల ఉపేందర్, బి ఓ. ఎల్ , ఇంటి నెం. 16–4 153 శివనగర్, వరంగల్ 506002. వెల: రూ. 2 00; పుటలు 35 ]

నలుబది తెలుగు కావ్యాలలోని విఘ్నేశ్వరుని స్తుతి పద్యములకు వివరణ రూపముగ నీ పుస్తకము రచింపబడినది అన్నిపద్యాలు గణపతిని స్తోత్రముచేయువారికొక తావునచేర్చి యీగా వివరణకర్త మేలు జేసిరి. నలుబది ప్రబంధములతోబాటు మరికొన్ని గ్రంథముల నుండి కూడ నట్టి పద్యములను సేకరించిన బాగుండెడిది. అట్లే తమ వివరణమును గూడ యథామూలముగ జేసియున్నచో సామాన్యులకు మిక్కిలి తోడ్పడియుండెడిది. అట్లుగాక విమర్శనదృష్టితో వివరణమును వ్రాసినట్లు తోచుచున్నది. అదియు ప్రశంసార్హమే. కాని అట్టి విమర్శనాత్మక రచనకై మరికొంత పాటుబడి తమ ప్రయత్నమును సార్థకమొనర్చుకొనిన బాగుండెడిది. వారు గ్రహించిన పద్యములలో కొన్నియైనను వేరే గ్రంథములలో గానవచ్చు భావముల ననుకరణముగా ఆయా కవులు మెరుగులు దిద్ది వ్రాసినవి. ఉదాహరణకు అల్లసాని పెద్దనగారి ప్రసిద్ధమైన "అంకము జేరి శైలతనయా......" అనే యీ సంకలన వివరణాత్మక పుస్తకములో మొట్టమొదటి పద్యమునకు ఆధార మనదగినట్టి భావము పెద్దనగారి కోకట గ్రామానికి మిక్కిలి దూరంగానట్టి ఉప్పరపల్లిలోనున్న క్రీ. శ. 1525 నాటి సంస్కృత శాసనంలో కనుపిస్తుంది.

> పాయాద్వో గణనాయకః పశుపతే రగ్రేచిరం సంస్థితో
> వామార్ధాంగ విరాజితాం గిరిసుతాం జ్ఞాత్వానిజాం మాతరం।
> తుండాగ్రం ప్రవిసార్య సస్మితముఖః పీత్వాస్తనం చాపరం
> పాతుం ప్రీతమనాస్తనం మృగయతే విఘ్నాంత కస్సర్వదా॥

అర్ధనారీశ్వరుడగు శివుడు గణపతికి బాల్యములో జననీ జనకులుగ స్ఫురించుట ప్రసిద్ధమైయున్న భావము. దానిని పెద్దన తన ప్రతిభా విశేషముతో చమత్కరించాడు. దానికి మూలము పెద్దనకు కాలములోను, దేశములోను అతి సన్నిహితమైన పై శ్లోకము. పెద్దననే పై శ్లోక కర్త అనుకరించెననలేము. పెద్దన పద్యము పై శ్లోకముకంటె చాలా బాగున్నదికదా. ఈ యపార సంస్కృతాంధ్ర వాఙ్మయములో సర్వసాధారణముగా నుతింపబడు గణపతిని స్తుతించు భావ విశేషములు కవియొక్క లేఖినితో ననేక విచిత్రరీతులు దాల్చినవి. ప్రస్తుత వివరణకర్త మరికొంత శ్రమచేసి ఆయా భావములను ఆంధ్ర కవులేవిధముగ తీర్చిదిద్దిరని చెప్ప బూనుకొనినచోవారి ప్రయత్నము బాగుండెడిది.

శ్రీ పర్లబ్రహ్మశాస్త్రి

## "పాశ్చాత్యులు - తెలుగు భాషా సంస్కృతులు"

[పాశ్చాత్యులు—తెలుగు భాషా సంస్కృతులు, గ్రంథకర్త : శ్రీ కె. ఆర్. కె. మోహన్, వెల : రూ. 15, పుటలు : 128, ప్రాప్తిస్థానం : శ్రీముఖ పబ్లికేషన్స్, ప్లాటు నెం : 12, హౌవున్ నెం : 7-8, పి. అండ్ టి. కాలనీ, గడ్డి అన్నారం, హైదరాబాదు—36.]

పేరుకు తగ్గ భారమైన గ్రంథం కాదు. అయినా యితర ప్రవృత్తిలో జీవయాత్ర సాగిస్తూ "రోజుకి ఎనిమిది గంటలు నడుం వంచి పనిచేయవలసిన పోస్టల్ శాఖలో ఉద్యోగంచేస్తూ ఇటు వంటి పరిశోధక గ్రంధాన్ని రచించడం" సాహస మవుతుందని గ్రంథకర్త 'ముందు మాట' గా అన్నారు. ఇది జాలిగొల్పే విషయంకాని సాహసం కాదు. సాహసమని ప్రశంసిద్దామా.అని అను కొంటే పరిశోధన గ్రంథం అని తామే చెప్పుకొన్నారు. దీని కోసం విశేషంగా శ్రమించి "అనేక దేశాలలోని సంస్థలతో, పండితులతో, ఎంబసీలతో ఎన్నో ఉత్తర ప్రత్యుత్తరాలను" గ్రంథకర్త జరిపారట! "ఎన్నో పుస్తకాలు కొన్నా"రట. "కేవలం పోస్టేజికే రెండు వందల రూపాయలు పైన ఖర్చయింద్రంటే నా శ్రమ ఎంతటిదో అర్థం చేసుకోవచ్చు" అని వాపోయేరు. తరవాత గ్రంథకర్తను జర్మనీకి స్వయంగా వచ్చి పరిశోధనలు జరపమని ఒక జర్మన్ పండితుడు ఆహ్వానించాడట.

అన్నీ బాగానేఉన్నాయికాని 1978లో అచ్చయిన గ్రంథంలో గ్రంథకర్త పుట్టిన తెలుగు గడ్డపై పాశ్చాత్యులను గురించిన పరి శోధన ఎంత అభివృద్ధి చెందిందో, రాష్ట్రంలో ఒక విశ్వ విద్యా లయమే బ్రౌను పరిశోధనా విభాగం ఏర్పాటు చేసి ఎంత గణనీయ మైన పరిశోధన సాగిస్తున్నదో ఒక్క ముక్క విదల్చకుండా "పరి శోధన, పరిశోధన" అంటూ ఏకరువుపెట్టి దేశాన్ని ఈ విధంగా మోసగించవచ్చా? పుస్తకం మొదటి పుట నుండి చివరి వరకు బ్రౌన్‌దొర పేరు రామనామంగా వల్లిస్తూ బ్రౌన్‌దొర గురించి తన తెలుగు సోదరులు యెంత అమూల్యమైన సమాచార సంపదను అందిస్తున్నా ఆ కృషిని విస్మరించి పరిశోధన గ్రంధం వ్రాశానని చెప్పుకోవడం జాతి ద్రోహం కాదా? పైగా "బంగోరే వంటివారు కూలంకషమైన పరిశోధన చేస్తున్నప్పుడు నేను ప్రత్యేకించి చేయ గలిగినది ఏమీలేదు" అంటూ గ్రంథంలో చెప్పకుండా పరోక్షంగా ఉత్తరంలో ఈ సమీక్షాకర్తకు వ్రాసి దాటిపోవచ్చా?

"బంగోరేగారి పుస్తకాలు పత్రికలలో వచ్చిన మరికొన్ని వ్యాసాలు చూశాను" అని సమీక్షకుడికి రాసిన ఉత్తరంలో తెలిపారు అంటే గ్రంథకర్త చూసి కూడా అవి తమ 'పరిశోధన' గ్రంథానికి ప్రామాణికం కావని విస్మరించారా? లేదా వేరేవిధంగా గ్రంధకర్తను గూర్చి మనం భావించుకోవాలా?

128 పుటల గ్రంథంలో ఉన్నదల్లా అచ్చు తప్పులు తప్ప ఒక విషయం గ్రంధకర్త ముందు మాటలో చెప్పిన వాక్యాలను బుజువు చేసేటివిగా లేవు. డా. కొత్తపల్లి వీరభద్రరావుగారి రెండు పుస్తకాలు, బ్రౌన్ వ్రాసిన స్వీయ సారస్వత కథనం ఇంకా ఏవేవో వాళ్ళూ వీళ్ళు వ్రాసిన గ్రంథాలు దగ్గర పెట్టుకొని వ్రాసిన "పరి శోధన గ్రంథ" మిది.

## గ్రంథంలోని ఈ క్రింది వాక్యాలు దయచేసి కాస్త చదవండి.

"బ్రౌన్ (బ్రౌన్) వ్రాసిన వ్యాకరణం 1817లో ముద్రిత మైంది. బెంజిమిన్ షూల్జ్ పుస్తకం 1747లో అచ్చయిం దన్నాము గదా! ఈ నడుమ గడచిన డెబ్బై సంవత్సరాలలోనూ తెలుగు ముద్రణ ఎంతో అభివృద్ధి చెందింది. మొదటి అచ్చు పుస్తకంలో పేరాలు మాత్రమే ఉండేవి. కాని బ్రౌన్ (బ్రౌన్) వ్యాకరణం నాటికి అంటే 1817 నాటికి అచ్చులో ఫుల్‌స్టాపులు కామాలు వచ్చేశాయి" (పుట 18.)

ఈ ఉదాహృతాంశంలో ఎన్ని పొరబాట్లున్నాయో, అవి ఎంత ఘోరమైనవో ఈ "పరిశోధన" గ్రంధకర్తకు తెలుసా?

1. తెలుగు ముద్రణనుగూర్చి వ్రాసే పరిశోధకుడు డా. జె. మంగమ్మగారి Book Printing in India విధిగా చదివి తీరాలి. ఆ పుస్తకం మన రాష్ట్రంలోని నెల్లూరిలోనే 1975లో అచ్చ యింది. ఈ పుస్తకం వాసన కూడా ఈ గ్రంథంలో లేదు.

2. బ్రౌన్ వ్యాకరణం 1817లో అచ్చయిందట! 1817లో బ్రౌన్‌కి 19 సంవత్సరాలు వయస్సు. ఒఖ తెలుగు అక్షరం ముక్క కూడా అతనికి అప్పటికి రాదు. ఇక తెలుగుకి వ్యాకరణం ఎట్లా వ్రాస్తాడో గ్రంధకర్తే చెప్పాలి.

3. బెంజమిన్ షూల్జ్ మొదటి పుస్తకం అచ్చయింది 1747లో కాదు. 1746లో. డా. మంగమ్మగారి పుస్తకంలోని 34వ పుట కెదురుగా దీని ముఖపత్రం ఉంది.

4. బ్రౌన్ తెలుగు వ్యాకరణం ప్రథమ ముద్రణ 1840. ఈ వ్యాకరణానికి షూల్జ్ పుస్తకానికి అంతరం 94 సంవత్సరాలు. ఇంతకీ ఇది బ్రౌన్ తొలి ముద్రణ కాదు.

5. పోనీ బ్రౌన్ వ్యాకరణం 1817లో అచ్చయిందని గ్రంథకర్త పొరబాటుగా వ్రాశారా అని అనుకొందామా అంటే గ్రంథకర్తే రెండోసారి అదే పేరాలో "బ్రౌన్ వ్యాకరణం నాటికి అంటే 1817 నాటికి" అని మనకు తెలియదేమో మరోసారి గట్టిగా చెబుదామని చెప్పిచ్చారు

ఇక కర్నల్ కాలిన్ మెకంజీ అధ్యాయంలో డా. సి. వి. రామ చంద్రరావుగారు 1975లో రామస్వామి డక్కన్ పొయెట్స్ అచ్చు వేస్తూ అనేక నూతన విషయాలు వెల్లడి చేశారు. ఆ పుస్తకం తిరిగి అచ్చయినట్టు గ్రంధకర్తకు తెలుసునో తెలియదో. అదీ నెల్లూరులోనే అచ్చయింది.

బ్రౌన్ - తెలుగు నిఘంటువుల నిర్మాణం అధ్యయంలో తెలుగు — ఇంగ్లీషు నిఘంటువు పీఠికలో బ్రౌన్ ఇచ్చిన గ్రంధాల లిస్టు (అనవసరం) తిరిగి ఎత్తివ్రాసి గ్రంధకర్త చేర్చారు. బ్రౌన్ వ్రాసిన ఇంగ్లీషు అర్థంకాకనో, తొందరపాటుతోనో విపర్యాసాలు అనేకం దొర్లేయి.

39. గరుడాచలం—సంగీత గ్రంథం :The very popular Poem in సంగీతం musical measures అని బ్రౌన్.*

యక్షగానమని దీని అర్థం.

41, 42. ఉత్తర హరిశ్చంద్ర ద్విపద — కంచి శరభయ్య,
" " — నెల్లూరి శంకర కవి.

ఈ రెండూ పద్య కృతులే.

## 16. భల్లాణ చరిత్ర - శూద్రకార్యం.

వాలేశ్వరుడు చెప్పిన భల్లాణ చరిత్ర. This is very popular Sudra romance; telling an adventure of the deity Siva, with the wife of Bhallana.

బ్రౌను ఇచ్చిన లిస్టు కొత్తగా పునర్ముద్రించిన (1966) తెలుగు నిఘంటువులో ఉండగా తిరిగి ఎత్తివ్రాయడం — దాంట్లో తప్పులు — పోనీ బ్రౌన్ చేసిన పొరబాట్లనైనా సంస్కరించక పోవడం, బ్రౌను లిస్టులో లేకుండా నిఘంటు భాగంలో ఉన్న లలితార్చనావిధి, ప్రభావతి ప్రభుత్వం, బిరబిళాశ్వచరిత్ర, ఉత్తర హరివంశం, కవితారత్నాకరం మొదలయిన గ్రంథాలను పేర్కొక పోవడం చూస్తే పరిశోధన చేసినట్టు కనిపించదు.

ఈ విధంగా ఈ గ్రంథం పరిశోధనగ్రంథంకాదని, యాధాలాభంగా వ్రాసినా, పాఠశాలలకు అని దృష్టిలో పెట్టుకొని వ్రాసినా, ఈతరంవారికి అనిచెప్పి తయారు చేసినా దోషాలకు తావులేకుండా చెయ్యడమే గ్రంధకర్త విద్యుక్త ధర్మమని మనవి చేస్తూ గ్రంధకర్త ముందు మాటలో చెప్పకొన్న స్వీయప్రగల్భ వాక్యాలకు ఈ గ్రంథం దర్పణంకాదని, కనీసం ఇక ముందైనా ప్రస్తుత గ్రంధకర్తలే కాకుండా, కల్తీ పరిశోధన సరుకును సాహిత్యపు అంగళ్ళలో దింపుతున్న ఇతరులూ నాణ్యమైన సరుకును అందిస్తారని ఆశిద్దాం.

— ఒక విలేఖరి

## కావ్య నిదానము (Literary criticism)

[గ్రంధకర్త :- సాహితీ శిల్పి' రూపనగుడి నారాయణ రావుగారు, ప్రతివెల :- ఆరు రూపాయలు, ప్రతులకు :- మహానంది పబ్లికేషన్సు; బ్లాక్ నెంబరు 522/A, శాంతినగర్, గుంతకల్లు.]

ఇది సాహిత్య విమర్శగ్రంథం గ్రంధకర్త శ్రీ నారాయణ రావుగారు స్వర్గస్థులు. ఈ గ్రంధంలో మొత్తం పదమూడు వ్యాసాలున్నాయి. ఈ వ్యాసాలన్నీ లలితకళలకు సంబంధించినవి. కేవల సాహిత్య విమర్శేకాక సంగీతం, చిత్రలేఖనం, శిల్పం, నృత్య, నృత్త, నాటకాదులకు సంబంధించిన చర్చకూడ ఈ గ్రంధంలో స్థానం ఏర్పరుచుకున్నది. ఈ విమర్శనా గ్రంధం నన్నయయుగం ఆదిగా ప్రబంధ యుగం వరకూ పరిమితమైంది.

కళ అంటే ఏమిటి ? కళోత్పత్తి, కళాభ్యుదయ పరిణామాలు, కళాప్రయోజనం, సారస్వత — వాఙ్మయ - సాహిత్యాలకు గలభేదాలు మొదలైన అంశాలపై విమర్శ సాగింది. తదుపరి కవి కుండవలసిన ముఖ్యలక్షణాలు, జీవితానికి — కళకు ఉన్న సంబంధం, కవిత్వనిర్వచనాలు, ఉత్తమ కవిత్వాని కుండవలసిన లక్షణాలు, కవిత్వనిరూపణం—మొదలగు అంశాలపై రచయిత చిత్తశుద్ధితో (వారిమార్గంలో) చర్చసాగించారు.

'కళోత్పత్తి' అనే వ్యాసంలో కళోత్పత్తికి ఆరు ప్రధాన కారణాలను చెప్పారు. 1) కళోత్పత్తికి మానవునిలోగల భయాశ్చర్య ప్రేమ రసములే మూలకారణములు. 2) లౌకిక ప్రయోజన కారణములు — అనగా నైహిక జీవితావశ్యకములు తీరిన తరువాతనే జనులకు సుందరమగు బాహ్య ప్రపంచము మీదను, ఇంపైన భావ ప్రపంచముమీదను దృష్టినిలిచి, వారు కళా సృష్టికి గడంగుదురు. 3) ధైర్య సౌర్య సాహసోదారాది కార్యములందు జనులకుండునభిరతి కళాప్రేరకమై పరగును. 4) కళలయందును, నాటకము లందుబోలె స్వేచ్ఛ, అభిరుచి, ఆహ్లాదము, ఆత్మావిష్కరణము నుండుటచే, కళలానందదాయకములై యుండును. 5) నాగరికతా చిహ్నములగు శాంతి, విశ్రాంతులొదివినపుడే, మానవుని శక్తిసామర్థ్యములు నిలువయై వృద్ధిపొంది కళాభిరచనారూపముగా బరిణమించును. 6) అభ్యాసవశమున కళాభిరచన క్రీడాప్రవృత్తిగా నగపడి యానందదాయకమై యుండును.

హృదయ జన్యమైన మనోవికారములే కళా సృష్టికి మూల మనే వీరి సిద్ధాంతాన్ని మానిషాద శ్లోకంలో సమర్థించుకున్నారు, 'కళాభ్యుదయ పరిణామములు' అనే వ్యాసంలో. 'కళాప్రయోజనం' అనే వ్యాసంలో కళోపాసన అంటే సౌందర్యోపాసన అని తీర్మానించి కళా ప్రయోజనాన్ని మూడు విధాలుగా విభజించారు. మొదటి ప్రయోజనం సౌందర్య విషయమైనది. రెండవ ప్రయోజనం విద్యా బుద్ధుల విషయమైనది మూడవ ప్రయోజనం ఆధ్యాత్మిక విషయమైనది. ప్రయోజన నిర్ణయంలో రచయిత అరవిందులమార్గాన్ని అనుసరించారు. ఆనందంలోనే సంతోషం, ప్రేమ, సౌందర్యం అనే మూడు రసాలుంటాయని చెబుతూనే 'ఈ సౌందర్య ప్రేమానందములే యాత్మ వికాసమునకు బరమ సాధనము' లంటున్నారు ఇక్కడ పాఠకుడు అయోమయ స్థితిలో పడకతప్పదు. 'ఉత్తమ ప్రతిభావంతునివలన నారిష్కృతమగు కళయే నిజమైన యుత్తమ కళ' అనిరచయిత చెప్పడంలో దోషం ఎంతమాత్రమూలేదు ఎవడు ప్రతిభావంతుడు? అని ప్రశ్నిస్తే 'నా భావానికి నచ్చినవాడే ప్రతిభావంతుడు' అనే మార్గంలో తెలుగు సాహిత్య విమర్శ నడుస్తోంది. 'ఆనందమేకదా కళల యొక్క పరమోద్దేశము' అంటున్నారు

రచయిత. కేవలానందమే కళా ప్రయోజనం అనే వాదం పూర్వ పక్షమై చాలా కాలమయింది. ఆనందంలోంచి ఆలోచన, ఆలోచన లోంచి ఆచరణ ఉద్భవించకపోతే ఆ కళాప్రయోజనం శూన్యం. అర్థకామాలను మాత్రమే ఆశించే వారు మెటీరియలిస్టులని వీరి అభిప్రాయం. మెటీరియలిజం యొక్క సమగ్ర స్వరూపాన్ని దర్శించక పోవడంవల్ల వచ్చిన అనర్థం ఇది.

'జీవితము – కళ' అనే వ్యాసంలో "సంఘ జీవితము నాగరక స్థితియందున్నప్పుడు దానికి తగినయసంస్కృత కళయే పుట్టును. సంఘమునకు అభ్యున్నతిగాంచినపు డుత్కృష్టమైన కళ యుద్భవించును" అని ఒక తీర్మానాన్ని చేశారు రచయిత. దీనితో అందరూ ఏకీభవించవలసిన అవసరం లేదు. సంఘప్రభావం కళమీద, కళప్రభావం సంఘంమీద పడక తప్పదు. కళ, సంఘం ఈ రెండూ పరస్పరాశ్రితాలేగాని వేరుకావు. సమాజం అనాగరిక మైనపుడు కళాకారుడు సమాజాన్ని నాగరికం చెయ్యడానికి తన కళను ఉత్తమ సాధనంగా ఉపయోగిస్తాడు. అలాంటి కళ అనాగరికం కాదు; కావలసిన అగత్యం లేదు. అనాగరికాన్ని క్షాళనం చేసే ఒకానొక పవిత్ర ఆయుధం అవుతుంది కళ. సమాజం సుసం పన్నమైనపుడు నాగరికమైన కళ ఉద్భవిస్తుందని చెప్పడానికి సాక్ష్యాధారాలు ఏమీలేవు. రాయల యుగంలో (రాయల కాలంనాడు సమాజంలో అన్ని వర్గాలు నాగరకంగా ఉన్నయా? అంటే అది వేరే చర్చ) నాగరక సమాజమే వర్ధిల్లినదని చరిత్ర కారులు చెబు తున్నారు. ప్రబంధ కవిత్వమంతా నాగరికమైనదేనా ?

కవిత్వనిర్వచనాలవలన కవితా స్వరూపం మనకవగతంకాదని రచయిత చెబుతున్న విషయంలో విప్రతిపత్తిలేదు. కవిత్వమంటే ఇది అని స్పష్టంగా ఏ నిర్వచనం చెప్పలేదు. అది కారణంగా 'కవిత్వ నిరూపణము' 'కవిత్వనిరూపణము తిక్కనార్యునికవిత్వము' అనే రెండు వ్యాసాల్లో కవిత్వ తత్త్వ పరంగా సాగించిన చర్చ రచయిత యొక్క స్వోపజ్ఞకు తార్కాణం. ఈ రెండు వ్యాసాల్లో కవితావిమర్శస్థాయి రచయిత వ్యక్తిత్వాన్ని ఇనుమడింపచేసేదిగా ఉంది. బహుముఖీనమైన ఆయన వ్యుత్పత్తి, ప్రతిభ ఈ రెండు వ్యాసాల్లో ద్యోతక మవడం ఈ గ్రంథనామానికి అన్వర్థమయింది.

గ్రంథం ముగింపులో రచయిత పేర్కొన్న అంశం సర్వదా ఆమోద యోగ్యమైనది. "కాళిదాసునికి మునులపట్లను, మున్యా శ్రమముల పట్లను, మునుల జీవితము పట్లను, శ్రీ వీరేశలింగము గారికి సంఘము పట్లను, సంఘ సంస్కరణము పట్లను నభిమాన మధికము; కావుననే వారి మనంబులాయావిషయంబుల మీద నవ లీలచాలి వానిని వర్ణించు నవకాశమచ్చినపుడంతయు వారిలేఖినులు గడు విజృంభించుచుండెడివి. ఆ సమాన ధర్మములు గల పాఠకులా యావిషయంబులం జదువునప్పుడు తమ యభిమానముం బ్రదర్శిం చుటచేత అవి నవ్య మాత్రములుగ గోచరిల్లుచుండును." కవులు వారి వైయక్తికాభిమానాలను పునాదిగా చేసుకుని కవిత్వంరాస్తారు. ఆ భావనతో మమైక్యం చెందే పాఠకులు ఆ కవిత్వం చది ఆనందిస్తారు. కవులలో వర్గాలమాదిరిగానే పాఠకుల్లో, విమర్శ కుల్లో కూడ వర్గాలుంటాయి అని రచయిత అన్యాపదేశంగా అంగీ కరిస్తున్నారు. సాహిత్య వ్యవస్థలో ఈ స్థితి పూర్వం ఉండ ఇప్పుడూ ఉంది; ఎప్పుడూ ఉంటుంది.

శ్రీ బి. ఎల్ కాంతారావు

# వచనామృతము

(వచనామృతము – కర్త : జోళదరాసి కె. దొడ్డన గౌడ – డెమ్మీ, 53 పుటలు, వెల : 3–50, ప్రాప్తిస్థానము : జోళదరాసి దొడ్డన గౌడ షష్ఠ్యబ్దిపూర్తి నిధి (ట్రస్టు, బళ్లారి.)

ఈ గ్రంథము కన్నడ భాషయందు ప్రత్యేక విశిష్టత గడి చిన వచన వాఙ్మయమునకు సంబంధించినది. కన్నడమున నా పే గ్రంథమున కనువాదము. గ్రంథకర్తలు ప్రసిద్ధులు. ఆంధ్ర కన్న రంగ భూమియందు విజయ పతములను గొన్న విజేతలు, కళానిధి, గమక కళానిధి బిరుదాంకితులు. ఆంధ్ర కన్నడ భ 11 గ్రంథములు రచించినారు. ఇది వారి షష్ఠ్యబ్దిపూర్తి ప్రచురణ. ఇందు 35 పుటలలో ప్రస్తావన గలదు. కన్నడ వచన వాఙ్మయ విశిష్టత తెలుపబడినది. ఇందు గ్రంథవచనముల కనువాదముగలదు.

1) బసవణ్ణగారి వచనములు.
2) చెన్నబసవణ్ణగారి వచనములు.
3) అల్లమ ప్రభుదేవర వచనములు
4) సిద్ధరామదేవుని వచనములు.
5) మహాదేవి అక్కగారి వచనములు.
6) ఆదయ్యగారి వచనములు.
7) అఖండేశ్వర వచనములు.
8) ఇతర శివశరణుల రచనలు.

భక్త, మహేశ్వర, లింగ, ప్రసాద, శరణ, ఐక్య షట్ స్థ ములను గూర్చి వచనములు గలవు. ఇందున్న వచనములు 153.

అల్లమ ప్రభుని లింగలీలా విలాసము శూన్య సంపాదనముం వచనములు గలవు.

బసవన వచనములకు ప్రాధాన్యము నీయబడినది. అనువాద సరణి కుదాహరణ.

"నాలుక గురు, కన్నులు లింగము ముక్కు ఆచారము
చెవులు ప్రసాదము హస్తమును గమము
భావము మహాలింగము కూడలి చెన్న సంగమయ్యా
నీ శరణుండు సర్వాంగ ప్రసాది."

కళాప్రపూర్ణ నిడుదవోలు వెంకట

Printed and Published for Nageswara Rao Estate (Private) Ltd., by S. Radhakrishna at the Andhra P
Press, Gandhinagar, Vijayawada-3. Editor S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 75